శ్రీః

శ్రీమదుమాపతిశివప్రణీతః

# శ్రీ కుఞ్చితాఙ్ఘ్రిస్తవః

తెనుగు తాత్పర్యంతో



ప్రకాశకులు

**శ్రీమతి రావి కృష్ణకుమారి**

404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523155

శ్రీః

# ముందుమాట

శ్రీ కుంచితాంఘ్రిస్తవమనే ఈ స్తుతిని రచించిన కవి శ్రీ ఉపాపతిశివ నామధేయుడైన ఉద్దండ పండితుడు. ఇతడు శాలివాహన శకం 1200 సం॥లు పిమ్మట శ్రీముఖ సంవత్సరం పుష్యమాసం శుక్లపక్ష త్రయోదశి సోమవారం వృషభలగ్నంలో చిదంబరక్షేత్రంలో బ్రాహ్మణకులానికి చెందిన శంభుదీక్షితులనే ఇంకొకపేరుగల నటరాజ దీక్షితులకు, గౌరి అనే దంపతుల కుమారుడుగా జన్మించాడు. ఈ కవి గోత్రం శ్రీవత్స గోత్రం. యజశ్శాఖీయుడు. బోధాయనగృహ్యసూత్రావలంబి. ఉమాపతిశివుని మాతామహుని గోత్రం విశ్వామిత్ర గోత్రం, వేదం - ఋగ్వేదం, సూత్రం - ఆశ్వలాయనం. పాషండమతాన్ని అణచి శైవాన్ని స్థాపించగోరి, దేవతల ప్రార్థనకై పరమేశ్వరుడే తన అంశతో ఉమాపతి శివుని రూపంలో అవతరించాడని సాంప్రదాయిక విశ్వాసం.

ఈ కవి జన్మించిన సమయంలో ఈయనవద్ద నటరాజస్వామి తేజస్సు ప్రకాశించి నందున సాక్షాత్తుగా నటరాజస్వామియే అవతరించారని అందఱు భావించారు. ఇతడు బాల్యంలో చేసిన అద్భుతకృత్యాలు అనేకం. సకాలంలో ఉపనయన సంస్కారాన్ని పొందిన ఉమాపతిశివుడు తండ్రివద్ద, శౌనక, జైమిని, కుశిక, మధ్యందిన, కణ్వ, వ్యాసాది మహర్షులవద్ద వేదాది సకల శాస్త్రాలను అభ్యసించారు శ్రీ మందిరమూర్తి దీక్షితులనే పెద్దల వద్ద విద్యోపదేశాన్ని పొంది, శ్రీశివసుందరిసన్నిధిలో శ్రీవిద్యాజపయజ్ఞాన్ని అనుష్ఠించి, అంబికకృపను, అణిమాదిసిద్ధులను పొందారు.

యుక్త వయస్సులో ఈయన మేనమామ, సభేశదీక్షితుల పుత్రిక పార్వతి అనేకన్యకను వివాహమాడారు. ఈమెవల్ల ఉమాపతికి శ్రీమూలనాథుడు (వీరే చిదంబర యంత్రోద్ధార వ్యాఖ్యాత), వృషభధ్వజుడు - అనే ఇద్దఱు పుత్రులు, సుశీల అనే పుత్రిక జన్మించారు.

ఉమాపతి 26 సంవత్సరాల వయస్సులో ఉమాపతి మహావ్రతమనే గొప్ప యాగాన్ని నిర్వహించారు. అపుడు, ప్రధానదినంలో దేవేంద్రుడు వీరిముందు ప్రత్యక్షమై, యాగంలోని ప్రధాన హవిస్సును తనచేతులలో ఇమ్మని అన్నాడు. ఆమాట విని ఉమాపతి దేవేంద్రుని

పూజించి, అగ్నిలో సమర్పించడమే విధి – అని పల్కి దేవేంద్రునకు హవిస్సును చేతిలో ఇవ్వడానికి తిరస్కరించారు. ఇంద్రుడు చాలా సంతోషించి, "ఆ విధంగా చేసి యాగాన్ని పూర్తి చేయి. నీ ఆయుస్సు ఈనాటితో తీరనున్నది. పరమేశ్వరుని ఆజ్ఞానుసారం నిన్ను ఈవిధంగా పరీక్షించాను. నీకు ఇప్పటి నుండి 50 ఏళ్ళ ఆయుర్దాయం ఇస్తున్నాను. భూమిలో దుర్మతాలను నిరసించి, వైదికమతస్థాపన చేసి, శైవసిద్ధాంతాన్ని ప్రచారం చేస్తావు." అని పల్కి అంతర్ధానమయ్యాడు.

ఉమాపతిశివుడు శ్రీపతంజలి మునివద్ద పాతంజలయోగవిద్యను అభ్యసించి, ఆ విద్యాశక్తితో నాగచ్చేరిలోని హ్రదంలోగల బిలద్వారం ద్వారా కైలాసాన్ని చేరి, అక్కడ పరమశివుని దర్శించి, ఆ స్వామి అనుగ్రహాన్ని పొందాడని, ఆ పర్వతచరియలలో ఉండే పలువురు సిద్ధులను మునులను దర్శించి, వారివల్ల శైవసిద్ధాంతరహస్యాలను పూర్ణంగా అవగతం చేసికొన్నాడని చెప్పబడుతున్నది.

మఱైజ్ఞానసంబంధర్ వద్ద ఉపదేశం పొంది వారినుండి సకలాగమాలను పొంది, అందులోని శైవ సిద్ధాంతసారాలను సంస్కృత ద్రావిడభాషలలో వ్యక్తంచేసిన మహనీయులు ఉమాపతిశివాచార్యులు. తన తల్లి మరణించిన తరువాత, సకల సంపదలను తన కుమారులకు అప్పజెప్పి భార్యతో కలసి వానప్రస్థాశ్రమాన్ని "వెళ్ళైకుళమ్" అనేచోట ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని అక్కడ గడుపుతూ, పలువురు శిష్యులకు బోధిస్తూ జీవితశేషాన్ని గడిపి శివైక్యాన్ని పొందారు.

ఒకానొక సమయంలో నటరాజస్వామికి ఆషాఢ మాసంలో జరిగే మహోత్సవంలో ఎంత ప్రయత్నించినా ధ్వజారోహణాన్ని అర్చకులు చేయలేకపోయిన సమయంలో ఉమాపతిశివాచార్యులు ఆశువుగా నాల్గుపాశురాలను చెప్పి ధ్వజారోహణం జరిగేటట్లు చేశారని, మూడు పర్యాయాలు కాశ్మీరము ఆకాశమార్గంలో పయనించి, సర్వజ్ఞ పీఠాన్ని అధిరోహించి సకల శాస్త్రాలలో తమ సామర్థ్యాన్ని చాటారని అక్కడ శైవమతాన్ని స్థాపించి అపరశంకరులుగా కీర్తింపబడ్డారని పలు బిరుదులను పొందారని – ఈ విధంగా వీరి చరిత్ర అంతా అత్యాశ్చర్యకరం. శ్రీచిదంబర బ్రహ్మ యతివర్యులు వీరి చరిత్రను 14 సంస్కృత శ్లోకాలలో వెలయించారు.

ఉమాపతిశివాచార్యుల పలుకృతులలో **శ్రీకుంచితాంఘ్రిస్తవం** ఒకటి. ఇది చిదంబరక్షేత్రం నటరాజస్వామిని స్తుతిస్తూ రచింపబడిన 313 స్రగ్ధరా వృత్తాలతో కూర్పబడింది. పలు అద్వైత సిద్ధాంత విశేషాలతో, శైవాగమ విశేషాలతో కూడిన ఈ స్తుతి

నటరాజస్వామి మహిమను విస్తృతం కీర్తిస్తున్నది. చిదంబరాలయంలో జరిగే పూజా విశేషాలు, యంత్రవిశేషాలు ఇందులో ప్రస్తావింపబడ్డాయి. పలు ఐతిహాసిక, పౌరాణిక, శ్రుతి, స్మృతులలోని వృత్తాంతాలు, ద్రావిడదేశంలో ప్రాంతీయం ప్రసిద్ధాలైన చరిత్రలు ఇందులో గోచరిస్తాయి. చిదంబర యంత్ర మంత్ర విశేషాలుకూడా కన్పిస్తాయి. క్లుప్తంగా ఇది **చిదంబరనటరాజవైభవ సర్వస్వ**మని చెప్పవచ్చు.

పూర్వం ఈ గ్రంథం శ్రీ మీనాక్షినాథులచే రచింపబడిన సంస్కృతవాఖ్యానంతో ముద్రింపబడింది. ఈమధ్యలో 2007వ సంవత్సరంలో శ్రీరాజగణేశదీక్షితులచే తమిళంలో రచింపబడ్డ తాత్పర్యంతో శ్రీనటరాజవిద్యాసభ ద్వారా ముద్రింపబడింది. కాని, తెలుగుభాషలో, లిపిలో ఇంతవరకు ఇది ఆంధ్రపాఠకలోకానికి అందలేదు. ఈ కొఱత తీరడం కోసం ఈ అపూర్వకృతి తెలుగులో కూర్పబడిన తాత్పర్యంతో ప్రకాశింపజేయ బడుతున్నది. ఆస్తిక పాఠకులీ ప్రయత్నాన్ని ఆమోదిస్తారని భావిస్తాను.

**కించిత్ కుంచిత వామపాదవిలసన్మంజీర మంజుక్వణత్-**
**చంచత్కాంచనకింకిణీ ఝణఝణాకారావబద్ధం జగత్ ।**
**కాలీతండవఖండనం ప్రవిలసత్ గండోల్లసత్ కుండలం**
**చండం రక్షతు చండికాపతి భవం సంపత్కరం తాండవమ్ ॥**



శ్రీమదుమాపతిశివ ప్రణీతమైన
'**శ్రీకుఞ్చితాఙ్ఘ్రిస్తవము**'నకు తెనుగున తాత్పర్యమందించిన
అస్మదీయ ప్రియమిత్రుడు, సోదరతుల్యుడైన మహాపండితునకు
**నమస్సుమాంజలులు.**
పఠితలు ఈ గ్రంథమును '**అధ్యయనాధ్యాపనానుష్ఠానము**'ను
గావింతురుగాక.

**– రామోరా.**



**-- శ్రీరస్తు --**

**శ్లో॥ శ్రీమత్తిల్వవనే సభేశసదనప్రత్యక్కకుబ్గోపురా-**
**ధోభాగస్థితచారుసద్మవసతిః భక్తేష్టకల్పద్రుమః ।**
**నృత్తానన్దమదోత్కటో గణపతిః సంరక్షతాద్వోఽనిశం**
**దుర్వాసః ప్రముఖాఖిలర్షివినుతస్సర్వేశ్వరోఽగ్ర్యోఽవ్యయః ॥ 1**

సర్వమంగళములు నిండుగా ఉండే తిల్వవనంలో (చిదంబరంలో) నటరాజస్వామి ఆలయంలో పశ్చిమదిశగా ఉండే గోపురానికి అధోభాగంలో అందంగా కోష్ఠంలో ప్రకాశించే వాడు, భక్తుల మనోరథాలను ఈడేర్చుడంలో కల్పవృక్షం వంటివాడు, నృత్తంలో అధికమైన ఆనందంతో కూడినవాడు, దుర్వాసాదిసర్వమునులచేత విశేషంగా స్తుతింపబడే వాడు, అన్నిటికి ఈశ్వరుడు, అందటికంటె ముందున్నవాడు, నాశంలేనివాడైన వినాయకుడు మిక్కిలిగా మనలను రక్షించాలి.

**శ్లో॥ శ్రీనుత్తిల్లవనాభిధం పురవరం క్షుల్లావుకం ప్రాణినాం**
**ఇత్యాహుర్మునయః కిలేతి నితరాం జ్ఞాతుం చ తత్ సత్యతామ్ ।**
**ఆయాంతం నిశి మస్కరీంద్రమపి యో దుర్వాససం ప్రీణయన్**
**నృత్తం దర్శయతి స్మ నో గణపతిః కల్పద్రుకల్పోఽవతాత్ ॥ 2**

అందమైన, తిల్లవనమనే పేరునుకల ఈ పట్టణం ప్రాణులకు ఆకలిని పోగొడుతున్నది – అని మునులు పల్కుతున్నారు కదా! దానిలోని వాస్తవాన్ని తెలిసికొనగోరి, రాత్రివేళలో వచ్చినవాడు, సంన్యాసులలో గొప్పవాడైన దుర్వాసమునిని ఏ వినాయకుడు సంతోషించే టట్లుగా చేసి, తన నర్తనాన్ని చూపించాడో, అటువంటి, కల్పవృక్షంవంటి, గణపతి మనలను కాపాడాలి.

(పూర్వం ఒకానొక సమయంలో దుర్వాసుడు తన శిష్యులతో కలిసి "**అన్నమ్ పొలిక్కుమ్ శిట్రంబలమ్**" (శిట్రంబలమ్ అనే ఈ క్షేత్రం అన్నాన్ని పుష్కలంగా ఇస్తున్నది.) అనే పూర్వుల మాటను పరీక్షించదలచి, రాత్రిలో సగంజాము కాలం గడచిన తరువాత 'భిక్ష, భిక్ష' అని వీథిలో ఎలుగెత్తి అరచినా, అపుడు ఎవరూ భిక్షను పెట్టలేదు. అపుడు అతడు కోపించగా, అంబిక దుర్వాసుని ముందు ప్రత్యక్షమై, భిక్షను పెట్టింది. దానిని దుర్వాసుడు తీసికొన్నప్పటికీ, నటరాజు నాట్యదర్శనం అయితే తప్ప భిక్షను భుజించనని అన్నాడు. అపుడు అంబిక తన పుత్రుడైన వినాయకుని పిలిపించి, ఆ నాట్యాన్ని చూపించి దుర్వాసునకు ఆనందాన్ని కల్గించింది – అని చిదంబరరహస్యంలో తెలుపబడింది.)

**శ్లో॥ దేవాన్ నృత్తదిదృక్షయా పశుపతేరభ్యాగతాన్ కామినః**
**శక్రాదీన్ స్వయముద్ధృతం నిజపదం వామేతరం దర్శయన్ ।**

**దత్వా తత్తదభీష్టవర్ధమనిశం స్వర్గాదిలోకాన్ విభుః**
**నిత్యే యశ్శివకామినాథతనయః కుర్యాత్ శివం వోఽన్వహమ్ ॥ 3**

ఏ ప్రభువైన నటరాజుయొక్క కుమారుడు వినాయకుడు, నటరాజ నాట్యాన్ని దర్శించగోరి వచ్చినవాడు, ఫలాలను ఆశించేవాడైన ఇంద్రుడు మొదలైన దేవతలకు పైకెత్తబడిన తన కుడిపాదాన్ని కనుపింపజేసి ఇష్టాలను అన్నిటిని ఇచ్చి, స్వర్గాది లోకాలను పొందేట్లు చేశాడో, అటువంటి వినాయకుడు ఎల్లప్పుడు మనకు శుభాలను కల్గించాలి.

**శ్లో॥ అస్మాకం పురతశ్చకాస్తు భగవాన్ శ్రీకల్పకాఖ్యోఽగ్రణీః**
**గోవిన్దాదిసురార్చితోఽమృతరసప్రాప్త్యై గజేన్ద్రాననః ।**
**వాచం యచ్ఛతు నిశ్చలాం శ్రియమపి స్వాత్మావబోధం పరం**
**దారాన్ పుత్రవరాంశ్చ సర్వవిభవం కాత్యాయనీశాత్మజః ॥ 4**

కాత్యాయనీశ్వరి కుమారుడు, భగవానుడు శ్రీ కల్పకమనే పేరునుకలవాడు, అగ్రగణ్యుడు, అమృతాన్ని పొందగోరి విష్ణువు మొదలైన దేవతలచే పూజింపబడినవాడు, గజముఖాన్ని కలవాడు అయిన వినాయకుడు మన ముందు సాక్షాత్కరించాలి. వాక్కును, చలించని సంపదను, మంచి భక్తిని, పుత్రులను, సర్వ విభవాలను, ఆత్మజ్ఞానాన్ని ఇవ్వాలి.

**శ్లో॥ వన్దే కల్పకకుంజరేన్ద్రవదనం వేదోక్తిభిః తిల్లభూ-**
**దేవైః పూజితపాదపద్మయుగలం పాశచ్ఛిదం ప్రాణినామ్ ।**
**దన్తాదీనపి షడ్భుజేషు దధతం వాంఛాప్రదత్వాప్తయే**
**స్వాభ్యర్ణాశ్రయికామధేనుమనిశం శ్రీముఖ్యసర్వార్థదమ్. 5**

కల్పకమనే పేరును కలవాడు, గజముఖాన్ని కలవాడు, వేదంలో చెప్పబడిన రీతిలో తిల్లైనగరంలోని బ్రాహ్మణులచే పూజింపబడే వాడు, జీవుల పాశాన్ని ఛేదించేవాడు, దంతం మొదలైన ఆఱు ఆయుధాలను చేతులతో ధరించినవాడు, జీవులకు వారి ఇష్టాన్ని కల్గించే సామర్థ్యాన్ని పొందగోరి, తనవద్దకు వచ్చి ప్రార్థించే కామధేనువును కలవాడు, సంపత్తు మొదలైన అభీష్టాలను ఇచ్చేవాడైన వినాయకుని నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ ఔమాపత్యమిమం స్తవం ప్రతిదినం ప్రాతర్నిశం యః పఠేత్**
**శ్రీమత్కల్పకకుంజరాననకృపాపాంగావలోకాన్నరః ।**
**యం యం కామయతే చ తం తమఖిలం ప్రాప్నోతి నిర్విఘ్నతః**
**కైవల్యశ్చ తథాన్తిమే వయసి తత్సర్వార్థసిద్ధిప్రదమ్ ॥ 6**

ఉమాపతిచేత చేయబడిన, ఈ సర్వార్థసిద్ధి అనే స్తుతిని ప్రతిదినం ఉదయం, సాయంకాలం ఎవడు పఠిస్తాడో, అతడు కల్పకవినాయకుని కృపావీక్షణాలవల్ల, ఏ ఏ ఫలాలను కోరుతున్నాడో, వాటిని ఏ విఘ్నంలేకుండా పొందుతున్నాడు. చివరలో మోక్షాన్ని పొందుతున్నాడు.

శ్రీమదుమాపతిశివప్రణీతశ్రీకల్పకగణపతిస్తవం సమాప్తం

ఓం

శ్రీగణేశాయ నమః

శ్రీచిత్సభేశాయ మంగళమ్

# శ్రీకుఞ్చితాఙ్ఘ్రిస్తవః

## శ్రీమదుమాపతిశివప్రణీతః

**శ్లో॥ కుఞ్చితాఙ్ఘ్రిం నమస్కృత్య కుణ్డలీకృతగాయకమ్ ।**
**కుఞ్చితాఙ్ఘ్రిం స్తవం వక్ష్యే బ్రహ్మనిష్ఠ ఉమాపతిః ॥**

ఎల్లప్పుడు శివాభిన్నబ్రహ్మాన్ని ధ్యానించే, ఉమాపతి అనే పేరుగల నేను కంబళాశ్వ-ధరులనే నాగగాయకులను కుండలాలుగా అలంకరించుకొన్నవాడు, వంచి పైకెత్తబడిన వామపాదాన్ని కలవాడైన **నటరాజు**కు నమస్కరించి, ఈ **కుంచితాంఘ్రిస్తవ**మనే గ్రంథాన్ని రచిస్తున్నాను.

**శ్లో॥ బ్రహ్మాణ్డం యస్య దేహం రవిజదిశి పదో వక్త్రబృన్దాన్యుదీచ్యాం**
**తద్వైరాజాన్తరజ్జే విలసతి హృదయామ్భోరుహే దక్షిణాగ్రే ।**
**మధ్యే సమ్మేలనాఖ్యే మునివరమనసా భావితే యన్త్రరాజే**
**యశ్శక్త్యా నృత్యతీశస్తమపి నటపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥** 1

ఎవనికి ఈలోకం దేహమో, ఎవని కాళ్ళు దక్షిణదిక్కులో చాచబడి ఉన్నవో, ఎవని శిరస్సులు ఉత్తరదిక్కులో నిలుపబడినవో, అటువంటి "**విరాట్**" అనే పురుషుని మధ్యలో వెలిగేవాడు, దక్షిణముఖంగా హృదయపద్మం నడుమ సమ్మేళనమనే పేరును కల (శ్రీ

చక్రం, చిదంబర చక్రం – అనే ఈ రెండు చక్రాల సమ్మేళనాన్ని) ముని శ్రేష్ఠులచే (పతంజలి, వ్యాఘ్రపాదుడు, జైమిని, సహస్రమునీశ్వరుడు, తిరుమూలవర్ – మొదలైన పెద్దలచే) భావింపబడిన యంత్రరాజంలో ఏ నటరాజు తనకు అభిన్నమైన శివకామసుందరితో నటనం చేస్తున్నాడో, అటువంటి నటపతి, కుంచితాంఘ్రిని (కొంచెం పైకి ఎత్తి, మడచి ఉంచిన ఎడమ పాదాన్ని) కలవాడైన నటరాజమూర్తిని నమస్కరిస్తున్నాను. 1

---

**శ్లో॥ పఞ్చాశత్కోటిసంఖ్యా పరిమితధరణి శ్రీవిరాడాఖ్యధాత్రో**
**రేకస్వాన్తాబ్జభిత్తిస్థితకనకమహాయన్త్రరాట్కర్ణికాయామ్ ।**
**నృత్యన్తం చిత్సభేశం త్రిసృభిరపి సదా శక్తిభిస్సేవితాఙ్ఘ్రిం**
**నాదాన్తే భాసమానం నవవిధనటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 2**

యాభైకోట్ల యోజనాల దూరం కల (యోజనం అంటే – 10 మైళ్ళ దూరం) భూమి, విరాట్ పురుషుడు – అనే ఈ ఇద్దఱికి స్థానమైన హృదయకమలంలో ఉండే సువర్ణమయమైన మహాయంత్రం నడుమ (కర్ణిక)లో నాట్యం చేసేవాడు, చిత్సభకు పతి, ఇచ్ఛ, జ్ఞానం, క్రియ – అనే మూడు శక్తులచే ఎల్లప్పుడు సేవింపబడేవాడు, నాదాంతంలో భాసించేవాడు, తొమ్మిది విధాలైన నాట్యాలను కలవాడు, కుంచితాంఘ్రిని కలవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 2

---

**శ్లో॥ యస్మిన్నామూలపీఠావధికనకశిలామాతృకావర్ణ కప్తే**
**బ్రహ్మశ్రీనాథరుద్రేశ్వరశరముఖభాక్సామ్బసాదాఖ్యమూర్ధ్ని ।**
**భూతైశ్శాస్త్రైశ్చ వేదైః స్తుతబహుచరితం స్తమ్భరూపైశ్చ కుడ్యే**
**నృత్యన్తం చిత్సభేశం నిరవధిసుఖదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 3**

ఈ శ్లోకం నుండి వరుసగా 4 శ్లోకాలతో **చిత్సభ** వర్ణింపబడుతున్నది.

చిత్సభలో క్రిందనుండి పైవరకు కల బంగారు శిలలు మాతృకాక్షర రూపాలు. అటువంటి సభలో పీఠరూపులైన బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుని అయిదు ముఖాలు, మనోన్మణి అనే శక్తితో కూడిన సదాశివుడు, వీరికి పైన వెలిగే భిత్తిలో (రహస్యమని చెప్పబడే స్థానంలో) నర్తనాన్ని చేసేవాడు, స్తంభరూపాలలో ఉండే పంచభూతాలు, షట్ శాస్త్రాలు, నాల్గు వేదాలు – అనే వీటిచే స్తుతింపబడే అనేకవిధాలైన చరిత్రలను కలవాడు,

చిత్సభలో ఈశ్వరుడు (నటరాజస్వామి ఉండే సభకు చిత్సభ – అనిపేరు) అధిక సుఖాన్ని ఇవ్వగల్గినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 3

శ్లో॥ యత్సంసత్పూర్వభాగే దిశిదిశి విలసత్పూర్వభాగా నితాన్తం
స్వాన్తగూఢోత్తరాంశాశ్శివముఖభవనాశ్చాగమాః కామికాద్యాః ।
అష్టావింశానుసంఖ్యాధృతకనకమయస్తమ్భరూపాస్తువన్తి
స్తుత్యం తం నృత్తమూర్తిం శ్రుతిశతవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥4

ఈ చిత్సభలోని నాల్గు భాగాలలోను పరమశివుని ముఖం నుండి వ్యక్తమైన కామికాది ఇరవై ఎనిమిది ఆగమాలు సువర్ణమయస్తంభరూపాన్ని పొంది, ఆ నటరాజును స్తుతిస్తున్నాయి. అటువంటి కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 4

శ్లో॥ యద్గోష్ఠ్యాం ద్వారబాహ్యే రజతగిరినిభం పఞ్చవర్ణస్వరూపం
సోపానం ద్వారభాగం జయవిజయముఖే రక్షితం ద్వారపాలైః ।
తత్త్వానాం షణ్ణవత్యా సహ విధిముఖరాః పఞ్చదేవాశ్చ నిత్యం
యస్యాన్తర్భాన్తి తస్మిన్నవిరతనటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 5

ఈ సభలోని దక్షిణదిక్కు వెలుపల కైలాసపర్వతంవంటి పంచాక్షరిస్వరూపం, జయవిజయాది ద్వారపాలకులచే రక్షింపబడే దక్షిణదిక్కు (సోపానద్వారభాగం) 96 తత్త్వాలతోకూడ బ్రహ్మ మొదలైన అయిదుగురు దేవతలు రక్షిస్తున్నారు. అటువంటి సభ మధ్య నర్తనం చేసే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 5

శ్లో॥ యత్స్తూపాశ్శక్తిరూపాః తదధరవిలసద్రోమరూపాశ్చ కీలా
ఉచ్ఛ్వాసాః స్వర్ణపట్టాః తదురనిహితా దణ్డరూపాశ్చ నాడ్యః ।
నాడ్యన్తస్సర్వలోకాః ఫలకతనుగతా హస్తరూపాః కలాశ్చ
తస్యాం యో నృత్యతీశః తమనుపమతనుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥6

ఈ చిత్సభయొక్క స్థూపాలు తొమ్మిది – తొమ్మిది మంది శక్తుల స్వరూపాలు. అందులో బిగింపబడిన (నాటబడిన) చీలలు – రోమకూపాలు. అందులోని సువర్ణమయాలైన పట్టలు – 21 వేల అయిదువందల ఉచ్ఛ్వాస నిఃశ్వాసాలు, దానికింద ఉండే దండ రూపాలు – 72 వేల నాడీస్వరూపాలు, దానికింద ఉండే పలకలు – నాడిలోపల ఉండే

సర్వలోకాలు, అరవైనాల్గు కళా స్వరూపాలును. ఆ విధమైన చిత్సభలో నాట్యంచేసే అసమాన రూపాన్ని కల కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 6

**శ్లో॥ విఘ్నేశస్కన్దలక్ష్మీవిధిముఖశరరాట్పాదుకావజ్రలిఙ్గ-**
**జ్యోతిర్నృత్తస్వరూపై వరుణముఖజుషా హాటకాకర్షమూర్త్యా ।**
**స్వాగ్రే దక్షే చ వామే పరివృతసదసి శ్రీశివానాయకో యో**
**మధ్యే నృత్తం కరోతి ప్రభువరమనఘం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 7**

చిత్సభ లోపల పూజింపబడే దేవతలను ఇందులో కవి వివరిస్తున్నారు.

గణపతి, స్కందుడు (సుబ్రహ్మణ్యస్వామి), లక్ష్మి, బ్రహ్మయొక్క అయిదవ తల (ముఖలింగం), అస్త్రదేవులు, పాదుకలు, చంద్రమౌళీశ్వరుడు, రత్నసభాపతి, వరుణముఖాన్ని కల స్వర్ణాకర్షణ భైరవుడు - అనే వీరిచే, ఇంకా నృత్తసేవకులైన అన్యదేవతలచే ముందు, కుడిఎడమలలో పరివృతమై ఉండే ఆసభమధ్య ప్రభువు, అనఘుడైన నటరాజస్వామి నాట్యం చేస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 7

**శ్లో॥ ఆదౌ మాసే మృగాఖ్యే సురగురుదివసే తస్య మే పూర్ణిమాయాం**
**భిత్తౌ శ్రీచిత్సభాయాం మునివరతపసా దత్తవాక్పూతయే యః ।**
**నృత్తం కృత్వావసానే ఫణధరవపుషం వ్యాఘ్రపాదం మహర్షిం**
**చాహూయాభ్యాం అదాత్ యో నియతనివసతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥8**

పరమేశ్వరుడు త్రై(పుష్య)మాసం గురు పుష్యమితోకూడిన పౌర్ణమిలో పతంజలి, వ్యాఘ్రపాదులకు ఇచ్చిన వరాన్ని పూర్తిచేయడంకోసం చిత్సభలో ఉండే గోడలో తన నటన స్వరూపాన్ని సాక్షాత్కరింపజేసి, దానికి చివరలో వారి అభీష్టానుసారం తన ముందు భాగంలో వారు ఉండేటట్లు అనుగ్రహించాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 8

**శ్లో॥ యస్మిన్నృత్యత్యనాదౌ నికటతటగతౌ భానుకమ్పాఖ్యబాణౌ**
**శఙ్ఖధ్వానైః మృదఙ్గధ్వనిభిరపి మహామ్భోధి ఘోషం జయన్తౌ ।**
**యస్యోఙ్కారప్రభాయాం ధ్వనిమనుసహితారశ్మయశ్చైకవింశా**
**విద్యన్తే తం సభేశం నతసురనికరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 9**

ఆది, అంతంలేని ఈశ్వరుడు నాట్యం చేసేటపుడు భానుకంపుడు, బాణుడనే ఇద్దరు శంఖధ్వనితో, మృదంగవాద్యధ్వనితో సముద్రఘోషను జయించారు. ఈశ్వరుని ప్రభలో ధ్వని మంత్రాక్షరాలతో నిర్మింపబడిన ఇరవై ఒక్క జ్వాలలు వెల్గుతున్నవి. (ధ్వని మంత్రం అనేది చిదంబర మంత్రభేదం). అటువంటి సభకు ఈశ్వరుడు, దేవతలచే నమస్కరింపబడే వాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 9

---

**శ్లో॥ పూర్వం మాధ్యన్దినిర్యచ్ఛివజనిమవరం పూజయన్ యత్ప్రసాదాత్**
**లబ్ధ్వా వ్యాఘ్రాఙ్ఘ్రిభావం తనయమపి శివానుగ్రహోద్దుగ్ధసిన్ధుమ్ ।**
**ఆనీయాస్మై ప్రదత్వా సదసి చ పరమ ద్రష్టవాన్ యస్య నృత్తమ్**
**తం దేవం చిత్సభేశం నిగమనుతగుణం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 10**

పూర్వం ఒకానొక సమయంలో మాధ్యందిని అనే పేరును కల ఒకముని (మధ్యందిన ముని కుమారుడు) ఈశ్వరుని (శ్రీమూలనాథుని) పూజించి, ఆ ఈశ్వరుని అనుగ్రహంతో పులికాళ్ళు చేతులతో కూడిఉండే స్థితిని పొందాడు, ఉపమన్యువనే పుత్రుని పొంది, ఆ పుత్రుని కోసం క్షీరసముద్రాన్ని రప్పించాడు. చిత్సభలో ఈశ్వరుని నటనను దర్శించాడు. అటువంటి, వేదాలచే కీర్తింపబడే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 10

---

**శ్లో॥ యన్నృత్తధ్యానయోగద్విగుణితతనుభృత్ శ్రీశసంవాహభుగ్న-**
**స్వాంగశ్శేషః కదాచిద్ధరిముఖకమలోత్పన్నయద్వృత్తమాధ్వీమ్ ।**
**పీత్వా తప్త్వాతిఘోరం రజతగిరిబిలద్వారమార్గేణ యస్య**
**క్షేత్రం ప్రాప్యాన్వపశ్యన్నటనమధిసభం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 11**

ఈశ్వరుని తాండవాన్ని గూర్చి భావించిన కారణంవల్ల రెండింతలుగా చేయబడిన శరీరభారాన్ని కల విష్ణువును వహించినందున శ్రమను పొందిన ఆదిశేషుడు (పతంజలి) ఒకసమయంలో ఆ విష్ణువుచే చెప్పబడిన (ఈశ్వరుని) నటనం యొక్క వృత్తమనే మధువును పానం చేసి, దానిని చూడగోరి చిరకాలం చాలా ఘోరమైన తపస్సును చేసి, శివుని ఆజ్ఞానుసారం కైలాసంలో ఉండే బిలద్వారం ద్వారా చిదంబరక్షేత్రాన్ని చేరి, అక్కడ శివుని నాట్యాన్ని దర్శించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 11

---

**శ్లో॥ ఆదౌ యః కర్మకాణ్డప్రవచనమహిమా జైమినిర్నామ యోగీ**
**వ్యాసోక్త్యా చిత్సభేశం ప్రభువరమురసాఽఽనమ్య గత్వా సభాన్తః ।**

**పాదాన్తే వేదయుక్తం స్తవవరమకరోత్సర్వసౌభాగ్యదం యమ్**
**పశ్యన్నద్యాపి దేవం సదసి వసతి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 12**

పూర్వం ఒకానొక సమయంలో కర్మకాండను ప్రవచించే జైమిని అనే మునివరుడు తన గురువైన వ్యాసుని మాటతో జ్ఞానాన్ని పొందగోరి, చిదంబరక్షేత్రాన్ని చేరి, ప్రభువైన నటరాజుకు నమస్కరించి, సభలోపల ప్రవేశించి, శివుని నాట్యాన్ని దర్శించి **వేదపాద**స్తవమనే స్తుతితో స్తుతించి, సదా స్వామిని దర్శిస్తూ ఉన్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 12

---

**శ్లో॥ గౌడేశ స్సింహవర్మా స్వతనుగతరుజా వ్యాకులస్స్వీయదేశాత్**
**ఆగత్య స్వర్ణపద్మాకరవరసలిలస్నాననిర్ముక్తరోగః ।**
**భూత్వా శ్రీహేమవర్మా మునివరసహితశ్శమ్భునృత్తఞ్చ దృష్ట్వా**
**యత్ప్రాసాదం విచిత్రం మణిమయమకరోత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥13**

గౌడదేశ ప్రభువైన సింహవర్మ తన శరీరంలో కల్గిన రోగం కారణంగా మనోవ్యాధిని పొందినవాడై, తన దేశాన్ని విడచి, ఏదో ఒక పూర్వపుణ్యవశం చేత చిదంబరక్షేత్రాన్ని చేరాడు. శివగంగలో స్నానం చేయగానే రోగవిముక్తుడయ్యాడు. హేమవర్ముడనే పేరును పొంది, వ్యాఘ్రపాదుడు మొదలైన మునులతో కలిసి, శంభువు (శివుని) నటనను దర్శించి, నటరాజాలయాన్ని విచిత్రంగా, మణిమయంగా నిర్మించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 13

---

**శ్లో॥ ఆమ్నాయేష్వప్యనన్తేష్వనితరసులభాన్భిన్నసంస్థాన్విధీన-**
**వ్యాహృత్య శ్రీఫణీన్ద్రో నటయజనమహాప్రోక్షణార్థఞ్చ సూత్రమ్ ।**
**కృత్వాదౌ దత్తవాన్ యత్తదుదితవిధినా యం సదాఽఽరాధయన్తి**
**త్రైసాహస్రం ద్విజేన్ద్రాః తమపి నటపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥14**

పతంజలి భగవానుడు, వేదశాఖలలో ఇతరులచే గ్రహించడానికి సాధ్యం కాకుండా ఉండేటట్లు అక్కడక్కడ అధ్యయనం చేయబడిన విధులను సమీకరించి, నటరాజమూర్తియొక్క నిత్యపూజామహోత్సవం, సంప్రోక్షణం మొదలైన వానికి సూత్రరూపమైన ఒక గ్రంథాన్ని రచించి, త్రిసహస్రమునులనే దీక్షితులకు ఇచ్చాడు. ఆ దీక్షితులు, ఆ ప్రకారాన్ని తప్పకుండా, ఆ నటరాజమూర్తిని వంశపారంపర్యంగా పూజిస్తున్నారు. అటువంటి కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 14

---

శ్లో॥ నిత్యం షట్కాలపూజాం నటనపతిముదే కుర్వతాం భూసురాణాం
తద్భక్తానాం ద్విజాదిప్రముఖ తనుభృతాం సౌఖ్యదాతాభ్రకుంసః ।
స్వస్థానే లిఙ్గమేకం స్ఫటికమణిమయం మజ్జనాదీని కర్తుం
యజ్వభ్యో దత్తవాన్ యస్తమతిసుఖకరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 15

(భక్తులకందఱికి సౌఖ్యాన్ని కల్గించేవాడైన, నటరాజమూర్తి, ఆఱు కాలాలలో తనను పూజించడం కోసం దీక్షితుల వద్ద స్ఫటికమణిమయమైన తన ప్రతిరూపమైన ఒక లింగాన్ని (చంద్రమౌళీశ్వరుని) సృష్టించి ఇచ్చాడు.) నిత్యం షట్కాలపూజను నటరాజస్వామి ఆనందం కోసం చేసే భూసురులకు, బ్రాహ్మణాది జాతులలో పుట్టిన నటరాజస్వామి భక్తులకు సౌఖ్యాన్ని కల్గించే ఈశ్వరుడు తన ప్రతిరూపమైన, స్ఫటికమణిమయమైన లింగాన్ని అభిషేకాదులతో పూజించడంకోసం నిర్మించి ఇచ్చాడు. అటువంటి వాడు, గొప్పసుఖాన్ని కల్గించేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 15

శ్లో॥ అన్తర్వేద్యాం మహత్యాం శతధృతిరకరోదబ్దసహస్రసాధ్యం
యజ్ఞం తస్మిన్ మునీంద్రాస్సదసి సమభవన్ వ్యాఘ్రపాదోక్తిభిర్యే ।
తత్పూజార్థం శిఖీన్ద్రప్రభావమణినటః ప్రేషితో యేన మోదాత్
తన్మూర్తేర్మూలభూతం నవమణిమకుటం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 16

ఒకానొక సమయంలో బ్రహ్మ, అంతర్వేది అనే గొప్ప క్షేత్రంలో వేయి సంవత్సరాల కాల వ్యవధిలో సాధించదగిన ఒక యాగాన్ని చేశాడు. అపుడు, వ్యాఘ్రపాదుని మాటతో అక్కడ దీక్షితులు సదస్యులుగా వరింపబడ్డారు. ఆ కాలంలో పూజచేయడంకోసం అహవనీయకుండం నుండి పరమశివుని అనుగ్రహంతో రత్నసభాపతి అనే ఒక రూపాన్ని సృష్టించి వారికి ఇవ్వబడింది. ఆ మూర్తికి మూలమై, తొమ్మిది రత్నాలతో పొదగబడిన కిరీటాన్ని కలవాడైన కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 16

శ్లో॥ నిత్యం పుణ్యాహమాదౌ గురువరనమనం శోషణాదిత్రయఞ్చ
భౌతిం శుద్ధిం కరాఙ్గప్రణవసురముఖన్యాసజాతం చ కృత్వా ।
జప్త్వా మంత్రాన్ సమస్తాన్ శివమయతనవశ్చాన్తరారాధ్య యం ప్రాక్
విప్రా బాహ్యే యజన్తి ప్రభువరమపి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥17

ఈ శ్లోకం నుండి అయిదు శ్లోకాలలో పూజాక్రమం తెలుపబడుతున్నది.

ప్రతిదినం, ఉదయకాలంలో మొదట పుణ్యాహవాచనం, గురుశ్రేష్ఠుల అభివాదనం, భూతశుద్ధి, కరణన్యాసం, అంగన్యాసం, ప్రణవన్యాసం, దేవతాన్యాసం ఇత్యాదులతో కూడిన సకల న్యాసాలను చేసి, తరువాత మూలమంత్రాలను జపించి, శివమయమైన శరీరాన్ని భావించి, హృదయంలో నటరాజస్వామిని పూజించి, తరువాత బాహ్యపూజను నటరాజ స్వామికి బయట దీక్షితులు చేస్తున్నారు. అటువంటి గొప్ప ప్రభువైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 17

---

**శ్లో॥ స్థానాది ప్రోక్ష్య పాద్యాచమనమపి సుమైరర్చయిత్వాథ శంఖం**
**గవ్యార్చాం కుమ్భపూజాం జలయజనవృషాభ్యర్చనే ద్వారపూజామ్ ।**
**కృత్వా విఘ్నాదిపూజాం స్ఫటికజనిమరత్నేశయోః మజ్జనాద్యైః**
**యన్మూర్తిం పూజయన్తి ప్రతిదినమనఘాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥18**

స్థానాలను ప్రోక్షణం చేసి, పాద్యం, ఆచమనం అర్పించి పూలతో అర్చించి, శంఖాన్ని పూజించి పంచగవ్య స్నపనం చేసి, వృషభాన్ని ద్వారదేవతలను, సభలోపల ఉండే గణపతి మొదలైన దేవతలను అర్చించిన తరువాత స్ఫటికలింగాన్ని, రత్నసభాపతిని, నటరాజమూర్తిని భావించి, అభిషేకాదులతో ప్రతిదినం పరిశుద్ధులైన దీక్షితులు పూజిస్తున్నారు అటువంటి కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 18

---

**శ్లో॥ గవ్యైస్తైలైః పయోభిర్దధిఘృతమధుభిశ్శర్కరాభిశ్చ శుద్ధైః**
**పశ్చాత్పఞ్చామృతాద్యైః లికుచఫలరసైః కైరపాథోభిరన్నైః ।**
**గన్ధైః గఙ్గాదిరన్యైరనుదినమనఘా యస్య లిఙ్గం మునీంద్రాః**
**షట్కాలం పూజయన్తి ప్రభుమపి తమజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥19**

పంచగవ్యం, తైలాలు, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, చక్కెర, పంచామృతం, నిమ్మపండు మొదలైన పలు రసాలు, లేతకొబ్బరినీరు, అన్నం, చందనం, గంగాజలం మొదలైన వానితో ప్రతిదినం పరిశుద్ధులైన దీక్షితులు ఆఱు కాలాలలోను పరమేశ్వర స్వరూపమైన చంద్రమౌళీశ్వర లింగాన్ని పూజిస్తున్నారు. అటువంటి ప్రభువు, ఉత్పత్తి లేనివాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 19

---

**శ్లో॥ భిత్త్వా శ్రీచక్రసంస్థాం తదను నటపతిం శైవచక్రాన్తరస్థం**
**తద్వామే యుగ్మహస్తామపి చ శుకకరాం జ్ఞానశక్తిఞ్చ యష్ట్వా ।**

**గో్బ్రహ్మాదీనభేష్ట్వా సకలవిధచరూనర్పయిత్వా బలీంస్త్రాన్**
**హోమం కృత్వా యజన్తి ప్రతిదినమపి యం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥20**

చిత్సభలోని రహస్యకుడ్యంలో ఉండే శ్రీచక్రంలో ప్రకాశించే అంబికను, తరువాత, దానిని వ్యాపించి ప్రకాశించే చిదంబరచక్రమంత్రంలో ఉండే నటరాజస్వామిని, దాని కుడివైపున ఉండే, రెండు చేతులను కల్గిన అంబికను పూజచేసి, వృషభాది నృత్తసేవకులను అర్చించి, సకల విధాలైన నివేదనలను చేసి, తర్వాత, బయట ప్రాకారంలో ఇంద్రుడు మొదలైన దేవతలకు బలి ప్రదానం చేసి, యాగశాలలో నిత్యహోమం చేసి పరమేశ్వరుని ప్రతిదినం దీక్షితులు పూజిస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 20

---

శ్లో॥ **ధూపైర్దీపైరథాఖ్యైః ఫణిపురుషవృషైః కుమ్భపఞ్చాగ్నిహోత్రైః**
**ఋక్షైః కర్పూరభస్మవ్యజనవరసితచ్ఛత్రకైశ్చామరైశ్చ ।**
**ఆదర్శైః మంత్రపుష్పైరుపరితలసుకర్పూరకైః ప్రార్చ్యయన్ ద్రాక్**
**త్యక్త్వాఽవిద్యాం ప్రపశ్యన్త్యనుదినమనఘాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥21**

ధూపం, దీపం, రథదీపం, నాగదీపం, పురుషమృగదీపం, వృషభదీపం, హిరణ్య పాత్రదీపం, పంచాగ్నిహోత్రదీపం, నక్షత్రదీపం, కర్పూరదీపం, భస్మం, విసనకర్ర, గొడుగు, చామరం, అద్దం, మంత్రపుష్పం తరువాత కర్పూరదీపం – అనే వీటితో నటరాజస్వామికి ఉపచారం చేసి, అవిద్యారూపమైన తిరస్కరిణిని (తెర)ను తీసి ఆ నటరాజస్వామికి రహస్య–స్థానంలో ప్రతిదినం దీక్షితులు దర్శనం చేస్తున్నారు. భక్తులకు దర్శింపజేస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 21

---

శ్లో॥ **యద్గేహప్రాన్తబాహ్యే దశవృషసహితాన్యబ్జపీఠాని నిత్యం**
**శక్రాదీనాం త్రికాలేష్వపి బలిహరణే పీఠముత్తుఙ్గమన్యత్ ।**
**యద్బాహ్యే దిక్షు చాగ్రే నవశిఖరిసమా భాన్తి దణ్డా ధ్వజానాం**
**తద్గేహాన్తస్సభాయాం అనవరతనటం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 22**

చిత్సభ వెలుపల నాల్గు వైపుల ఉండే పది వృషభాలతో కూడిన బలిపీఠాలు ప్రతిదినం మూడు కాలాలలోను ఇంద్రాది దిగ్దేవతలకు బలిప్రదానం చేయడంకోసంగా ప్రకాశిస్తున్నాయి. ఆ విధంగానే పర్వతాలతో సాటి వచ్చే తొమ్మిది ధ్వజస్తంభాలు ప్రకాశిస్తున్నాయి. అటువంటి సభలో సదా నాట్యం చేసే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 22

---

శ్లో॥ ప్రత్యబ్దం జ్యేష్ఠమాసే నవవృషసహితాః కేతవో భాన్తి మాఘే
మాసే పఞ్చధ్వజాస్స్యుః మృగశిరసి తథా కేతురేకః ప్రధానః ।
యస్య బ్రహ్మోత్సవానాం నవశరశిఖినిశ్చైకవహ్నిః ప్రధానః
తం దేవం చిత్సభేశం నవనిధినిలయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ **23**

నటరాజస్వామికి ప్రతిసంవత్సరం ఆని (జ్యేష్ఠ) మాసం, మాశి (మాఘమాసం), మార్గశీర్షమాసాలలో జరిగే మహోత్సవాలలో తొమ్మిది, అయిదు, ఒకటి ధ్వజారోహణాలు, ఆ క్రమంలోనే అగ్నిలో హోమాలు అనుష్ఠింపబడుతున్నాయి. అటువంటివాడు, చిత్సభకు పతి, ప్రసన్నుడైనవాడు, నవనిధులకు నిలయుడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 23

శ్లో॥ యస్యాద్యే సప్తవింశత్యమలదినమహే ఋత్విగగ్ర్యా నవ స్యుః
మాఘే పఞ్చర్త్విగగ్ర్యా మృగశిరసి శివరోత్సవే చైక ఏవ ।
నిత్యార్చాస్వేక ఏకో యజనకృత ఇమే యజ్వవర్యేషు శుద్ధాః
తం దేవం చిత్సభేశం నిరుపమితతనుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ **24**

నటరాజమూర్తి మహోత్సవాలలో జ్యేష్ఠ (ఆని), మాఘ (మాశి), మార్గశీర్ష (మార్గళి) మాసాలు మూడింటిలో 27, 18,9 దినాలు, ఆ రీతిలోనే తొమ్మిది మంది, అయిదుగురు, ఒక ఆచార్యులు నిత్యపూజలో ఒక్కొక్కరుగా నియోగింపబడతారు. అటువంటివాడు, ఉపమానరహితమైన స్వరూపాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 24

శ్లో॥ ఆదౌ కృత్వాగ్నిహోత్రం వపనపవనమంత్రాచమానాని పశ్చాత్
కుశ్మాణ్డైర్దేహశుద్ధిపదయజనముఖం వాస్తుపర్యగ్నికర్మ ।
నాన్దీమృత్స్వంకురాణి ప్రతిసరమృషభప్రోక్షణం యన్మహేష్వ-
ప్యారాదారోహయన్తి ధ్వజపటమనఘాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ **25**

నటరాజస్వామి ఉత్సవాలలో మొదట అగ్నిహోత్రాన్ని అనుష్ఠించి, వపనం, పవనమంత్రాచమనం, కూశ్మాండహోమం, వాస్తుశాంతి, నాంది, మృత్సంగ్రహణం, అంకురార్పణం, రక్షాబంధనం, వృషభప్రోక్షణం – అనే వీటిని అనుష్ఠించి, తరువాత

ధ్వజారోహణాన్ని పరిశుద్ధులైన దీక్షితులు అనుష్ఠిస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 25

---

**శ్లో॥ మఞ్చే చన్ద్రార్కభూతేష్వపి వృషగజరాడ్రాజతాద్రిష్వథాశ్వే**
**సోమాస్కందస్వరూపస్స్వయమురునయనే గోరథేమాగణో యః ।**
**స్థిత్వా బ్రహ్మోత్సవేషు త్రిషు చ నటపతిః ప్రత్యహం వీథియాత్రాం**
**కృత్వా స్నాత్వా సదస్స్వం ప్రవిశతి శివయా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥26**

ఈవిధంగా ఆ బ్రహ్మోత్సవాలలో నటరాజస్వామి సోమస్కందరూపాలతో వేంచేసి ఉండి, మంచం, చంద్రుడు, సూర్యుడు, భూతం, వృషభం, ఏనుగు, కైలాసపర్వతం, అశ్వం – అనే వాహనాలలో, గొప్పరథంలో, చిత్రరథంలో భిక్షాటన రూపిగా ప్రతిసంవత్సరం జరిగే బ్రహ్మోత్సవాలలో ప్రతిదినం వీథియాత్రను చేసి, శివగంగలో స్నానమాడి, (వేయి కాళ్ళమండపంలో అభిషేకాదులను స్వీకరించి) అంబికతో కలిసి తన చిత్సభను చేరుతున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 26

---

**శ్లో॥ క్రోడేన శ్రీశనామ్నా చరణసరసిజం యస్య శమ్భోర్న దృష్టం**
**హంసేన బ్రహ్మనామ్నా న మకుటశిఖరం యస్య దృష్టం కిలాసీత్ ।**
**ఓంకారే నిత్యవాసం త్రిదలసుమవరైరర్చ్యమానాఙ్ఘ్రియుగ్మం**
**హంసం హంసైరుపాస్యం హరిహరవపుషం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥27**

నటరాజస్వామియొక్క పాదాలు రెండు ఆదివరాహస్వామిచేకూడా దర్శింపబడలేదు. ఈ ఈశ్వరుని మకుటాగ్రం హంసరూపి అయిన బ్రహ్మచే దర్శించడానికి సాధ్యం కానిది అయినది. ఓంకారంలో నివసించేవాడు, బిల్వం, పుష్పం మొదలైనవానిచే పూజింపబడే రెండు పాదాలను కలవాడు, పరమాత్మ స్వరూపి, సన్న్యాసులచే ఉపాసింపబడేవాడు, శంకరనారాయణమూర్తి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 27

---

**శ్లో॥ పూర్వం జ్ఞానోపదేశం మణిమయవచసే కున్దవృక్షస్య మూలే**
**కృత్వాసాదిత్వమాప్త్వా నృపతికరలసత్ స్వర్ణవేత్రప్రహారమ్ ।**
**లబ్ధ్వా తేనోక్తగానైర్మధురసభరితై స్తృప్తిమాప్త్వాథ తస్మై**
**ముక్తిం ప్రాదాద్య ఈశస్తమఖిలసుహృదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥28**

ఈశ్వరుడు పూర్వం ఒకానొక సమయంలో కుందవృక్షం మూలంలో ఉండి (ఆవుడై యార్ కోయిల్) మణివాచకర్ అనే భక్తునకు జ్ఞానోపదేశాన్ని చేసి, అతనిని అనుగ్రహింపదలచి గుఱ్ఱపురౌతు రూపాన్ని ధరించి, తర్వాత మట్టిని మోసిన సమయంలో పాండ్యరాజు చేతిలో ఉండే బంగారుబెత్తం దెబ్బలు తిని, ఆ మణివాచకర్‌చేత చెప్పబడిన మిక్కిలి తీయని తిరువాచకమ్, తిరుక్కోవైయార్ – అనే ప్రబంధాల గానాలతో తృప్తిని పొంది, తర్వాత ఆ మణివాచకర్‌కు ముక్తిని అనుగ్రహించాడు. అటువంటివాడు, అందఱికి సుహృత్తు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 28

---

**శ్లో॥ దేవో యః పుల్కసాయ ద్విజకులజనుషే వల్కలస్యాత్మజాయ**
**నన్దాభిఖ్యాయ ముక్తిం కణతృణసుధియే దత్తవాన్ భక్తివశ్యః ।**
**నిత్యత్వం వ్యాఘ్రపాదప్రథితఫణిపతిస్తోత్రకృత్ జైమినిభ్యః**
**తాంస్తాన్కామాంశ్చ సర్వాన్ తమజరమమరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥29**

పరమేశ్వరుడు బ్రాహ్మణుడైన పుల్కసునకు వల్కలుని కుమారుడైన వాల్కలి అనే వానికి, నందుడనే తిరునాళైప్పోవార్ నాయనార్‌కు, కణమ్ పుల్లనాయనార్‌కు ముక్తిని అనుగ్రహించాడు. ఆరీతిలోనే భక్తికి వశ్యుడై వ్యాఘ్రపాదుడు, ప్రసిద్ధుడైన పతంజలి, వేదపాదస్తవాన్ని రచించిన జైమిని – అనే వీరికి వారు కోరిన ఆయా మనోరథాలను అన్నిటిని ఇచ్చినవాడు, అజరుడు, అమరుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 29

---

**శ్లో॥ ఆహృత్య బ్రహ్మశీర్షం సకలజనిమతాం దర్శనాయస్వదక్షే**
**పార్శ్వే సంస్థాప్య పూర్వం శ్రుతివదనవిధిం వామతోఽస్థాపయద్యః ।**
**అద్యారభ్యాత్మయోనే మదుపహృతహవిశ్శేషభుక్త్వం భవేతి**
**స్వాజ్ఞాప్యాకాశరూపస్తమపి నటపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 30**

నటరాజస్వామి అయిన పరమేశ్వరుడు పూర్వం ఒకానొక కాలంలో అయిదు తలలున్న కారణంచేత గర్వించిన బ్రహ్మదేవుని అయిదవ తలను కోసి, సకలజనులకు తెలుపగోరి ఆ తలను కుడివైపున ఉంచి, తిరిగి ఆలయం లేనందువల్ల బాధపడి, తనను సేవించే, నాల్గు ముఖాలను కల బ్రహ్మదేవుని "ఓ బ్రహ్మదేవా! ఈనాటి నుండి నీవు నిర్మాల్య హవిస్సును భుజించు" అని ఆజ్ఞాపించి, తన వామభాగంలో ఆలయంతోకూడిన వానినిగా చేశాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 30

**శ్లో॥ పార్థాయస్వాస్త్రదానం పశుపతిరకరోద్యః పురా రాజతాద్రౌ**
**యుద్ధం తేనైవ కృత్వా వనచరతనుభాక్ భిన్నశీర్షస్తథాసీత్ ।**
**భీమస్వాన్తార్చానాఢ్యై స్త్రిదలసుమవరైశ్ఛన్నగాత్రో నితాన్తం**
**జాతస్తం చిత్సభేశం నిఖిలతనుగతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 31**

పశుపతి వేటగాని రూపాన్ని ధరించి, కైలాసశిఖరసమీపంలో తపస్సు చేసిన అర్జునునితో యుద్ధం చేసి, అతనికి గాండీవమనే వింటియొుక్క దెబ్బతో పగులగొట్టబడిన శిరస్సును కలవాడయ్యాడు. ఆ పార్థుని కోసం తన పాశుపతాస్త్రాన్ని ఇచ్చాడు. భీమసేనుని మానసపూజలో అర్పింపబడిన బిల్వపుష్పాలతో మఱుగు పరచబడిన శరీరాన్ని కల వాడయ్యాడు, అటువంటివాడు, సకల శరీరాలలో వ్యాపించి ఉండే కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 31

**శ్లో॥ ఆసీన్మేరుశ్శరాసో ధరణిరపిరథో జ్యాఽభవత్సర్పరాజోఽ**
**ప్యాస్తాం చక్రేఽర్కసోమౌ సరసిజనిలయస్సారథిః యస్య శమ్భోః ।**
**ఆసన్నాశ్వశ్చ వేదా జలనిధిశరధే స్త్రైపురం హన్తుమిచ్ఛోః**
**హేతుం తం లోకసృష్టిస్థితిలయకరణే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 32**

త్రిపురసంహారాన్ని చేయాలనే ఇచ్ఛ కలవాడు, సముద్రాన్ని అంబులపొదిగా కలవాడైన శంభువునకు మేరు పర్వతం విల్లుగా, భూమి రథంగా, ఆదిశేషుడు వింటినారిగా, సూర్యచంద్రులు రథానికి రెండు చక్రాలు, బ్రహ్మ రథసారథిగా, వేదాలు గుఱ్ఱాలుగా అయినవి. అటువంటివాడు, లోకాలను సృష్టించడం, రక్షించడం, లయంచేయడం – అనే వీటికి కారణమైనవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 32

**శ్లో॥ క్షీరాబ్ధేర్మన్దరాద్రి ప్రమథనసమయేఽప్యుత్థితే కాలకూటే**
**గచ్ఛత్సు ప్రాప్యభీతిం నిఖిలసురకులేష్వప్యనాదిః పురస్తాత్ ।**
**ఆవిర్భూయ ప్రభుర్యస్సకలసురగణాన్ ప్రాశ్య తం కాలకూటం**
**సద్యోఽరక్షత్తమీశం తుహినగిరినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 33**

పాలకడలిని మందరపర్వతంతో చిలికే సమయంలో కాలకూటమనే విషం పుట్టింది. అపుడు చాలా భయపడిన దేవతలు నాల్గు దిశలలో పరుగెత్తి పోయారు. ఆ సమయంలో ఆదిలేనివాడైన ప్రభువు ఆ దేవతలకు ముందు ప్రత్యక్షమై ఆ కాలకూటాన్ని మింగి, వెంటనే

వారిని రక్షించాడు. అటువంటివాడు, హిమాచలంచేత స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 33

---

శ్లో॥ **కృత్వా జమ్బూఫలాభం విషమఖిలజగద్భక్షణే జాగరూకం**
**స్వాస్యే ప్రక్షేపమాత్రాన్నిజజఠరవసత్ప్రాణిసౌఖ్యాయ దేవీ ।**
**కణ్ఠం సంగృహ్య హస్తాత్ప్రియముఖకమలం వీక్షమాణా కిలాసీత్**
**తాం దృష్ట్వాఽన్వగ్రహీద్యస్తమఖిలవరదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥34**

లోకాలను భక్షించే విషయంలో మిక్కిలి జాగరూకంగా (ఉత్సాహంగా) ఉండే ఆ కాలకూటవిషాన్ని ఒక నేరేడు పండువలె చేసి దానిని తన కంఠంలో శివుడు వేసికొన్నంత మాత్రంలో, ఆతని ఉదరంలో ఉండే సమస్త ప్రాణుల క్షేమంకోసం అంబిక తన చేతితో శివుని కంఠాన్ని స్పృశించి, నాయకుడైన అతని కమలంవంటి ముఖాన్ని చూచింది. అపుడా దేవిని చూచి పరమేశ్వరుడు అనుగ్రహించాడు. అట్టివాడు అన్నివరాలను ఇచ్చేవాడైన కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 34

---

శ్లో॥ **మార్కణ్డేయే పురా శ్రీరజతగిరిపతేర్లిఙ్గపూజాప్రవృత్తే**
**పాశైః కర్షత్యథార్కౌ భయకరవదనే లిఙ్గమధ్యాన్మహేశః ।**
**ఆగత్యారక్షదేతం మునిమథ శమనం మారయామాస దేవః**
**యస్తం నిత్యం నటేశం నిఖిలనృపనుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 35**

పూర్వం ఒకానొక సమయంలో మార్కండేయుడనే మునికుమారుడు కైలాసనాథుని లింగపూజను చేసే తరుణంలో భయంకరమైన ముఖాన్ని కల యముడు పాశాలతో ఆ మునికుమారుని కట్టి ఈడ్చగా, అపుడు మహేశ్వరుడు లింగంమధ్యలోనుండి ప్రత్యక్షమై, ఆ మార్కండేయుని రక్షించాడు. యముని సంహరించాడు. అటువంటివాడు, నిత్యం సమస్త ప్రభువులచేత స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 35

---

శ్లో॥ **సృష్ట్వా బ్రహ్మాణమాదౌ శ్రుతిగణమఖిలం దత్తవాన్యో మహేశః**
**తస్మై నిర్మాల్యభుక్తం స్వసదసి విలసత్పుఞ్ఛపీఠాధరత్వమ్ ।**
**సూతత్వం స్వస్య మూర్ధస్థితమకుటవరప్రేక్షణే హంసభావం**
**తం దేవం చిత్సభాయాం స్థితిజుషమమలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥36**

లోకం పుట్టడానికి ముందు మహేశ్వరుడు ముందుగా బ్రహ్మను సృష్టించి, వేదభాగాలను అన్నిటిని అతనికి ఉపదేశించి అనుగ్రహించాడు. ఆ బ్రహ్మదేవుని కోసం తన నిర్మాల్యాన్ని భుజించడాన్ని, తన సభలో వెలిగే అయిదు పీఠాలలో కింది పీఠంగా ఉండే స్థితిని, రథసారథిగా ఉండే స్థితిని, తన కిరీటాగ్రాన్ని అన్వేషించేటపుడు హంసపక్షి రూపంతో ఉండే స్థితిని అనుగ్రహించాడు. అటువంటివాడు, చిత్సభలో ఎల్లప్పుడు భాసించేవాడు, త్రివిధ దోషరహితుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 36

---

**శ్లో॥ యో మారః ప్రేషితోఽభూత్సవిధమసురోత్సారితైస్స్వర్గిభిః స్వం**
**యోగారూఢాత్సమాధేశ్చలయితుమచలే రాజతేఽనన్యదృష్టిమ్ ।**
**తం మారం ఫాలనేత్రజ్వలనహతతనుం యోఽకరోద్దక్షిణాస్యః**
**సేవాహేవాకలక్ష్మీపతిముఖనిబిడం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 37**

పూర్వం ఒకానొక సమయంలో శివుడు అంబికను వీడి, కైలాసపర్వతంలో యోగసమాధిలో ఉండే తనను చలించేటట్లు చేయడంకోసం అసురులచే ప్రేరేపింపబడిన దేవతలచే మన్మథుడు తన (శివుని) సమీపానికి పంపబడ్డాడు. ఆ మన్మథుని, దక్షిణదిక్కులో ముఖాన్ని కలవాడైన ఈశ్వరుడు తన ఫాలనేత్రంలో ఉండే అగ్నిలో హోమం చేయబడిన శరీరాన్ని కలవానినిగా చేశాడు. అటువంటివాడు, సేవ చేసే కాలంలో దీనమైన వచనాలను పలికే విష్ణువు మొదలైన దేవతలచే పరివేష్ఠింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 37

---

**శ్లో॥ విష్ణుర్బ్రహ్మా రమేన్ద్రో దహనపితృపతీ రాక్షసానామధీశః**
**పాశీ వాయుః కుబేరః త్రిదృగరుణముఖాదేవతాశ్చన్ద్రసూర్యౌ ।**
**నిత్యం యత్ క్షేత్రరాజే పశుపతి నటనం దృష్టవన్తః స్వనామ్నా**
**లిఙ్గాన్ సంస్థాప్య నత్వా సుఖవరమభజన్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥38**

విష్ణువు, బ్రహ్మ, లక్ష్మి, ఇంద్రుడు, అగ్ని, యముడు, నిఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు, అరుణుడు – అనే వీరిని ఆదిగాకల అన్యదేవతలు, చంద్రసూర్యులు అనే వీరు ప్రతిదినం చిదంబరక్షేత్రంలో పశుపతి అయిన నటరాజస్వామి నటనను దర్శిస్తూ, తమపేర్లతో శివలింగాలను ప్రతిష్ఠించి, నమస్కరించి, సౌఖ్యాలను పొందుతున్నారు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 38

---

శ్లో॥ సీతాజానిః పురస్తాద్ద్విధికులజనుషం రావణం సాఙ్గమేకో
హత్వా తద్దోషశాన్త్యై నలముఖకపిభిః నిర్మితే రామసేతౌ ।
లిఙ్గం సంస్థాప్య యస్యానవరతయజనాత్ప్రాప్తవానిష్టసిద్ధిం
తం శమ్భుం వేదవేద్యం ప్రణతభవహరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥39

శ్రీరాముడు మొదట, బ్రహ్మవంశంలో పుట్టిన రావణుని అతని బంధుమిత్రులతో పాటు ఒక్కడే సంహరించి, దానివల్ల కల్గిన దోషాన్ని పోగొట్టుకొనదలచి, నలుడు మొదలైన వానరులచే నిర్మింపబడిన రామసేతువులో పరమేశ్వరుని లింగాన్ని స్థాపించాడు. దానికి నిత్యపూజనుచేసి ఇష్టసిద్ధిని పొందాడు. అటువంటి పరమేశ్వరుడు, శంభువు, వేదాలతో తెలియదగినవాడు, నమస్కరించినవారికి భవబంధాలను పోగొట్టేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 39

శ్లో॥ మోహిన్యా శమ్భురాదావతినిబిడవనే దారుకాఖ్యే చరన్ యః
సౌన్దర్యాద్విప్రదారాన్మునిగణమపి తం మాయయా మోహయిత్వా ।
వ్యర్థీకృత్యాభిచారం ద్విజకులవిహితం సంప్రదర్శ్యాత్మనృత్తం
విప్రాంశ్చాన్వగ్రహీద్యస్తమపి గిరిశయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 40

శంభువు, మోహినీరూపాన్ని పొందిన విష్ణువుతో కలిసి, చాలా దట్టంగా ఉండే దారుకావనంలో సంచరించే అందరితో మునిపత్నులను, విష్ణువు మోహినీరూపంలో మునుల సమూహాన్ని మోహాన్ని పొందేటట్లుచేసి, ఆ మునులచే చేయబడిన అభిచారకర్మలను వ్యర్థం చేశారు. తన నటనను వారికి దర్శింపజేసి, ఆ మునులను పరమేశ్వరుడు అనుగ్రహించాడు. అటువంటివాడు, కైలాసపర్వతంలో నివసించేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 40

శ్లో॥ పూర్వం వాల్కల్యభిఖ్యాన్నిహతతనువరో దేవరాడ్విష్ణుమాప్త్వా
చోక్త్వా స్వోదన్తమస్మై సహ మురరిపుణా ప్రాప్య యత్ క్షేత్రమీశమ్ ।
ఆరాధ్యాప్త్వా సువీర్యే యదనఘకృపయా మారయామాస శత్రుం
తం దేవం చిత్సభేశం వరరుచి వినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 41

పూర్వం ఒకానొక సమయంలో వాల్కలి అనే అసురునిచే కొట్టబడిన శరీరాన్ని కల ఇంద్రుడు, విష్ణువు వద్దకు చేరి, జరిగిన వృత్తాంతాన్ని విష్ణువునకు తెలిపి, ఆ విష్ణువుతో

కలిసి నటరాజస్వామి క్షేత్రమైన చిదంబరానికి పోయి, అక్కడ ఈశ్వరుని ఆరాధించి, ఆ నటరాజస్వామి కృపవల్ల ఆశించిన ప్రయోజనాన్ని పొంది, ఆ వాల్కలి అనే శత్రువును విష్ణువు ద్వారా సంహరింపజేశాడు. అటువంటివాడు, వరరుచి అనే (వ్యాకరణానికి వార్తికాన్ని రచించిన) మునిచే స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 41

---

**శ్లో॥ యద్దక్షేఽద్యాపి విష్ణుర్మణిమయసదనే దక్షిణే స్వాఙ్ఘ్రియుగ్మం**
**కృత్వాస్యం చోత్తరస్యాం శరముఖఫణిరాడ్భోగతల్పే శయానః ।**
**నిత్యం నిద్రాం ప్రకుర్వన్నపి హృది సతతం యత్పదం ధ్యాయతీడ్యం**
**దేవ్యా తం చిత్సభేశం సుతగజవదనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 42**

నటరాజస్వామికి దక్షిణదిక్కులో ఎల్లప్పుడు విష్ణువు మణులచే అలంకరింపబడిన ఆలయంలో దక్షిణ దిక్కులో రెండు పాదాలను, ఉత్తర దిక్కుగా శిరస్సును పెట్టుకొని, అయిదు తలలను కల ఆదిశేషపర్యంకంపై శయనించి, సదానిద్రలో ఉన్నట్లుగా వేంచేసి ఉన్నా, తన హృదయంలో దేవితోకూడిన నటరాజస్వామిమూర్తి పాదాన్ని ధ్యానిస్తున్నాడు. అటువంటి వాడు, వినాయకుని పుత్రునిగా కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. (ఇపుడు విష్ణువు తల దక్షిణంగా, పాదాలు ఉత్తరంగా దర్శనమిస్తున్నాయి.)42

---

**శ్లో॥ సమ్బన్ధస్సున్దరః శ్రీమణిమయవచనో జిహ్వికా రాజనామా**
**చత్వారోప్యాత్మగానైర్వివిధరసభరై స్తోత్రరూపైర్యమీశమ్ ।**
**స్తుత్వా తత్తత్స్థలాన్తఃస్థితిజుషమపి యం చైక మద్వైతమూర్తిం**
**ప్రాపుర్ముక్తిం తమాద్యం కృతవిధుమకుటం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥43**

తిరుజ్ఞానసంబంధర్, సుందర్, మణివాచకర్, అప్పర్ - అనే ఈ నల్గురు వివిధరసాలతో నిండిన, స్తోత్రరూపాలైన తమ గానాలతో ఆ యా చోట్ల ఉండే పలు నటరాజస్వామి రూపాలను స్తుతించినప్పటికీ, ఆ నటరాజస్వామి రూపాలన్నీ ఒకటిగానే, రెండవ మూర్తిని లేనివిగానే ఉన్నాయి. అటువంటి అద్వైతమూర్తిని స్తుతించి వారు ముక్తిని పొందారు. అటువంటివాడు, ఆద్యుడు, చంద్రుని మకుటంలో కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 43

---

శ్లో॥ కైలాసాద్రౌ వటద్రోర్నికటమధిగతో దక్షిణామూర్తిరూపః
తర్జన్యఙ్గుష్ఠయోగాత్సనకముఖమహాయోగినాం జ్ఞానదాతా ।
మౌనేన శ్రీకుమారం నిటిలనయనతో దగ్ధదేహఞ్చ కృత్వా
యశ్చాప్యాద్రీద్రకన్యాం సుతవరమసృజత్కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 44

పరమేశ్వరుడు కైలాసపర్వతంలోని వటవృక్షం మూలప్రదేశంలో వేంచేసి ఉండి, మౌనంగా దక్షిణమూర్తిరూపుడై చిన్ముద్రతో సనకుడు మొదలైన మహా యోగులకు జ్ఞానాన్ని ప్రసాదించాడు. ఫాలనేత్రంతో మన్మథుని దహించి, తరువాత పర్వతరాజపుత్రి అయిన పార్వతిని వివాహమాడి పుత్రుడైన సుబ్రహ్మణ్యుని జనింపజేశాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 44

శ్లో॥ శూరాదిధ్వంసనార్థం సుతకరకమలే దత్తవాన్ శక్తిమాదౌ
సర్వాస్త్రఞ్చోపదిశ్య ప్రబలసురరిపూన్ కాలసామీప్యభాజః ।
కృత్వోదూహ్యేద్రకన్యాం వనచరతనుజాం గేహమాయాహి తాతే-
త్యుక్త్వా చాన్వగ్రహీద్యో గృహమపి ముదితః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥45

పరమేశ్వరుడు, శూరపద్మడు మొదలైన అసురులను ధ్వంసం చేయదలచి, పుత్రుడైన సుబ్రహ్మణ్యస్వామి యొక్క తామరపూవు వంటి చేతిలో మొదట శక్తి అనే ఆయుధాన్ని ఇచ్చాడు. తర్వాత, సర్వాస్త్రాలను ఉపదేశించి, బలిష్ఠులైన ఆ దేవశత్రువులను యమసమీపాన్ని చేరిన వారినిగా చేసి, ఇంద్రుని, వేటగాని కుమార్తెలైన దేవసేన, వల్లి అనే ఇద్దఱు కన్యలను వివాహమాడి, సంతోషించినవాడై "కుమారా! ఇక్కడకు రా!" అని పల్కి సంతోషంతో సుబ్రహ్మణ్యస్వామిని అనుగ్రహించాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 45

శ్లో॥ కాల్యా సాకం పురా యస్సురమునిసదసి స్వాఙ్ఘ్రిముద్యమ్య చోర్ధ్వం
నృత్తం కృత్వాఽథ కాలీం పశుపతి రజయత్తద్వహిష్కారపూర్వమ్ ।
సర్వే దేవా మునీంద్రాః ప్రభురితి చ వదన్త్యూర్ధ్వనృత్తేశమూర్తిం
యం దేవం పూజయన్తి ప్రతిదినమనఘాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥46

పూర్వం ఒకానొక సమయంలో పశుపతి అయిన ఆ పరమేశ్వరుడు దేవతలు, మునులు (త్రిసహస్ర మునీశ్వరులు) అనే వీరితో కూడిన (మనోమయమని చెప్పబడిన, మూడవదిగా చెప్పబడే నృత్తసభలో) కాళికాదేవితోపాటు ఒక కాలును పైకెత్తి ఉంచి నాట్యం

చేస్తూ ఆ కాళిని తిరస్కారంతో జయించాడు. అందఱు దేవతలు, మహర్షులు ఊర్ధ్వ తాండవమూర్తి అయిన ఆ పరమేశ్వరుని ప్రభువుగా స్తుతించారు. ప్రతిదినం పరిశుద్ధులైన త్రిసహస్రమునులు ఆ స్వామిని పూజిస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 46

**శ్లో॥ అన్తర్వేద్యాం స్వయజ్ఞే దివిషదధిపతౌ సామగానైస్తథోచ్చై-**
**రాహూతేఽనాగతేఽస్మిన్యదమలనటనం దృష్టవన్తం సురేడ్బ్రమ్ ।**
**సద్యో బుద్ధ్వాత్మభూస్తం స్వయమతితరసాఽఽనీయ యస్యాతిదేశాత్**
**విప్రైస్సాకం స్వయజ్ఞం సురనుతమకరోత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥47**

పూర్వం ఒకానొక సమయంలో అంతర్వేదిలో బ్రహ్మ తాను చేసే యజ్ఞంలో సామగానంతో దేవేంద్రుని ఆవాహనం చేయగా ఆ దేవేంద్రుడు రాలేదు. అపుడు తన జ్ఞానదృష్టితో చిదంబరంలోని పరమేశ్వరుని నాట్యాన్ని అతడు దర్శిస్తున్నాడని వెంటనే గ్రహించి బ్రహ్మ తానే స్వయంగా చిదంబరానికి వచ్చి నటరాజస్వామి ఆజ్ఞతో త్రిసహస్ర మునులతోపాటు ఆ దేవేంద్రుని తన యాగశాలకు వచ్చేటట్లు చేసి, తన యాగాన్ని దేవతలచే కీర్తింపబడేవిధంగా నిర్వహించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 47

**శ్లో॥ యశ్శమ్భుః కాలహన్తా జలధరమసురం స్వాఙ్ఘ్రిం చక్రేణ హత్వా**
**తద్దుష్కృత్యాస్త్రశస్త్రైః వినిహతవపుషస్సర్వలోకానరక్షత్ ।**
**యం స్వక్రోధస్వరూపం జలధరమసురం నాశయన్తం వరేణ్యం**
**సర్వే లోకా వదన్తి ప్రమథపతినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 48**

కాలుని సంహరించిన శంభువు 'జలధరుడనే అసురుని' తన పాదంతో సృష్టించిన చక్రాయుధంతో సంహరించి, ఆ అసురుని దుష్టమైన కృత్యాలతో, అస్త్రాలతో బాధింపబడిన శరీరాలను కల సర్వలోకాలలోని ప్రాణులను రక్షించాడు. ఆ పరమేశ్వరుని, తన కోపస్వరూపి అయిన జలధరుడనే అసురుని నాశం చేసినవాడని, శ్రేష్ఠుడని ప్రాణులన్నీ కీర్తిస్తున్నాయి. నందికేశ్వరునిచే స్తుతింపబడేవాడు, అటువంటివాడు కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 48

శ్లో॥ కైలాసాద్రౌ కదాచిత్పశుపతినయనాన్యద్రిజాతా పిధాయ
క్రీడాం చక్రేఽన్ధకారాత్సురరిపురుదభూదన్ధకాఖ్యోఽతిదుష్టః ।
తద్ దుష్కృత్యం జగత్యాం ప్రసృమరమసహై స్సర్వలోకైః స్తుతో యః
తం హత్వాఽరక్షదేతాంస్తమజహరినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ **49**

ఒకానొక సమయంలో కైలాసపర్వతంపై పార్వతీదేవి పరమేశ్వరుని నేత్రాలను తన చేతులతో మూసి ఆటలాడింది. అపుడు లోకం అంతా చీకటి అయినందున, అంధకుడనే పేరును కలవాడు, చాలా దుష్టుడు, దేవతలకు శత్రువైన ఒక అసురుడు పుట్టాడు. లోకంలో వ్యాపించే అతని దుష్కృత్యాలను సహించ లేని సమస్త ప్రాణులచే ప్రార్థింపబడిన పరమేశ్వరుడు ఆ అసురుని సంహరించి లోకంలోని ప్రాణులను రక్షించాడు. అటువంటివాడు, బ్రహ్మ, విష్ణువులచే స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 49

శ్లో॥ హాలాస్యే మీననేత్రాపరిణయసమయే దర్శనాయాగతాభ్యాం
సర్పేన్ద్రవ్యాఘ్రపద్భ్యాం రజతసదసి యస్స్వాఙ్ఘ్రిముద్యమ్య వామమ్ ।
నృత్తం కృత్వా మునీన్ద్రావితరమునిసురాంస్తోషపాథోధిమగ్నాన్
చక్రే తం సున్దరాఙ్గం మధురిపువినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥**50**

(దక్షిణ) మధురాపురిలో మీనాక్షీదేవి కల్యాణసమయాన్ని దర్శించాలని వచ్చిన పతంజలి, వ్యాఘ్రపాదుడు అనే మునులలో అక్కడ ఉండే రజతసదస్సులో ("వెళ్ళి అంబలమ్"లో) పరమేశ్వరుడు తన ఎడమకాలును ఎత్తి తాండవమాడి, ఆ మునులను, దేవతలను సంతోషసముద్రంలో మునిగిన వారినిగా చేశాడు. అటువంటివాడు, అందమైన తిరుమేనిని కలవాడు, విష్ణువుచే స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 50

శ్లో॥ మాఘే మాసే మఖర్క్షే వరుణవిరచితబ్రహ్మహత్యావిముక్త్యై
ప్రీత్యా యస్సన్నిధాయ స్వయమురుమకరైః పూరితేఽబ్ధౌ జలేశమ్ ।
స్నానాన్ముక్తస్వపాపం నిఖిలమపి జనం కారయామాస పూర్వం
తం దేవం చిత్సభాయామనవరతనటం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥**51**

పూర్వం ఒకానొక సమయంలో మాఘమాసంలోని మఘానక్షత్రంలో వరుణునకు కల్గిన బ్రహ్మహత్యాపాతకాన్ని పోగొట్టడంకోసం అతని ప్రార్థనను పురస్కరించుకొని

పరమేశ్వరుడు పెద్దపెద్ద చేపలతో నిండిన సముద్రాన్ని చేరి, తన జలక్రీడలతో ఆ వరుణుని ఆ పాపంనుండి విడిపించి, తరువాత జనులందఱిని ఆ తీర్థస్నానం ద్వారా పాపం లేనివారినిగా చేశాడు. అటువంటివాడు, ప్రకాశించేవాడు, చిత్సభలో సదా తాండవం చేసేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 51

**శ్లో॥ దక్షే యష్టుం ప్రవృత్తే పరమశివమనాదృత్య తత్కన్యకాయాం**
**గత్వా తత్ర స్వతాతం నతవదనముపేక్ష్యైత్వమగ్నిం విశన్త్యామ్ ।**
**గౌర్యాం కోపాద్య ఈశో దశశతవదనం వీరముత్పాద్య కాలీం**
**తాభ్యాం దక్షాదినాశం వ్యరచయదతులం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥52**

దక్షప్రజాపతి పరమశివుని అనాదరించి యాగం చేసే సమయంలో, అతని కుమార్తె అయిన దాక్షాయణి అక్కడకు పోయి, అక్కడ తలవంచుకొని ఉన్నవాడు, తనతో మాట్లాడనివాడైన తనతండ్రి దక్షుని అనాదరించి, ఆహవనీయమనే అగ్నిలో ప్రవేశించింది. అపుడు ఆ విషయాన్ని తెలిసిన పరమేశ్వరుడు కోపంతో వేయి ముఖాలను కల వీరభద్రుడై, కాళిని సృష్టించి, ఆ ఇద్దఱి ద్వారా ఆ దక్షునకు, ఆయాగసభలో ఉండే ఇతరదేవతలు మొదలైనవారికి నాశాన్ని కల్గించాడు. అటువంటివాడు, ఉపమానం లేనివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 52

**శ్లో॥ పార్థో యల్లిఙ్గబుద్ధ్యా యదుకులతిలకం పూజయామాస పూర్వం**
**తన్నిర్మాల్యం సమస్తం రజతగిరినిషచ్ఛఙ్కరాంఘ్రౌ ప్రదృష్ట్వా ।**
**భీమ స్వాన్తార్చితం చ స్వసఖమపి గురుం పృష్టవాన్ తచ్చరిత్రం**
**తం దేవం చిత్సభాయాం కృతనటనవరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥53**

పూర్వం ఒకానొక కాలంలో అర్జునుడు పరమేశ్వరుని లింగమనే భావంతో శ్రీకృష్ణుని పూజించాడు. అపుడు ఆ పూజలోని నిర్మాల్యాన్ని అంతటిని, భీముని మానసపూజలోని నిర్మాల్యాన్ని అంతటిని కైలాసగిరిలో ప్రకాశించే శంకరుని పాదాలలో స్పష్టంగా దర్శించి, తత్కారణంగా తనకు స్నేహితుడు, గురువైన శ్రీకృష్ణుని వద్ద ఆ సంగతిని గూర్చి ప్రశ్నించాడు. అటువంటివాడు, చిత్సభలో నాట్యం చేసేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 53

**శ్లో॥ కృష్ణో యల్లిఙ్గపూజామనుదినమకరోద్యామునే వామతీరే**
**తన్నిర్మాల్యం గృహీత్వా యజతి పరశివం చోపమన్యౌ మునీన్ద్రే ।**
**జ్ఞాత్వైతద్వృత్తమారాత్తదమలకరవాగ్దృష్టిభిర్దీక్షితోఽభూత్**
**తత్పూజాలిఙ్గమూలం తమనఘనటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 54**

శ్రీకృష్ణుడు యమునానది ఉత్తరతీరంలో పరమేశ్వరుని శివలింగాన్ని ప్రతిదినం పూజించాడు. యముననదిలో కొట్టుకొనివచ్చే, శ్రీకృష్ణుడు చేసిన ఆ పూజలోని నిర్మాల్యాన్ని తీసికొని ఉపమన్యువు అనే మునివరుడు, దీక్ష లేనివాని పూజలోని నిర్మాల్యం నిర్మాల్యం కాలేదనే భావంతో, ఆ నిర్మాల్యంతో పరమశివుని పూజించాడు. ఆ వృత్తాంతాన్ని తెలిసికొన్న శ్రీకృష్ణుడు వేగంగా ఆ మునివరుని దగ్గరకు వెళ్ళి ఆముని యొక్క పవిత్రమైన చేతులద్వారా వాక్కు, దృష్టిద్వారా దీక్షను స్వీకరించినవాడయ్యాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 54

**శ్లో॥ ఓఙ్కారార్థం షడాస్యే రజతగిరివరే పృచ్ఛతి బ్రహ్మదేవం**
**చోఙ్కారార్థోఽహమస్మీత్యనువదతి విధౌ శిక్షయామాస తం యః ।**
**తద్వత్కాదర్థమేనం స్వయమపి కుతుకాచ్ఛ్రోతుమత్యాదరేణ**
**స్వాఙ్కే సంస్థాప్య సూనుం ప్రముదితమకరోత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥55**

ఒకానొక సమయంలో కైలాసగిరిలో సుబ్రహ్మణ్యస్వామి పరమశివుని దర్శించగోరి వచ్చిన బ్రహ్మదేవుని పిలిపించి, ఓంకారార్థాన్ని చెప్పమని అడిగాడు. అపుడు ఆ బ్రహ్మదేవుడు "ఓంకారార్థాన్ని నేనే" అని అనగా, అపుడు అతనిని పరమశివుడు శిక్షించాడు. ఆ సుబ్రహ్మణ్యస్వామి నోటినుండి ఓంకారార్థాన్ని స్వయంగా వినగోరిన శివుడు అత్యాదరంతో అతనిని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని అతనిని ఆనందపరచాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 55

**శ్లో॥ వైకుణ్ఠో నిత్యమాదౌ పశుపతిమనఘైః పుణ్డరీకైస్సహస్రే-**
**ణార్చాం కుర్వన్ కదాచిన్న చరమకమలం దృష్టమాసీత్తదేవ ।**
**ఉత్పాట్య స్వాక్షిపద్మం యదమలపదయోరర్పయిత్వాథ యస్మాత్**
**చక్రం సంప్రాప్య రేజే తమపి నటపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 56**

విష్ణువు ప్రతిదినం పశుపతి అయిన పరమేశ్వరుని పరిశుద్ధాలైన వేయి తామర

పూలతో అర్చిస్తూ వచ్చాడు. ఒకానొక తరుణంలో వేయిలో ఒక తామరపుష్పం దొరకలేదు. అపుడు విష్ణువు నేత్రాన్ని పెకలించి పరమశివుని పాదాలలో అర్చించి, తర్వాత ఆ పరమేశ్వరునివల్ల చక్రాయుధాన్ని పొంది ప్రకాశించాడు. అటువంటి నటరాజు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 56

శ్లో॥ **కైలాసోద్యానదేశం సహ గిరిసుతయాఽఽప్యైకదా చన్ద్రచూడః**
**సద్యస్తత్రేన్దిరాగాధరభువి నివసన్యః కపీశార్చితోఽభూత్ ।**
**యస్తస్మై సార్వభౌమత్వపదమపి దదావస్త్రశస్త్రావళిఞ్చ**
**తం దేవం పారిజాతాద్యఖిలసుమధరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 57**

ఒకానొక సమయంలో అంబికతోకూడ చంద్రచూడుడైన పరమేశ్వరుడు కైలాసంలో ఉండే ఉద్యానవనాన్ని చేరి, అక్కడ ఉండే బిల్వవృక్షం క్రిందిభాగంలో నివసించేవాడై, శ్రేష్ఠమైన ఒక వానరంచేత పూజింపబడ్డాడు. ఆ వానరానికి ప్రభువుగా అయే స్థితిని, అస్త్ర శస్త్రాలను ఇచ్చాడు. అటువంటివాడు, దేవుడు, పారిజాతం మొదలైన అన్ని పుష్పాలను ధరించేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 57

శ్లో॥ **స్వర్గాధీశః కదాచిత్కపివదననృపాన్ నాశయిత్వా స్వశత్రూన్**
**దత్వాస్మై త్యాగరాజం షడపి తదితరాన్ ప్రేక్షయామాస రాజ్ఞే ।**
**సోప్యాధారాది సప్తస్థలవరసదనేష్వగ్రజైరర్చతే స్మ**
**తన్మూర్తీనాం చ మూలం మునిగణవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥58**

ఒకసమయంలో దేవేంద్రుడు వానరముఖాన్ని కల రాజుచే (ముకుంద చక్రవర్తిచే) తన శత్రువులైన అసురులను సంహరించి, ఆ ప్రభువునకు త్యాగరాజమూర్తిని, ఇంకా ఆఱుత్యాగరాజమూర్తులను ఇచ్చి భూలోకానికి పంపిచాడు. ఆ ప్రభువు మూలాధారక్షేత్రమని చెప్పబడే తిరువారూరులో, తిరునల్లార్, తిరునాకైక్కారోణమ్, తిరుక్కువళై, తిరువాయ్మూర్, తిరుక్కారవాశల్, తిరుముదైకాడు – అనే శివక్షేత్రాలలో ఆ మూర్తులను స్థాపించి, బ్రాహ్మణులద్వారా పూజను జరిపించాడు. ఆ మూర్తులకు మూలస్థానం అయినవాడు, మహర్షి సమూహంచే స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 58

**శ్లో॥ వాసిష్ఠాద్యా మునీంద్రాః ప్రతిదినమయుతం పఞ్చవర్ణం జపన్తో**
**యత్ క్షేత్రే వత్సరాన్తే హవనమపి తథా తర్పణం బ్రహ్మభుక్తమ్ ।**
**కృత్వా స్వాభీష్టమాపుర్నటపతిపురతస్తత్సపర్యాం విధాయ**
**ప్రేమ్ణా తం చిత్సభేశం విధిముఖవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥59**

వసిష్ఠుని ఆదిగా కల మహర్షులు చిదంబరక్షేత్రంలోని నటరాజుకు ముందు ప్రతిదినం పంచాక్షరిని పదివేలమార్లు (అయితం) జపించి, ఒక సంవత్సరం చివర హోమం, తర్పణం, బ్రాహ్మణ భోజనం (ఇది మంత్రశాస్త్రాలలో పురశ్చరణమనబడుతుంది.) – అనే వీటిని అనుష్ఠించి, చాలా ప్రీతితో నటరాజమూర్తికి విశేషమైన ఆరాధనను చేసి, తమ తమ అభీష్టాలను పొందారు. అటువంటివాడు, బ్రహ్మను ఆదిగా కల దేవతలచే స్తోత్రం చేయబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 59

**శ్లో॥ కఞ్చిద్దేవం సభాయాం సకలమునివరైరర్చ్యమానాంఘ్రియుగ్మం**
**ఇచ్ఛాదేవ్యా స్వశక్త్యా మిలితమనుపమం సచ్చిదానందనృత్తమ్ ।**
**వామేభిత్త్యర్ధవామే స్థితియుగభుజయాజ్ఞానశక్త్యా చ దృష్టం**
**సర్వేషాం భక్తిభాజాం నిఖిలసుఖకరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 60**

ఇటువంటివాడని ఇదమిత్థంగా పల్కడానికి సాధ్యం కానివాడు, సభలో ప్రసన్నంగా ఉండేవాడు, మునులందఱిచే పూజచేయబడే రెండు చరణాలను కలవాడు, తనదేని అయిన ఇచ్ఛాశక్తితో కూడినవాడు, సాటి లేనివాడు, సచ్చిదానంద రూపమైన నర్తనాన్ని కలవాడు, తన ఎడమ వైపున, గోడలోని సగభాగంలోను (రహస్య కుడ్యం క్రింద భాగంలో) ఉండే, రెండు చేతులను కల దేవిచే వీక్షింపబడేవాడు, భక్తులందఱికి వారు కోరిన సుఖాలను ప్రసాదించేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 60

**శ్లో॥ లక్ష్మీపుష్పం తథార్కం బకగరుతమధః కృష్ణధుత్తూరపుష్పం**
**గంగాచన్ద్రౌ జటాశ్చ స్వశిరసి సతతం కర్ణయోర్గాయకౌ ద్వౌ ।**
**హస్తేష్వహ్యగ్నిఢక్కాః పదకమలయుగే రత్నమంజీరభూషా**
**ధృత్వా యస్సామ్బరూపస్సదసి జయతి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥61**

లక్ష్మీపుష్పం, జిల్లేడుపూలు, కొంగజిల్లేడుపూవు, నల్లఉమ్మెత్తపూవు – మొదలైన పూలు, గంగ, చంద్రుడు, జటలు – అనే వీనిని శిరస్సులో కంబళాశ్వతరులనే ఇద్దఱు

సర్పరూపులైన పాతకులను చెవులు రెండింటిలోను, సర్పం, అగ్ని, డమరుకం - అనే వీటిని చేతిలోను, రెండు పాదాలలో రత్నమంజీరాలను ఎల్లప్పుడు ధరించి, సాంబ రూపుడైన పరమేశ్వరుడు చిత్సభలో ప్రకాశిస్తున్నాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 61

**శ్లో॥ భూషారూపైః ఫణీన్ద్రైర్ద్విగుణితమహసం పుష్పహాసం పురారిం**
**భస్మాలిప్తాఙ్గమీశం భవమయజలధేస్తారకం భక్తిభాజామ్ ।**
**ధర్మాదీంస్తాన్ పుమర్థాన్ దదతమనుదినం దక్షిణాస్యం స్వభక్త్యై-**
**ర్భాసారూపైశ్చ గానైః కృతనుతిమమితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 62**

ఆభరణ రూపంలో ఉండే సర్పాలతో రెండింతలుగా చేయబడిన కాంతిని కలవాడు, స్వచ్ఛమైన మందహాసాన్ని కలవాడు, త్రిపురాసుర సంహారాన్ని చేసినవాడు, విభూతిని అలంకరించుకొన్నవాడు, తనపట్ల భక్తిని కలవారిని సంసారబంధంనుండి విడిపించేవాడు, ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధపురుషార్థాలను ఇచ్చేవాడు, దక్షిణదిశకు అభిముఖమైన ముఖాన్ని కలవాడు, తన భక్తులచే వారి వారికి తగిన భాషలోని గానాలద్వారా స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 62

**శ్లో॥ యస్యోర్ధ్వే దక్షపాణౌ వినిహితడమరోర్మాతృకావర్ణరూపం**
**త్రైచత్వారింశదర్ణం చతురధికదశాలఙ్కృతం సూత్రజాలమ్ ।**
**జాతం యత్తద్ గృహీత్వా పణనసుతముఖాః శబ్దశాస్త్రాదిగర్భం**
**తత్తచ్ఛాస్త్రాణ్యకుర్వన్ దరహసితముఖం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 63**

నటరాజమూర్తి పైకి ఎత్తిపట్టుకొన్న చేతిలోఉండే దమరుకంనుండి మాతృకా వర్ణరూపాలైనవి, నలభైమూడు వర్ణాలతో కూడినవి, **"అ ఇ ఉణ్"** అనే సూత్రాన్ని ప్రారంభంలో కల్గినవి అయిన పద్నాలుగు సూత్రాలు వ్యక్తమైనవి. ఆ సూత్రాలను పణనుడనే ఋషియొక్క పుత్రుడైన పాణిని మహర్షి మొదలైన పెద్దలు వ్యాకరణశాస్త్రం మొదలైనవానికి కారణభూతులై వాటిని ప్రవర్తింపజేశారు. అటువంటివాడు, మందహాసంతో కూడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 63

**("నృత్తావసానే నటరాజరాజః ననాద ఢక్కాం నవపంచవారమ్, ఉద్ధర్తు కామః సనకాది సిద్ధానేతద్విమర్శే శివసూత్రజాలమ్, స జయతి దివ్యనటేశో నృత్యతి యోసౌ**

**చిదంబర సభాయామ్, పాణిన్యాద్యా మునయః యస్య చ దయయా మనోరథా న భజన్”** అనే సూక్తుల ద్వారా పై విషయం స్పష్టం చేయబడింది.)

---

**శ్లో॥ వామే కృత్వా శిఖీన్ద్రం డమరుమపి కరే దక్షిణేఽభీతిముద్రాం**
**యోఽన్యస్మిన్ వామపాదం సరసిజసదృశం కుఞ్చితం దోలహస్తాత్ ।**
**భక్తే ముక్తేశ్చ దానే నిపుణమిదమితి ప్రాణినాం దర్శయిత్వా**
**నృత్యన్తం చిత్సభాయాం శ్రుతిశిఖరనుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥64**

ఎడమచేతిలో అగ్నిని, కుడిచేతిలో దమరుకాన్ని కలవాడు, అభయముద్రను చాచిన వేఱొక ఎడమ చేతితో కలవాడు, కొంచెం ఎత్తి పట్టుకొన్న తామరపూవులు సాటివచ్చే ఎడమ పాదాన్ని “భోగాన్ని, మోక్షాన్ని ఇచ్చే విషయంలో ఇది శరణం, సామర్థ్యం కల్గినది” అని జీవులకు చూపిస్తూ, చిత్సభలో నర్తనం చేసేవాడు, ఉపనిషత్తులచే స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 64

---

**శ్లో॥ మూలాధారాదిషట్కేప్యనవరతనటం యం విరాజో హృదబ్జే**
**సర్వేన్ద్రవ్యాఘ్రపాదప్రముఖమునినుతం షట్సు కాలేషు వేదైః ।**
**ఆరాధ్యాభీష్టసిద్ధిం ద్విజకులతిలకాః ప్రాప్నువన్తి ప్రభుం తం**
**చిచ్ఛక్త్యా యుక్తమాద్యం కనకగిరికరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 65**

మూలాధారం మొదలైన ఆఱు స్థానాలలోను (మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరకం, అనాహతం, విశుద్ధి, ఆజ్ఞ – అనే ఆఱు స్థానాలలో) (పరమేశ్వరుని నటననుగూర్చి, దాని ఉపాసనా క్రమాలను చిదంబర కల్పం, దహరవిద్యాఖండం మొదలైన గ్రంథాలలో చూడవచ్చు) ఎల్లప్పుడు నాట్యం చేసేవాడు, విరాట్ పురుషుని హృదయంలో నర్తనం చేసేవాడు, (విరాట్ హృదయమని ఆదిభూతంలోని చిదంబరం చెప్పబడుతున్నది.) పతంజలి, వ్యాఘ్రపాదుడు మొదలైన మునులచే స్తుతింపబడే పరమేశ్వరుని ద్విజశ్రేష్ఠులు వేదాలతో ఆఱు కాలాలలోను పూజనం చేసి, అభీష్టసిద్ధులను పొందుతున్నారు. అటువంటి ప్రభువు, చిత్‌శక్తితో కూడినవాడు, ఆదిలో ఉండేవాడు, మహామేరువును చేతిలో కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 65

---

**శ్లో॥ వేదాన్తోక్తాత్మరూపం విధిహరితనుజం విశ్వనాథం సదస్థం**
**స్వధ్యానాన్నాశయన్తం సకలభువనగం మోహమప్యన్ధకారమ్ ।**

చన్ద్రోత్తంసం స్మితాస్యం సితభసితలసత్ఫాలదేశం త్రినేత్రం
విశ్వైర్దేవైర్నతాఙ్ఘ్రిం వివిధతనుగతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 66

వేదాంతశాస్త్రాలలో చెప్పబడిన ఆత్మస్వరూపం, బ్రహ్మ, విష్ణువులను పుత్రునిగా కలవాడు, లోకనాథుడు, చిత్సభలో ఉండేవాడు, తనను ధ్యానం చేసినంతమాత్రంలోనే లోకంలో ఉండే మోహాంధకారాన్ని పోగొట్టేవాడు, చంద్రుని ధరించినవాడు, నవ్వును కల ముఖాన్ని కలవాడు, తెల్లని విభూతితో ప్రకాశించే ఫాలాన్ని కలవాడు, మూడు కన్నులను కలవాడు, విశ్వేదేవులచే (శ్రాద్ధంలో పూజింపబడే దేవతలు) నమస్కరింపబడ్డ చరణాలను కలవాడు, ప్రాణులందఱి శరీరాలలో ఉండేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 66

శ్లో॥ చక్షూంష్యర్కాగ్నిచన్ద్రాశ్చరణమహిభువి వ్యోమ్నికేశాశ్చ యస్యా-
ప్యష్టావాశాశ్చ వస్త్రం నిఖిలభువనసంలగ్నహస్తోఽద్వితీయః ।
కుక్షిర్వారాశిజాలం నటనశుభతలం రుద్రభూమిశ్చ నిత్యం
తం దేవం చిత్సభేశం శ్రుతిగణవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 67

పరమేశ్వరునకు కన్నులు సూర్యుడు, అగ్ని, చంద్రుడు – అనే వీరు. పాదాలు పాతాళంలో ఉన్నాయి. శిఖలు ఆకాశంలో ఉన్నాయి. ఎనిమిది దిక్కులు వస్త్రాలు, సకల భువనాలలో సంబంధం కల్గినవి చేతులు. అతడు అద్వితీయుడు, సప్తసముద్రాలు కుక్షి, నాట్యం చేసే మంగళకరమైన చోటు రుద్రభూమి. అటువంటివాడు, నిత్యుడు, దేవుడు, శ్రుతి సమూహంచే కీర్తింపబడేవాడు, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 67

శ్లో॥ దీర్ఘాయుః పుత్రపౌత్రాన్ ధనగృహవసుధావస్త్రభూషాగజాశ్వాన్
విద్యారోగ్యేశభక్తీర్జలజసమముఖీస్సుందరీః భృత్యవర్గాన్ ।
ముక్తిం యన్నృత్తమూర్తశ్చరణసరసిజం పూజయన్తో లభన్తే
తం దేవం చిత్సభేశం సకరుణహృదయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥68

దీర్ఘమైన ఆయుస్సు, పుత్రులు, పౌత్రులు, గృహాలు, భూమి, వస్త్రాలు, ఆభరణాలు, ఏనుగులు, అశ్వాలు, విద్య, ఆరోగ్యం, ఈశ్వరభక్తి, తామరపూవువంటి ముఖాన్ని కల

అందమైన భార్యలు, భృత్యవర్గం, ముక్తి – అనే వీనిని నటరాజస్వామి చరణాన్ని పూజను చేసేవారు పొందుతున్నారు. అటువంటివాడు, దేవుడు, చిత్సభకు ప్రభువు, కరుణతో కూడిన హృదయాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 68



**శ్లో॥ నిత్యార్చాస్వన్వహం యః ప్రదిశతి నితరాం భుక్తయే కాఞ్చనాదీన్**
**విప్రాణాం సప్తపాకాన్ హవిరపి సకలం సౌమికాస్సప్తసంస్థాః ।**
**కృత్వా నృత్తేశపూజాం శ్రుతివిహితపథా కుర్వతాం శ్రీసభేశః**
**తం దేవం నృత్తమూర్తిం మణిమయపదకం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥69**

(అష్టకా, పార్వణః, శ్రాద్ధం, శ్రావణీ, ఆగ్రహాయణీ, చైత్రీ, ఆశ్వయుజీ (ఇతి సప్తపాకయజ్ఞసంస్థాః)

అగ్న్యాధేయం, అగ్నిహోత్రం, దశపూర్ణమాసౌ, చాతుర్మాస్యాని, అగ్రయణేష్టి నిరూఢపశనిబంధః, సౌత్రమణీ (ఇతి సప్తహవిర్యజ్ఞ సంస్థాః)

అగ్నిష్టోమః, అత్యగ్నిష్టోమః, ఉక్థ్యః, షోడశీ, వాజపేయః, అతిరాత్రః, ఆప్తోర్యామః (ఇతి సప్తసోమసంస్థాః) ఇతి గౌతమః.

నటరాజస్వామి, సప్తపాకాలను, హవిస్సులను ఏడింటిని, సోమసంస్థలను ఏడింటిని అనుష్ఠించి, వేదంలో చెప్పబడిన రీతిలో నటరాజస్వామి పూజను చేసే దీక్షితులకు ప్రతిదినం నిత్యపూజలో బంగారం మొదలైన వస్తువులను అనుగ్రహిస్తాడు. అటువంటి మణిమయమైన పతకాలను అలంకరించుకొన్న, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 69

(అష్టకాలు, పార్వణం, శ్రాద్ధం, శ్రావణి, ఆగ్రహాయణి, చైత్రి, ఆశ్వయుజి – అనేవి **ఏడు పాకయజ్ఞసంస్థలు**.

అగ్న్యాధేయం, అగ్నిహోత్రం, దర్శపూర్ణమాసాలు, చతుర్మాస్యం, అగ్రయణేష్టి, నిరూఢపశుబంధం, సౌత్రామణి – అనేవి **ఏడు హవిర్యజ్ఞ సంస్థలు**.

అగ్నిష్టోమం, అత్యగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం – అనేవి **సప్తసోమసంస్థలు** – అని గౌతముడు తెలిపాడు.)



**శ్లో॥ భూతే సంస్థాప్య చైకం చరణసరసిజం దక్షిణం వామపాదం**
**శిఞ్జన్మఞ్జీరశోభం విధిముఖదివిషత్పూజితం భక్తిభాజామ్ ।**

**ధర్మాదీష్టాన్ ప్రదాతుం ధనలిపిసహితం కిఞ్చిదుద్ధృత్య తిర్యక్ప్రా-**
**కుఞ్చ్యానన్దనృత్తం కలయతి వరదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 70**

అపస్మారుడనే భూతంపైన కుడికాలు మోపి, అందమైన మంజీరాలతో అలంకరింప బడిన మంజీరాలతో శోభిల్లేది, బ్రహ్మాది దేవతలచే పూజింపబడేది ధనలిపిని (న్యాసక్రమంలో ఆ రెండు అక్షరాలను ఆ పాదంలో ధ్యానించి పూజించాలని మంత్రశాస్త్రం తెల్పుతున్నది) కల్గినది అయిన ఎడమ పాదాన్ని తనపట్ల భక్తిని కలవారికి వారుకోరిన మనోరథాలను అనుగ్రహించడంకోసం కొంచెం పైకి ఎత్తి (అడ్డంగా వంచి) ఆనందనర్తనాన్ని పరమేశ్వరుడు చేస్తున్నాడు. అటువంటి వరదుడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 70

---

**శ్లో॥ యామ్యే శ్రీనూపురాఖ్యాజనిభృదఘహరా నిమ్నగా భాతి యస్యో-**
**దీచ్యాం శ్వేతాభిధానా వరుణదిశి మహావీరభద్రాఖ్యవాపీ ।**
**ప్రాచ్యామబ్ధిస్సమీపే తదుదరవిలసత్తిల్వకాన్తారనామ్ని**
**క్షేత్రే యశ్చిత్సభాయాం నటతి సకలగం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 71**

దక్షిణదిశలో ప్రాణుల పాపాలను పోగొట్టేది అయిన శ్రీనూపురా (కొళ్ళిడమ్) అనేనది, ఉత్తరదిక్కులో శ్వేతనది (వెళ్ళాఱు), పడమటిదిశలో వీరభద్ర సరస్సు (వీరాణ ఏరి) తూర్పు దెసలో సముద్రం ప్రకాశించగా, వాని మధ్యలో భాసించే **తిల్లైవనమ్** అని పేరున్న క్షేత్రంలో పరమేశ్వరుడు చిత్సభలో నర్తనం చేస్తున్నాడు. అటువంటివాడు, సకలాన్ని (మూర్తిభవించిన వాడు) పొందినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 71

---

**శ్లో॥ పఞ్చప్రాకారయుక్తే ప్రవిలసతి పురే పంక్తితీర్థప్రవీతే**
**సర్వాశావ్యాప్తకీర్తిద్విజవరనిబిడే వ్యోమనామ్న్యాత్మరూపే ।**
**మధ్యే శ్రీచిత్సభాయాం కలయతి నటనం సర్వదా సామ్బికో యః**
**తం దేవం వేదమూర్ధస్థితిజుషమనఘం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 72**

అయిదు ప్రాకారాలతో కూడినది, పది తీర్థాలతో పరివేష్ఠితమైనది (శివగంగ, సముద్రం, పులిమడుగు, యౌవనేశ్వరం, అనంతేశ్వరం, నాగేశ్వరం, బ్రహ్మతీర్థం, చాముండీ తీర్థం, తిరుప్పాఱ్కడల్, పరమానందకూపం - అనేవి ఆ పది తీర్థాలు) కీర్తిని కల బ్రాహ్మణులచే నిండి ఉండేది, ఆకాశమనే పేరును కల్గినది, ఆత్మరూపమైన చిదంబరక్షేత్రంలో మధ్యలోగల చిత్సభలో ఎల్లప్పుడు అంబికతో కలిసి ఉండి పరమేశ్వరుడు నర్తనం చేస్తున్నాడు.

అటువంటి వాడు, వేదాంతాలలో ఉండేవాడు, పరిశుద్ధుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 72

---

**శ్లో॥ భాసన్తే నైవ యస్మిన్ రవిశశిహుతభుక్తారకాశ్చాపి విద్యుత్**
**యస్మాద్భీత్యేన్ద్రవాయూమిహిరకిరణజో దూరతో యాన్తి నిత్యమ్ ।**
**యద్రూపం యోగివర్యా హృదయసరసిజే చిన్తయన్త్యన్వహం తం**
**శ్రీమన్తం చిత్రరూపం వసుకరకమలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 73**

పరమేశ్వరునిలో సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నక్షత్రాలు, మెఱుపు – అనే ఇవి ప్రకాశం లేనివి అవుతున్నాయి. ఆ పరమేశ్వరునివల్ల భయంతో ఇంద్రుడు, వాయువు, యముడు – అనే వీరు చాలా దూరంగా సంచరిస్తున్నారు. పరమేశ్వరుని రూపాన్ని యోగి శ్రేష్ఠులు తమహృదయాలలో ఎల్లప్పుడు ధ్యానిస్తున్నారు. అటువంటివాడు, శ్రీమంతుడు, ఆశ్చర్యస్వరూపుడు, ఎనిమిది – తామరలవంటి చేతులను కలవాడు (మంత్రశాస్త్రంలో ఎనిమిది చేతులను కల నటరాజస్వరూపం తెలుపబడింది.), కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 73

---

**శ్లో॥ షట్కాలార్చాసు నిత్యం స్ఫటికమణిమయే లిఙ్గనృత్తేశమూర్తీం**
**శుద్ధైస్తీర్థైః కదాచిత్ స్వమపి నటపతిం చాభిషేక్తుం సమంత్రమ్ ।**
**మూర్ధాలంకారభూతా ప్రవహతి పరమానందకూపే యదుక్త్యా**
**గంగా తం చిత్సభేశం సురవరవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 74**

ప్రతిదినం షట్కాల పూజలలో స్ఫటికలింగం, రత్నసభాపతిమూర్తి, ఇంకా మిగిలిన అన్యదేవతలు నటరాజైన తనను మంత్రాలతోను శుద్ధమైన తీర్థాలతో అభిషేకించడంకోసం శిరస్సులో వెలిగేది అయిన గంగ, పరమానందకూపంలో (చిత్సభకు తూర్పు దిక్కులోని బావి) పరమేశ్వరుని ఆజ్ఞతో ప్రవహిస్తున్నది. అటువంటి, దేవశ్రేష్ఠులచే స్తుతింపబడ్డ కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 74

---

**శ్లో॥ స్తమ్భాకారైః పురాణైః ధృతకనకసభా భాతి యస్యాగ్రభాగే**
**యస్యాం ధర్మస్వరూపో వృషభపతిరుదగ్వక్త్రపద్మో విభాతి ।**

**యస్యామీశస్య దేవ్యా స్ఫటికవటుకయో రత్నమూర్తే మునీన్ద్రాః**
**కుర్వన్త్యద్భిః ప్రపూజాం తమపి నటవరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥75**

స్తంభరూపాన్ని పొందినవి అయిన పద్దెనిమిది పురాణాలతో ధరింపబడిన కనకసభ (విజ్ఞానమయకోశం) నటరాజమూర్తికి ముందు వెల్గుతున్నది. ఆ సభలో ఉత్తరముఖం చూస్తూ ధర్మస్వరూపుడైన నందికేశ్వరుడు వెల్గుతున్నాడు. ఆ కనకసభలో ఈశ్వరునకు, అంబికకు, స్ఫటికలింగానికి, స్వర్ణాకర్షణ భైరవునకు, రత్నసభాపతికి మునీంద్రులు అభిషేకాన్ని చేస్తున్నారు. అటువంటివాడు, నటశ్రేష్ఠుడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 75

(బ్రాహ్మం, పాద్మం, వైష్ణవం, శైవం, భాగవతం, భవిష్యం, నారదీయం, మార్కండేయం, ఆగ్నేయం, బ్రహ్మవైవర్తం, లింగం, వరాహం, స్కాందం, వామనం, కూర్మం, మాత్స్యం, గారుడం, బ్రహ్మాండం – అనేవి 18 పురాణాలు. "మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం, అనాపలింగం కూస్కాని పురాణాని పృథక్ పృథక్" అనేది దేవీ భాగవత వచనం.

శివపురాణంలోని చివరి అక్షరాన్ని రెండవ అక్షరాన్ని పురస్కరించుకొని "**వ చతుష్టయమ్**" అని చెప్పబడింది.)

---

**శ్లో॥ యద్గేహం పఞ్చసాలైర్దిశి దిశి విలసద్గోపురైర్వేదసఙ్ఖ్యై-**
**రన్నాది బ్రహ్మకోశత్వముపగతసభా పఞ్చకైర్భాతి తీర్థైః ।**
**శ్రీమూలస్థానదేవీ హరిగజవదనస్కన్దగేహైశ్చ నిత్యం**
**తత్రత్యానన్దకోశే విరచితనటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 76**

నటరాజస్వామి ఆలయం, అయిదు వీధులతో, నాల్గు దిక్కులలో వెలిగే నాల్గు గోపురాలతో, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాలని చెప్పబడే అయిదు సభలతో, (రాజసభ, దేవసభ, నర్తనసభ, కనకసభ, చిత్‌సభ) శివగంగ మొదలైన పుణ్యతీర్థాలతో, శ్రీమూలనాథుడు, అంబిక, విష్ణువు, వినాయకుడు, సుబ్రహ్మణ్యుడు మొదలైన దేవతల ఆలయాలతో ప్రకాశిస్తున్నది. అటువంటి ఆలయంలో ఆనందమయ కోశమని చెప్పబడే **చిత్సభ**లో ఎల్లప్పుడు చేయబడే నర్తనాన్ని కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 76

---

**శ్లో॥ గఙ్గాతీరస్య పశ్చాద్విలసతి సదనే సచ్చిదానన్దరూపా**
**దేవీ యా సర్వవిద్యాలయముఖకమలా భాసతే వేదహస్తా ।**
**యా యస్య జ్ఞానశక్తిశ్శివపదసహితా కామసున్దర్యాభిఖ్యా**
**తద్దేవ్యా దృష్టనృత్తం శ్రుతినిహితపదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 77**

శివగంగకు పడమటి భాగంలో వెలిగే ఆలయంలో సచ్చిదానందరూపిణి, ప్రసన్న-మైనదై, సర్వవిద్యలకు స్థానమైన ముఖకమలాన్ని కల్గినదై, నాల్గు చేతులను కల్గినదై, శివకామసుందరీ అనే పేరును కల అంబిక నటరాజస్వామికి జ్ఞానశక్తియే. అటువంటి అంబికచే వీక్షింపబడే నటనను కలవాడు, వేదశిరస్సులో నిలుపబడిన పాదం కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 77

ఈ దేవి ఆలయం శివగంగకు పడమటి దిక్కులో ఉన్నది. శివకామకోష్ఠమని కూడా వ్యవహరింపబడుతున్నది. శ్రీదేవికి చెప్పబడిన పీఠాలలో ఇదికూడ ఒకటిగా చెప్పబడుతున్నది. శ్రీవిద్యాగ్రంథాలలో చెప్పబడినా ప్రత్యేకంగా దహరవిద్యాఖండం, చిదంబరకల్పం మొదలైన గ్రంథాలలో ఈ దేవియొక్క యంత్రమంత్రఉపాసనా క్రమాలు విరివిగా చెప్పబడ్డాయి. శ్రీచక్రమేరుయంత్రం మధ్యలో ఉండే బిందుపీఠంలో నిలచిన సన్నివేశంలో కుడివైపు రెండు చేతులలో ఎఱ్ఱ కలువలను, జపమాలను ధరించి, ఎడమ వైపున ఒక చేతిలో చిలుకను, ఇంకొక చేతిని కటిప్రదేశంలో పెట్టుకొని ఈ దేవి భాసిస్తున్నది. **"పద్మస్థాం కనకప్రభాం పరిలసత్ పద్మాక్షియుగ్మోజ్జ్వలామ్, అక్షస్రక్ శుకశారికాకటిలసత్ కల్హారహస్తాబ్జనీమ్, రక్తస్రక్సువిలేపనాంబరధరాం రాజీవనేత్రార్చితాం, ధ్యాయేత్ శ్రీ శివకామకోష్ఠనిలయాం నృత్తేశ్వరస్య ప్రియామ్"** అని చిదంబర రహస్యంలో చెప్పబడింది. శ్రీ దేవియొక్క కృపవల్లనే పతంజలి ముని వ్యాకరణమహాభాష్యాది గ్రంథాలను రచించాడు. హయగ్రీవుడు, అగస్త్యుడు, లోపాముద్ర, దుర్వాసుడు, పరశురాముడు మొదలైన శ్రీవిద్యాచార్యులు, ఆదిశంకరుడు మొదలైన మహానుభావులు ఇక్కడ ఈ దేవిని ఉపాసించి తమ అభీష్టాలను, అద్వైతబ్రహ్మజ్ఞానాన్ని పొందారు.

ఈ గ్రంథకర్త అయిన ఉమాపతిశివుడు ఈ ఆలయానికి ఉత్తరంవైపు ప్రాకారంలో ఉండే ఒక కోష్ఠంలోని గోడలో శ్రీచక్రాన్ని చెక్కి, అందులో అంబికను పూజించి, ఉపాసించే శ్రీ మంత్రమూర్తి దీక్షితులనే పెద్దల వద్ద శ్రీవిద్యోపదేశాన్ని పొంది, అంబిక సన్నిధిలో శ్రీవిద్యాజపయజ్ఞాన్ని చిరకాలం అనుష్ఠించి, శ్రీదేవి అనుగ్రహంతో సకలవిద్యలను పొందారు – అని పెద్దలచే చెప్పబడుతున్నది. ఇపుడు కూడా ఈవిధంగా శ్రీచక్రం లిఖింపబడిన కోష్ఠం ఆ కోవెలలో ప్రకాశిస్తున్నది. అయితే, ఇపుడు ఆచోటు కొంచెం శిథిలమైనది. అదికూడా పూర్వంవలె జీర్ణోద్ధారణం చేయబడే అనుగ్రహం లభిస్తుందని నమ్ముతున్నాను.

పద్దెనిమిది మంది సిద్ధులలో నందికేశ్వరుడు – అనే వారు తమ కళాజ్ఞానం అనే గ్రంథంలో ఈ అంబికయొక్క నాల్గు మంత్రోపాసన క్రియలను తెలియజేశారు. తిరుమూలవర్ తమ తిరుమన్దిరమ్ గ్రంథంలో తెల్పినదికూడా ఈ అంబికను గూర్చియే.

ఆదిశంకరులు కేనోపనిషత్తుకు భాష్యం వ్రాసేటపుడు "**స తస్మిన్నవకాశే స్త్రియమా జగామ బహుశోభమానా ముమాం హైమవతీం తాం హోవాచ**" అనేచోట మనస్సుతో అంబికను ధ్యానించారు. అపుడు అంబిక మిక్కిలి దయతో పూర్వం తెల్పిన రూపంతో వారి ముందు సాక్షాత్కరించి, "బహుశోభను కల్గినది, హైమవతి అయిన ఉమను నేనే, ఈ ఆకాశక్షేత్రంలో స్వతంత్రమై ప్రకాశిస్తున్నాను. నీ మనోరథం పూర్తి అగుగాక" – అని అనుగ్రహించి అంతర్ధానమైనది. ఆ ఆదిశంకరులు ఉపనిషద్భాష్యాన్ని అంబికసన్నిధిలోనే రచించి పూర్తిచేశారని పెద్దలంటారు.

ఇంతేకాక, ఈ ఆలయాన్ని నిశితంగా గమనిస్తే, కంచిలోని కామాక్షి ఆలయంవలె శక్తికి ప్రధానాలయమై తోస్తున్నది. "తిరుపుఱాణ్డమ్" (త్రిపురాండమ్) అనే గ్రంథంలో చెప్పబడిన రీతిలో విమానంలో మూడుస్థూపాలు నిర్మింపబడినందున, సమీపంలో వేఱు శివాలయం లేనందున, దక్షిణాభిముఖంగా ఉండే నటరాజస్వామి సభకు ఉత్తరంవైపు అయినా, నిశితంగా చూస్తే కుడివైపుగా అమరి ఉన్నందున, (అంబిక) జ్ఞానశక్తి అని చెప్పబడినందున, స్వతంత్రమైన ఆలయం అనే శిల్పశాస్త్రజ్ఞుల అభిప్రాయం. అంతేకాక, అనేక విధాలైన ఇతిహాసాలు విశేషంగా కన్పడుతున్నాయి. శ్రీదేవీ భాగవతంలోని దేవీగీతలో కూడా "**మీనాక్ష్యాః పరమం స్థానం యచ్చ ప్రోక్తం చిదంబరే**" అని శ్రీదేవికి ఉత్తమస్థానంగా కీర్తింపబడింది. "**నందివిద్యా నటేశ్వరీ**" అనే లలితాసహస్ర నామసూక్తి ఈ దేవిని ఉద్దేశించే ఆ విధంగానే భట్టనారాయణుడు, భాస్కరరాయలు మొదలైన శ్రీవిద్యోపాసకుల అభిప్రాయం కూడా ఇదే.



**శ్లో॥ బ్రహ్మైవాఽఖణ్డమేతన్నటనపతితనుం ప్రాప్య వక్త్రాత్ ద్విజేన్ద్రాన్**
**బాహుభ్యః క్షత్రవర్గాన్ సకలపశుపతేః పాలనాయోరుయుగ్మాత్ ।**
**వైశ్యాన్ పద్భ్యాంశ్చ శూద్రానవికలమసృజల్లీలయా దేవరాట్ య-**
**స్తం దేవం చిత్సభేశం శ్రుతివినుతకథం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 78**

అఖండాకారమైన బ్రహ్మం ఈ నటరాజస్వామి స్వరూపాన్ని స్వీకరించి, ముఖంలో బ్రాహ్మణులను, బాహువులలో క్షత్రియులను, సకల పశు సమూహాలను రక్షించగోరి రెండు

తొడల నుండి వైశ్యులను, రెండు కాళ్ళనుండి శూద్రులను లీలగా సృష్టించాడు. అటువంటి, చిత్‌సభాపతి, వేదాలలో చెప్పబడిన గాథలను కలవాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 78

---

**శ్లో॥ స్వస్యాం శ్రీచిత్సభాయాం నటనమతిముదా కర్తుముద్యుక్తవాన్ యో**
**దేవేన్ద్రే వేణుహస్తే మురజకరయుగే శ్రీపతౌ తాలహస్తే ।**
**బ్రహ్మణ్యానన్దభాజో జిమినసుతఫణివ్యాఘ్రపాదాస్తదానీం**
**జాతా స్తం బ్రహ్మరూపం సగుణమతిగుణం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥79**

నటరాజమూర్తి తన చిత్‌సభలో నటనను చేయడానికి చాలా సంతోషంతో అంగీకరించాడు. దేవేంద్రుడు వేణువును, విష్ణువు మద్దెలను, బ్రహ్మ తాళాన్ని ధరించిన సమయంలో జిమిని అనే ముని కుమారుడైన జైమిని, పతంజలి, వ్యాఘ్రపాదుడు – అనే ముగ్గురు మునులు ఆనందాన్ని పొందినవారయ్యారు. అటువంటి, నిర్గుణసగుణ పరబ్రహ్మ రూపుడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 79

---

**శ్లో॥ విష్ణోర్మఞ్చః కదాచిచ్ఛరవదనయుతశ్రీపతఞ్జల్యభిఖ్య-**
**శ్చాత్రైః పుత్రత్వమాప్త్వా శివపణనజయోస్సూత్రభఙ్గీం సమీక్ష్య ।**
**శమ్భోర్యస్య ప్రసాదాదరచయదతులం శ్రీమహాభాష్యసంజ్ఞం**
**గ్రన్థం యత్ క్షేత్రరాజే తమలికనయనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 80**

నటరాజమూర్తి క్షేత్రరాజంలో (చిదంబరంలో) విష్ణువునకు శయనరూపి అయిన ఆదిశేషుడు ఒక సమయంలో అయిదు తలలతో పతంజలి అనే పేరును ధరించి, అత్రి మహర్షి పుత్రుడై, శివునియొక్క, పాణినియొక్క వ్యాకరణసూత్రాల అర్థాన్ని ఆలోచించి, నటరాజస్వామి అనుగ్రహంతో సాటి లేని **మహాభాష్య**మనే పేరును కల ఒక సంస్కృత గ్రంథాన్ని రచించారు. అటువంటివాడు, ఫాలంలో నేత్రాన్ని కలవాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 80

---

**శ్లో॥ పఞ్చాశద్వర్ణయుక్తైర్మనుభిరభిమతం కాంక్షిణాం దేహభాజాం**
**స్వక్షేత్రాభిఖ్యమన్త్రైరపి వితతమహాపఞ్చపఞ్చప్రయోగైః ।**
**యుక్తైర్గాయత్రిసంఖ్యై ధ్వనిమనుభిరథాభీష్టసిద్ధిప్రదో యః**
**తం తత్త్వాతీతమాద్యం కనకకవచినం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 81**

నటరాజస్వామి, అభీష్టాన్ని కోరే ప్రాణులకు యాభై అక్షరాలతో కూడినవి, తన క్షేత్రనామంతో ప్రకాశించేవి అయిన మంత్రాలతోను (చిదంబర మంత్రాలతోను), విస్తార రూపాలైన ఇరవై అయిదు ప్రయోగాలతో కూడినవి, ఇరవై నాల్గు అక్షరాలతో కూడినవి అయిన ధ్వని అనే మంత్రాలతోను జపం చేసేవారికి ఇష్టసిద్ధిని ఇస్తున్నాడు. అటువంటివాడు, తత్త్వాతీతుడు, ఆద్యుడు, బంగారు కవచాన్ని ధరించినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 81

**శ్లో॥ యస్య స్వాన్తామ్బుజాతాదుడుపతిరుదభూచ్చక్షుషశ్చణ్డరశ్మి-**
**ర్వక్త్రామ్భోజాచ్చ వహ్నిర్దివిషదధిపతిః ప్రాణతో గన్ధవాహః ।**
**యన్నాభేరన్తరిక్షం చరణసరసిజాత్కుమ్భినీద్యౌశ్చ శీర్ష్ణః**
**కాష్ఠాశ్చ శ్రోత్రయుగ్మాత్తమపి పరశివం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 82**

నటరాజస్వామి మనస్సులోనుండి చంద్రుడు, కంటిలోనుండి సూర్యుడు, ముఖంలో నుండి అగ్ని, ఇంద్రుడు, ప్రాణాలలో నుండి వాయువు, నాభిలోనుండి అంతరిక్షం, (భూమ్యాకాశాల మధ్య ఉండే ప్రదేశం) కాలిలో నుండి భూమి, తలలో నుండి స్వర్గలోకం, రెండు చెవులలో నుండి దిక్కులు ఆవిర్భవించాయి. అటువంటివాడు, పరమశివుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 82

**శ్లో॥ విద్యాం వామేక్షణేన్దోశ్శ్రియమపి కలయన్ దక్షనేత్రాబ్జబన్ధోః**
**ఫాలేక్షాచ్చిత్రభానోః సకలజనిమతాం పాపతూలం చ దగ్ధ్వా ।**
**స్వస్యాఙ్ఘ్ర్యాలోకమాత్రాదుపనిషదుదితబ్రహ్మబోధం ప్రయచ్ఛన్**
**యస్సర్వాన్ రక్షతీశస్తముడుపతిధరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 83**

నటరాజమూర్తి ఎడమ నేత్రమైన చంద్రుని నుండి విద్యను, కుడినేత్రమైన సూర్యుని నుండి సంపదను అనుగ్రహించి, ఫాలనేత్రమైన అగ్నినుండి సకలప్రాణుల పాపమనే దూదిని దహించి, తన శ్రీచరణాన్ని దర్శించినంతమాత్రంలో వేదాంతాలలో చెప్పబడిన బ్రహ్మజ్ఞానాన్ని ఇచ్చి, సర్వలోకాలను రక్షిస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 83

శ్లో॥ కైలాసే భోగపుర్యాం సకలజనిమతాం హేతురాస్తే శివో యః
సర్వక్షేత్రేషు గూఢో విలసతి సతతం స్వాంశసాదాఖ్యరూపః ।
సోఽప్యేవాంశీధరణ్యాహృదయసరసిజే చిత్సభాన్తస్థభిత్తౌ
కుర్వన్ నృత్తం ముదాఽణ్డానవతి తమనఘం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥84

కైలాస పర్వతంలో సకల ప్రాణులకు కారణభూతుడైన పరమశివుడు ప్రధానమైన ఆలయంలో ప్రకాశిస్తున్నాడు. ఆ పరమశివుడు సర్వక్షేత్రాలలోను (శరీరాలలోను) మఱుగుపడి ఉండేవాడై, తన అంశతో సదాశివరూపుడై, సదా ప్రకాశిస్తున్నాడు. అటువంటి పరమేశ్వరుడే భూమికి హృదయస్థానమైన చిత్సభలో లోపల ఉండే కుడ్యంలో (గోడలో) పూర్ణాంశతో నర్తనాన్ని చేస్తూ సంతోషంతో బ్రహ్మాండాలను రక్షిస్తున్నాడు. అటువంటి, పరిశుద్ధుడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 84

శ్లో॥ యద్భాసా భాతి నిత్యం సకలమపి జగత్తత్పరంజ్యోతిరేవ
వైరాజే హృత్సరోజే కనకసదసి వై సామ్బనృత్తేశమూర్తిః ।
భూత్వా నృత్తం కరోతి ప్రభురపి జగతాం రక్షణే జాగరూకః
తం దేవం చిత్సభేశం విధృత సుమసృణిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥85

నటరాజమూర్తి కాంతిచే ఎల్లప్పుడు సమస్తలోకం ప్రకాశిస్తున్నది. ఆపరంజ్యోతి స్వరూపుడైన నటరాజస్వామియే విరాట్ పురుషుని హృదయకమలమైన కనకసభలో అంబికతో కూడిన నటరాజరూపాన్ని ధరించి నర్తనాన్ని చేస్తున్నాడు. లోకానికి ప్రభువై ఉన్నప్పటికీ, రక్షించే విషయంలో జాగరూకుడై ఉన్నాడు. అటువంటి దేవుడు, చిత్సభకు ఈశుడు, చేతిలో ధరించిన పుష్పబాణం, అంకుశం – అనే వీటిని కలవాడైన (ఇటువంటి రూపం మంత్రశాస్త్రంలో చెప్పబడింది.) కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 85

శ్లో॥ ఆత్మైవ శ్రీనటేశో ధరణిరవిజలాన్యగ్నివాయూ విహాయ
చన్ద్రో యజ్వా చ భూత్వాఽవతి జగదఖిలం పఞ్చవింశేశభిన్నః ।
తత్త్వాతీతో మహేశోఽప్యురురణురఖిలాభ్యన్తరే రాజతే యః
తం సోమం సోమమిత్రం సుముఖగుహసుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥86

ఆత్మస్వరూపి అయిన నటరాజస్వామి భూమి, సూర్యుడు, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, చంద్రుడు, యజమాని – అనే వీరి రూపాన్ని ధరించి, సమస్త లోకాన్ని రక్షిస్తున్నాడు.

ఈ నటరాజస్వామి పంచవింశతిమూర్తులకంటె విలక్షణుడు, తత్త్వాతీతుడు. మహేశ్వరుడు అయినా చిన్నపెద్ద అనే తేడా లేకుండా అందఱు ప్రాణుల హృదయంలో ప్రకాశిస్తున్నాడు. అటువంటివాడు, ఉమతో కూడిన వాడు, కుబేరునకు సఖుడు, వినాయకుడు, సుబ్రహ్మణ్యుడనే ఇద్దఱిని పుత్రులుగా కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 86

శ్లో॥ **యద్బ్రహ్మోచ్ఛ్వాసరూపా శ్రుతిరపి సకలా తత్సమానా స్మృతిశ్చ**
**కల్పాగాథాః పురాణం వివిధమనువరాస్సేతిహాసాశ్చ విద్యాః ।**
**సర్వత్రాఽద్యాపి భాన్తి స్వయమపి కృపయా యత్సభాయాం నటేశో**
**భూత్వా లోకాన్ సమస్తానవతి తమసమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥87**

నటరాజస్వామి అనే పరంబ్రహ్మయొక్క ఉచ్ఛ్వాస రూపాలైన వేదాలు, వాటికి సాటివచ్చే స్మృతులు, కల్పాలు, గాథలు, పురాణాలు, అనేకవిధాలైన మంత్రాలు, ఇతిహాసాలు – అనే విద్యలు, అన్నిచోట్ల ఈనాటికీ ఎల్లప్పుడు ప్రకాశిస్తున్నాయి. తానే స్వయంగా కృపతో పరమేశ్వరుడు చిత్సభలో నటేశుడై సమస్త లోకాలను రక్షిస్తున్నాడు. అటువంటివాడు, సాటిలేనివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 87

శ్లో॥ **వేదాన్తే వాక్యరూపా ఉపనిషద ఇమా బ్రహ్మసామీప్యభాజః**
**తాసాం ముఖ్యా దశస్యుర్యతివిరచితమహాభాష్యయుక్తా మహత్యః ।**
**స్తమ్భాకారా స్తువన్తి స్వవిదితనటనం సర్వదా బ్రహ్మరూపం**
**తం దేవం చిత్సభేశం పరమతిమహసం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 88**

వేదాంతంలో వాక్యరూపాలు, బ్రహ్మసామీప్యాన్ని పొందినవి అయిన (బ్రహ్మ ప్రతిపాదనాలైన) ఉపనిషత్తులలో యతిచే (శంకరభగవత్పాదులచే) రచింపబడిన మహాభాష్యాలతో కూడిన పది ఉపనిషత్తులు ముఖ్యమైనవి. ఈ ఉపనిషత్తులు దండాకార స్వరంతో (ఉదాత్తానుదాత్తస్వరాలు లేకుండా కేవలం మధ్యమస్వరంతో) తనచే తెలియబడిన నర్తన విలాసాన్నికల పరబ్రహ్మరూపుడైన ఆ నటరాజస్వామిని సదా స్తుతిస్తున్నాయి. అటువంటివాడు, దేవుడు, చిత్సభేశుడు, శ్రేష్ఠుడు, అధికమైన కాంతిని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 88

("**ఈశకేనకఠప్రశ్నముండమాండూక్యతిత్తిరిః, ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ**" అనేవి దశోపనిషత్తులు.)

శ్లో॥ శాబ్దే శాస్త్రే ఫణీన్ద్రైః ప్రమితి ఫణితిషు శ్రీకణాదాక్షపాద్యైః
వేదాన్తే వ్యాసరూపైర్జైమినసుతకృతౌ భట్టకౌమారతుల్యైః ।
కల్పే బోధాయనైస్తై శ్రుతిషు విధిసమైః పూజ్యతే యో మునీన్ద్రైః
త్రైసాహస్త్రైస్సభాయాం తమపి గురువరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥89

వ్యాకరణశాస్త్రంలో పతంజలి, తర్కశాస్త్రంలో కణాదుడు, అక్షపాదుడు – అనే ఇద్దఱు, వేదాంతంలో వ్యాస, జైమిని మునులు, మీమాంసలో కుమారిలభట్టుతో సమానులు, కల్పంలో బోధాయన మహర్షి, వేదాలలో బ్రహ్మకు సమానులు, ప్రసిద్ధులు అయిన మూడు వేలమంది మునులచే (దీక్షితులచే) పరమేశ్వరుడు సభలో పూజింపబడుతున్నాడు. అటువంటివాడు, గురుశ్రేష్ఠుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 89

---

శ్లో॥ కఞ్జాక్ష్యా స్వస్య శక్త్యా సహకృతనటనం కస్య శీర్ష చ్ఛిదన్తం
కాలం కామం పురాణి స్వపదసరసిజాత్ ఫాలనేత్రాత్స్మితాచ్చ ।
హత్వా బ్రహ్మర్షిసూనుం సకలదివిషదశ్చాపి రక్షన్తమీశం
దేవేడ్యం చిత్సభేశం దశశతవదనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 90

తామరపూవువంటి నేత్రాలను కల్గినది, తనకు శక్తి అయిన అంబికతో కలిసి నాట్యాన్ని చేసేవాడు, బ్రహ్మశిరస్సును ఛేదించినవాడు, ప్రసిద్ధుడు, యముడు, మన్మథుడు, త్రిపురాసురులు – అనే వీరిని తన పాదంతో, నేత్రంతో, హాసంతో సంహరించి, మార్కండేయుని సకల దేవతలను రక్షించినవాడు, ఈశ్వరుడు, దేవతలచే స్తుతింపబడేవాడు, చిత్సభేశుడు, వేయి ముఖాలతో కూడినవాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. (మంత్రశాస్త్రం, చిదంబరకల్పంలోని ధ్వనిమంత్రప్రకరణంలో వేయి ముఖాలతో కూడిన రూపం వర్ణింబడింది.) 90

---

శ్లో॥ యల్లిఙ్గే బ్రహ్మవిష్ణుప్రముఖసురవరా భస్మరుద్రాక్షభాజః
సస్త్రీకాస్సామ్బమూర్తిం సకలతనుభృతాం సర్వదం సర్వరూపమ్ ।
అభ్యర్చ్యాఽఽప్తేష్టసిద్ధిం దివి భువి సకలైస్సేవ్యమానా బభూవు-
స్తం దేవం చిత్సభేశం విధిహుతహవిషం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥91

పరమేశ్వర స్వరూపమైన లింగంలో భస్మరుద్రాక్షధారులు తమ భార్యలతో కూడినవారు, బ్రహ్మ, విష్ణు – అనే వీరిని పురస్కరించుకొన్నవారైన దేవతలందఱు

అంబికతోకూడిన వాడు, సకలప్రాణులకు సర్వాన్ని అనుగ్రహించేవాడు, అన్ని రూపాలను కలవాడు అయిన పరమేశ్వరుని పూజించి, తాము కోరిన సిద్ధిని పొంది, స్వర్గంలో, భూమిలో అందరిచే సేవింపబడేవారయ్యారు. అటువంటివాడు, దేవుడు, చిత్సభేశుడు, శాస్త్రప్రకారంగా హోమం చేయబడిన హవిస్సులను కలవాడు (అగ్నిస్వరూపుడు), కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 91

---

**శ్లో॥ శ్రద్ధావన్తః శ్రుతిజ్ఞాః పరశివకృపయాఽధీతశాస్త్రాదివిద్యాః**
**వ్యర్థాం వాచం త్యజన్తః ప్రతిదినమసకృత్పూజయన్తః ప్రభుం యమ్ ।**
**కుర్వన్తః శ్రౌతకర్మాణ్యనితరసులభాన్యాత్మబోధం లభన్తే**
**విప్రేన్ద్రాః స్వాంశభూతాః పరశుమృగధరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥92**

శ్రద్ధతోకూడినవారు, వేదాలను తెలిసినవారు, పరమేశ్వరుని కృపతో అభ్యసించిన శాస్త్రాదివిద్యలను కలవారు, వ్యర్థమైన మాటలను విడచినవారు, యజ్ఞాలను (శ్రౌతకర్మలను) చేసేవారు, తమ అంశవల్ల ఉద్భవించినవారైన బ్రాహ్మణోత్తములకు ప్రభువైన పరమేశ్వరుని ప్రతిదినం మాటిమాటికి పూజను చేసేవారై, ఇతరులకు పొందడానికి సాధ్యం కాని ఆత్మజ్ఞానాన్ని పొందుతున్నారు. అటువంటివాడు, పరశువును, లేడిని ధరించినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 92

---

**శ్లో॥ ఫాలే భస్మత్రిపుణ్డ్రం ఫణినమపి గలే పాదపీఠే చ భూతం**
**బాహ్వోర్వహ్నిఞ్చ ఢక్కాం వదనసరసిజే సూర్యచన్ద్రౌ శిఖీన్ద్రమ్ ।**
**ఓంకారాఖ్యప్రభాయాం సురభువనగణం పార్శ్వయోర్వాద్యకారౌ**
**యః కృత్వాఽఽనన్దనృత్తం స్వసదసి కురుతే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥93**

పరమేశ్వరుడు తన ఫాలంలో విభూతి త్రిపుండ్రాన్ని, కంఠంలో సర్పాన్ని, పాద-పీఠంలో భూతాన్ని, రెండు చేతులలో అగ్ని, డమరుకాలను, తామరపూవువంటి ముఖంలో సూర్యచంద్రులను, అగ్నిని, ఓంకారరూపమైన ప్రభలో దేవలోకాలను అన్నిటిని రెండువైపులా వాద్యాలను మోగించేవారైన భానుగోపుడు, బాణాసురుడనే ఇద్దరిని కలవాడై, తన సభలో ఆనందనర్తనాన్ని చేస్తున్నాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 93

---

**శ్లో॥ సర్వేషాం ప్రాణినాం యస్స్వపదసరసిజం పూజితుం పాణియుగ్మం**
**స్వం ద్రష్టుం లోచనే ద్వే స్వచరితమఖిలం వక్తుమీశస్సువాచమ్ ।**
**స్వస్య ప్రాదక్షిణార్థం చరణయుగమపి ధ్యానయోగాయ చిత్తం**
**దత్వా రక్షత్యజస్రం తముదకమకుటం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 94**

పరమేశ్వరుడు అన్ని ప్రాణులకు తన చరణాన్ని పూజచేయడానికి రెండు చేతులను, తనను దర్శించడానికి రెండు కన్నులను, తన చరిత్రలను అన్నిటిని చెప్పడానికి మంచి వాక్కును, తనను ప్రదక్షిణం చేయడానికి రెండు కాళ్ళను, తనను ధ్యానం చేయడానికి చిత్తాన్ని ఇచ్చి, సదా రక్షిస్తున్నాడు. అటువంటివాడు, జలాన్ని మకుటంగా కల్గిన (గంగను ధరించిన) కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 94

**శ్లో॥ నాహం కర్తా చ భోక్తా న చ మమ సుకరం దుష్కరం కర్మ కిఞ్చిత్**
**ధర్మాధర్మౌ చ దుఃఖం సుఖమపి కరణం నైవ మత్తః పురోఽన్యః ।**
**సోఽహం బ్రహ్మాస్మి నిత్యో నహి జనిమరణే నిర్వృతోఽహం సదేతి**
**స్వాన్తే పశ్యన్తి బోధాద్యమపి యతివరాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 95**

నేను కర్తను గాను, భోక్తను కాను, నాకు సులభమైనది, దుష్కరమైనది అయిన కర్మ కొంచెం కూడా లేదు. ధర్మం లేదు. అధర్మం లేదు. సుఖం, దుఃఖం – అనేవానికి కారణం లేదు. నాకంటే అన్యుడింకొకడు లేదు. అటువంటి నేను బ్రహ్మమై ఉన్నాను. నిత్యుడను. నాకు జన్మ లేదు. నాశం లేదు. సదా మనస్సులో ఆనందాన్ని పొందినవాడను – అనే ఈ విధమైన జ్ఞానంతో సన్న్యాసి శ్రేష్ఠులు తన హృదయంలో పరమేశ్వరుని దర్శిస్తున్నారు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను.

**శ్లో॥ గఙ్గాపాథోవహన్తం గజవదననుతం గన్ధవాహస్వరూపం**
**గాయత్రీవల్లభాఖ్యం నగపతితనుజాస్వీకృతార్ధాఙ్గమీశమ్ ।**
**గోవిన్దాన్వేషితాఙ్ఘ్రిం గురవరవపుషం గోపతేః పృష్ఠవాసః**
**గౌరీనాథం గుణీడ్యం గిరివరవసతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 96**

గంగను ధరించినవాడు, గజముఖుడైన వినాయకునిచే స్తుతింపబడేవాడు, వాయు స్వరూపుడు, త్రైవర్ణికులచే మూడువేళల ఉపాసింపబడే గాయత్రి అనే దేవికి నాయకుడు, పార్వతిచే అంగీకరింపబడిన అర్ధశరీరభాగాన్ని కలవాడు, ఈశ్వరుడు, మహావిష్ణువుచే

అన్వేషింపబడిన పాదాన్ని కలవాడు, దక్షిణామూర్తి స్వరూపుడు, వృషభమూపురంపై ఉండేవాడు, గౌరీనాథుడు, గుణవంతులచే స్తుతింపబడేవాడు, ఉన్నత పర్వతాలపై నివసించేవాడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 96

---

**శ్లో॥ పద్మాకారాసనస్థం పరమసురరిపుం పఞ్చవక్త్రారవిన్దం**
**పాణ్డోః పుత్రార్చితాఙ్ఘ్రిం పవిధరవినుతం పార్వతీప్రేమపాత్రమ్ ।**
**పశ్వీశం పీతరూపం పరశుముఖధరం పఞ్చవక్త్రారిమాద్యం**
**నృత్యన్తం చిత్సభాయాం నిటిలవరదృశం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 97**

తామరపూవు వంటి ఆసనంలో ఉండేవాడు, శ్రేష్ఠుడు, అసురులకు శత్రువు, అయిదు ముఖాలు కలవాడు, పాండవులచే అర్చింపబడిన పాదాలను కలవాడు, వజ్రాయుధాన్ని ధరించిన ఇంద్రునిచే స్తుతింపబడినవాడు, పార్వతి ఆశకు పాత్రమైనవాడు, పశువులకు ఈశ్వరుడు, తెల్లని వర్ణాన్ని కలవాడు, పరశువు మొదలైన ఆయుధాలను ధరించేవాడు, పంచవక్త్రుని నరసింహుని సంహరించినవాడు, (శరభరూపుడు), ఆద్యుడు, చిత్సభలో నర్తనంచేసేవాడు, ఫాలంలో నేత్రాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 97

---

**శ్లో॥ మీమస్వాన్తార్చితాఙ్ఘ్రిం భుజగవరధరం భోగమోక్షైకహేతుం**
**భక్తానాం రక్షితారం భవమయజలధేస్తారకం భాసమానమ్ ।**
**భూషాభిర్భర్గమీశం భిషజముపనిషద్వేదినం భూతనాథం**
**బ్రహ్మానన్దస్వరూపం భవమఖిలతనుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 98**

భీమసేనునిచే మనస్సులో పూజింపబడిన చరణాన్ని గొప్ప సర్పాలను ధరించినవాడు, భోగమోక్షాలకు ముఖ్యకారణమైనవాడు, భక్తులను రక్షించేవాడు, ఆభరణాలతో వెలిగేవాడు, భర్గుడు, ఈశుడు, వైద్యుడు, ఉపనిషత్తులచే తెలియదగినవాడు, భూతాలకు నాథుడు, బ్రహ్మానందస్వరూపుడు, భవుడు, నాశం లేని శరీరాన్ని కలవాడు, (సర్వశరీరరూపుడు), కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 98

---

**శ్లో॥ శాటీపాలాఖిలాశాపతిముఖవినుతం శఙ్ఖపాణ్యర్చితాఙ్ఘ్రిం**
**శమ్భుం శర్వం శివేశం శశధరమకుటం శాక్వరేన్ద్రే వసంతమ్ ।**

**శోణాద్రీశం శుభాఙ్గం శుకకరశివయాఽఽలిఙ్గితం శ్రౌతగమ్యం**
**నృత్యన్తం స్వర్ణసంసద్యఖిలనతపదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 99**

తన వస్త్రాన్ని సంరక్షణచేసే సమస్త దిక్పతులను ఆదిగా కల దేవతలచే స్తుతింపబడేవాడు, గంగను చేతిలో ధరించిన విష్ణువుచే పూజింపబడిన పాదాన్ని కలవాడు, మంగళాన్ని కల్గించేవాడు, శర్వుడు, అంబికకు పతి, చంద్రుని మకుటంలో కలవాడు, శాక్వరేంద్రంలో నివసించేవాడు, అరుణాచలానికి ప్రభువు, మంగళమైన అంగాలను కలవాడు, చేతిలో చిలుకను ధరించిన అంబికచే ఆలింగనం చేసికోబడినవాడు, శ్రౌత మార్గంలో పొందదగినవాడు, సువర్ణ సభలో నాట్యం చేసేవాడు, సకల ప్రాణులచే నమ-స్కరింపబడే పాదాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 99

---

**శ్లో॥ కాఞ్చ్యాం పృథ్వీశలిఙ్గం జనిమజలమయం జమ్బుకేశేఽస్తి నిత్యం**
**శోణాద్రౌ వహ్నిలిఙ్గం వనచరపతినా పూజితం కాలహస్తౌ ।**
**వాయ్వీశం తిల్వవన్యాం త్రిశిఖరమకుటే సంస్థమాకాశలిఙ్గం**
**యల్లిఙ్గం సర్వమేతత్తమపి నటపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 100**

కాంచీపురంలో మృణ్మయలింగం, తిరువానైక్కావల్ (జంబుకేశ్వరం)లో జలమయమైన లింగం, తిరువణ్ణామలై (శోణాద్రి)లో అగ్నిమయమైనలింగం, కాళహస్తిలో కన్నప్ప అనే వనవాసి నాయకునిచే పూజింపబడిన వాయులింగం, తిల్లైవనంలో త్రిశిఖరమకుటంలో ప్రకాశించే ఆకాశలింగం – అనే ఈ లింగాలు పరమేశ్వరుని అంశ భూతాలైన లింగాలు. అటువంటివాడు, నటపతి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 100

---

**శ్లో॥ యస్మాత్సర్వం చరం చాచరమపి సముత్పన్నమాదౌ జగత్తత్**
**యేనేదం రక్షితఞ్చ ప్రవిలయసమయే లీయతే యత్ర సర్వమ్ ।**
**తం దేవం చిత్సభాయామనవరతనటం బ్రహ్మవిష్ణ్వాదిపార్శ్వం**
**తేజోరూపం త్రికూటస్థితిజుషమమలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 101**

పరమేశ్వరునివల్ల చలించేవి, చలించనివి (చరాచర) అన్నీ మొదట జనించాయి. అటువంటి ఈ లోకం పరమేశ్వరునిచే రక్షింపబడుతున్నది. పరమేశ్వరునిలో లోకం సంహారకాలంలో లయం పొందుతున్నది. అటువంటివాడు, దేవుడు, చిత్సభలో సదా

నర్తనం చేసేవాడు, బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలచే పరివేష్ఠింపబడి ఉండేవాడు, కాంతిరూపుడు, త్రికూటంలో నివసించేవాడు, (త్రికూట మనేది మందిరం. ఇందులో అక్షర రూపంగా ఉండేవాడు. ఇది శ్రీవిద్యోపాసనద్వారా తెలియదగినది) పరిశుద్ధుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 101

---

**శ్లో॥ సృష్ట్యై బ్రహ్మాణమాదౌ హరిమథ జగతాం రక్షణాయాత్మరూపః**
**సంహృత్యై రుద్రమూర్తిం త్వథ నిఖిలతిరోధానహేతోర్మహేశమ్ ।**
**తల్లోకానుగ్రహార్థం హిమగిరితనయాసక్తసాదాఖ్యమూర్తిం**
**యస్సృష్ట్వాఽఽనన్దనృత్తం సదసి వితనుతే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥102**

ఆత్మస్వరూపి అయిన పరమేశ్వరుడు కల్పారంభకాలంలో లోకాలను సృష్టించడం కోసం బ్రహ్మను, రక్షణకోసం విష్ణువును, సంహారంకోసం రుద్రమూర్తిని, తిరోధానం కోసం మహేశ్వరుని, అనుగ్రహం కోసం అంబికతోకూడిన సదాశివ మూర్తిని సృష్టించి, వారివద్ద ఆయా కార్యాలను అప్పగించి, తాను అందులో సంబంధం లేనివాడై, సభలో ఆనందంగా నర్తనం చేస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 102

---

**శ్లో॥ త్ర్యక్షం త్రైలోక్యవాసం త్రిపురవిజయినం త్రైగుణాతీతరూపం**
**త్రేతాగ్నిస్త్వగ్నిమూర్తిం త్రిశిఖరిశిఖరే రాజమానం త్రిశక్తిమ్ ।**
**త్రైసాహస్రద్విజార్చ్యం త్రిసృభిరపి సదా మూర్తిభిః దృష్టనృత్తం**
**త్రైవిధ్యం చిత్సభేశం నిగమమయతనుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥103**

మూడు నేత్రాలను కలవాడు, ముల్లోకాలలో నివసించేవాడు, త్రిపురాలను జయించినవాడు, త్రిగుణాతీతమైన రూపాన్ని కలవాడు, యజ్ఞవాటికలో ఉండే అగ్ని స్వరూపుడు, మూడు శిఖరాలను కల పర్వతంపై (త్రికూట శిఖరంపై) వెలిగేవాడు, మూడు శక్తులతో కూడిన వాడు, త్రిసహస్రమునులచేత పూజింపబడేవాడు, త్రిమూర్తులచే సదా వీక్షింపబడే ఆనందతాండవాన్ని కలవాడు, మూడు వేదాలచే ప్రతిపాదింపబడేవాడు, చిత్సభకు ఈశ్వరుడు, వేదస్వరూపుడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 103

శ్లో॥ ధర్మం దత్వా జనానాం డమరుకనినదైరర్థమప్యగ్నినా యః
కామం దత్వాఽఽభయేన స్వపదసరసిజాత్ మోక్షరూపం పుమర్థమ్ ।
దత్వా లోకాన్ సమస్తానవతి నటపతిః నాయకశ్చిత్సభాయాః
తం దేవం నృత్తమూర్తిం విసదృశచరితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥104

చిత్సభనాయకుడైన పరమేశ్వరుడు తన డమరుకం యొక్క శబ్దంతో లోకాలను ధర్మాన్ని, అగ్నితో అర్థాన్ని, అభయంతో కామాన్ని, తన పాదంతో మోక్షాన్ని అనుగ్రహించి రక్షిస్తున్నాడు. అటువంటివాడు, నృత్తమూర్తి, సాటిలేని చరిత్రలు కలవాడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 104

శ్లో॥ అన్నః కోశే విధాతా గరుడవరరథః ప్రాణకోశే చ రుద్రః
చేతః కోశే మహేశస్సదను చ వరవిజ్ఞానకోశే సదాఖ్యః ।
ఆనన్దాభిఖ్యకోశే లసతిచ సతతం యస్య శమ్భోః నిదేశాత్
తం దేవం రాజరాజేశ్వరవరసుహృదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥105

శంభువు అయిన పరమేశ్వరుని ఆజ్ఞచే అన్నమయకోశంలో బ్రహ్మ, ప్రాణమయ కోశంలో విష్ణువు, మనోమయకోశంలో రుద్రుడు, విజ్ఞానమయకోశంలో మహేశ్వరుడు, ఆనందమయకోశంలో సదాశివుడు వెల్గుతున్నాడు. అటువంటి దేవుడు, కుబేరుని స్నేహితునిగా కలవాడు, కుంచితాంఘ్రిని కల్గినవాడైన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 105

శ్లో॥ ధృత్వా యః సర్వదేశః పదజలజముఖే శ్రేష్ఠముక్తాలిమజ్గే
సౌవర్ణం కఞ్చుకఞ్చ ప్రథితమణిచితం భూషణం దివ్యవస్త్రమ్ ।
నృత్తం కృత్వాఽఽగతానాం సకలతనుభృతాం ధర్మముఖ్యాన్ పుమర్థాన్
దత్వా రక్షత్యనాదిమునికృతయజనః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥106

పరమేశ్వరుడు ఎల్లప్పుడు పాదంలో, కంఠంలో, ముఖంలో, అంగాలలో ఉన్నతమైన ముత్యాలను, స్వర్ణకవచాన్ని, నవరత్నాలతో పొదగబడిన ఆభరణాలను, అందంగా ఉండే వస్త్రాలను ధరించి, నర్తనాన్ని చేసి, తనను శరణుపొందిన ప్రాణులకు ధర్మాది పురుషార్థాలను ఇచ్చి, రక్షిస్తున్నాడు. అటువంటి ఆ కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 106

**శ్లో॥ శిష్యాణాం వేదబాహ్యస్థితిమధిజుషతాం బోధనార్థం పఠన్తః**
**చర్యాయోగాఙ్ఘ్రిం భేదప్రకటితవిభవాన్ కామికాద్యాగమాంస్తాన్ ।**
**భూదేవా వాజపేయక్రతుగతనృపతిప్రోద్ధృతోద్దామశుక్ల-**
**ఛత్రాయం పూజయన్తి శ్రుతిపథవిధినా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥107**

వేదమార్గానికి బాహ్యులైన శిష్యులకు బోధించడంకోసం చర్యా, క్రియ, యోగం, జ్ఞానం - అనే నాల్గు పాదాలతో కూడిన కామికంనుండి కాతూలం వరకుగల ఇరవై-ఎనిమిది ఆగమాలను పఠించేవారు, వాజపేయమనే యజ్ఞాన్ని చేసేటపుడు ప్రభువులచే ఎత్తి పట్టుకొనబడిన గొప్ప తెల్లని గొడుగులను కలవారైన బ్రాహ్మణులు (త్రిసహస్ర మునులు) వేదాలలో చెప్పబడిన విధిప్రకారం పరమేశ్వరుని పూజను చేస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 107

**శ్లో॥ వేదాన్తోద్గీతరూపం జ్వలనడమరుకౌ ధారయన్తం కరాభ్యా-**
**మన్యాభ్యాం డోలముద్రామభయమపి సదాపస్మృతౌ దక్షపాదమ్ ।**
**విన్యస్యాకుఞ్చితేన ప్రణమదఖిలదం వామపాదేన నిత్యం**
**దేవ్యా సాకం సభాయాం రచయతి నటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥108**

వేదాంతాలలో కీర్తింపబడిన రూపాన్ని కలవాడు, రెండు చేతులతో అగ్నిని, డమరుకాన్ని ధరించేవాడు, మిగిలిన రెండు చేతులతో డోలముద్రను, అభయముద్రను కలవాడు, కుడికాలును భూతంపై నిలిపి, నమస్కరించే వారికోసం కొంచెం ఎత్తి వంచిన ఎడమ పాదంతో ఇష్టాన్ని ఇచ్చేవాడు, దేవితో కలిసి సభలో నర్తనం చేసేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 108

**శ్లో॥ ఆమన్వశ్రం సుదీప్తాం నిజతనుమభితస్సత్యరూపప్రభాన్తర్**
**వామే యుక్తం స్వశక్త్యా వసుదలకమలస్వార్ణకిఞ్జల్కశోభమ్ ।**
**వ్యాప్తం సాహస్రకోష్ఠస్థితశివమనుభిర్మోహనాద్యైః యదీయం**
**చక్రం సంపూజయన్తి ప్రతిదినమనఘాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥109**

ఈ మంత్రంలో **చిదంబరమంత్రప్రస్తారం** వివరింపబడుతున్నది.

పద్నాలుగు కోణాలవరకు (శ్రీచక్రంలోని మన్వశ్రం వరకు) వ్యాపించి ప్రకాశించే

తనరూపానికి నాల్గు వైపుల పరివేష్ఠింపబడిన ఓంకారవలయరూపమైన ప్రభావళికి ఎడమవైపున అంబికారూపాన్ని కల్గినది, ఎనిమిది తామర దళాలలో వ్రాయబడిన తన (చిదంబర) మంత్రం యొక్క అక్షరాలతో కూడిన కింజల్కాలతో వెలిగేది, మోహనం మొదలైన భేదాలతో వేయి కోష్ఠాలలో లిఖింపబడిన పంచాక్షరాలలో వ్యాపించినది అయిన పరమేశ్వరుని యంత్రాన్ని ప్రతిదినం పరిశుద్ధులైన మునులు పూజచేస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 109

(ఈ స్తుతి ఆరంభంలోని 1,2 శ్లోకాలలో చిదంబర యంత్రాన్ని భావనా యంత్రమని, అది బంగారు పతకంలో ఉన్నదని, ఈ శ్లోకంలో ఆ చిదంబర మంత్రప్రస్తార క్రమాన్ని తెలిపినందున, ఆ యంత్రం బంగారు పతకంలో ఇటువంటి ప్రస్తారంతో లిఖింపబడినదిగా మునులచే భావింపబడినట్లు తాత్పర్యం. అందువల్ల అక్కడ బంగారు మొదలైన పతకంలోనో, లేక, గోడలోనో వ్రాయబడిన యంత్రం లేదని స్పష్టం. ఈ యంత్ర ప్రస్తారాలుగా సంస్కృతం లోని యంత్రశాస్త్రాలలోను, ద్రావిడభాషలోని సిద్ధుల గ్రంథాలలోను చెప్పబడినప్పటికీ, ఈ గ్రంథకర్త పూజాపాతంజలంలో చెప్పబడిన యంత్రాన్నే ఇక్కడ తెలిపారు. యంత్రపూజతో పరమేశ్వరుని దర్శించడం సులభం.

ఈ శ్లోకం ద్వారా శ్రీచక్రంలోను, శ్రీ విద్యోపాసకులచే పూజింపబడేవాడు నటరాజ మూర్తియే అనేది తెలియజేయబడింది.)



**శ్లో॥ త్రైచత్వారింశదస్రే వసునృపకమలే వృత్తభూచక్రమధ్యే**
**బిన్దౌ సన్తానకల్పద్రుమనికరయుతే రత్నసౌధే మనోజ్ఞే ।**
**బ్రహ్మాద్యాకారపాదే శివమయఫలకే స్వర్ణమఞ్చే నిషణ్ణో**
**దేవ్యా యః పూజ్యతే తం హరిముఖవిబుధైః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥110**

నలభైమూడు కోణాలతో కూడినది, ఎనిమిది, పదహారు దళాలతో కూడినదైన శ్రీచక్రం మధ్యలో ఉండే బిందువులో, స్థానకల్పద్రుమాలతోకూడినది, మనోహరమైన నవరత్నాలతో పొదగబడినది అయిన అందమైన రత్నసౌధంలో బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు – అనే వీరి స్వరూపమైన నాల్గుపాదాలను కల్గినది, సదాశివరూపమైన పైనగల ఫలకంతో కూడినది అయిన, స్వర్ణమయమైన మంచంలో దేవితోకూడ వెలిగే పరమేశ్వరుడు హరి మొదలైన దేవతలచే పూజింపబడుతున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 110

84వ శ్లోకంలో చెప్పబడిన "**అంశి**" అనేదానిని ఆధారంగా చేసికొని, ఈ శ్లోకంతో మిగిలిన క్షేత్రాలలో ఉండే మూర్తులు అంశభూతులని తెల్పుతున్నారు.

**శ్లో॥ యల్లీలారబ్ధనృత్తప్రసృతవరజటాజూటసమ్మర్దవేగ-**
**ప్రోద్యత్స్వర్గాపగామ్భోజనితకణగణా యత్ర యత్ర ప్రపేతుః ।**
**తేఽప్యాసన్ తత్ర తత్ర స్వజనిమముఖరా మూర్తయః క్షేత్రరాజే**
**తం దేవం నన్దిముఖ్యప్రమథగణవృతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥111**

పరమశివుని లీలతో ఆరంభింపబడిన నటనలో విస్తరించిన శ్రేష్ఠమైన జటాజూటం యొక్క సమ్మర్దంలోని వేదంచేత బయటకు వేగంగా వెలువడిన గంగయొక్క జలంనుండి ఏర్పడిన జలకణాల సమూహం ఏ యే స్థలాలలో పడినదో, ఆయా స్థలాలు అవి (తంతువులు) లింగాలు, మూర్తులుగా అయినవి. అటువంటి దేవుడు, నంది మొదలైన ప్రమథగణాలతో పరివేష్ఠింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 111

(ఇతరక్షేత్రాలలో ఉండే అన్ని రూపాలు నటరాజమూర్తియే, 'అంశి' అనేదే ఈ శ్లోకంలోని ముఖ్యభావం. దీనిని శ్రీనటరాజ సహస్రనామంలోని "**స్వానన్యః స్వాంశితాఖిలః**" అనే నామం బలపరుస్తున్నది. ఆ నామంయొక్క చింతామణి అనే సంస్కృతవ్యాఖ్యలో ఈ విషయం వివరంగా తెలియజేశాను.)

**శ్లో॥ శ్రీవిద్యాషోడశార్ణైర్మిలితమపి తథా పంచవర్ణైః కుమారీ**
**బీజైర్యన్మన్త్రరాజం ముహురజకమలానాథరుద్రేశశర్వాః ।**
**జప్త్వా సంసృష్టిరక్షాలయసకలతిరోధానకానుగ్రహాద్యాః**
**సిద్ధీరాపుస్తమీశం శుభకరనయనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥112**

శ్రీవిద్య, మహాషోడశాక్షరి, పంచాక్షరం, బాలామంత్రం - అనే వీటితో కూడిన నటరాజమూర్తి మంత్రాన్ని ("**శ్రీమచ్చిదంబరసమ్మేళనసభానటమహావిద్యా**" అనబడే చిదంబర మంత్రాన్ని) మాటిమాటికి బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు - అనేవారు జపించి, సృష్టి, స్థితి, సంహారం, తిరోధానం, అనుగ్రహం - ఇత్యాదిగా ఉండే స్థితులను పొందారు. అటువంటి ఈశ్వరుడు, మంగళాన్ని కల్గించే నేత్రాలను కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 112

(ఈ మంత్రోద్ధారక్రమం దహరవిద్యాఖండమనే గ్రంథంలో విరివిగా చెప్పబడింది.

దీనిని గురుముఖంగా నేర్వాలి. ఈ మంత్రాన్ని మొదట ఆవుడైయార్ కోవెలలో పరమేశ్వరుడు మణివాచకర్‌కు ఉపదేశించాడని అంటారు.)

**శ్లో॥ యస్యాహుర్నృత్తమూర్తేః శ్రుతిహృదయవిదశ్శక్తిమేకామపీద్యాం**
**కాలీం కోపే చ దుర్గాం యుధి జగదవనే విష్ణురూపాం భవానీమ్ ।**
**భోగే జ్ఞానక్రియేచ్ఛామయవివిధతనుం సర్వసంహారకాలే**
**స్వాన్తర్లీనాం ప్రసన్నాం తమిభముఖసుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥113**

వేదాల రహస్యాన్ని తెలిసిన పెద్దలు నటరాజమూర్తికి పూజ్యురాలైన అయిన శక్తి ఒకరే అయినప్పటికీ, కోపం కల్గిన సమయంలో కాళి అని, యుద్ధకాలంలో శక్తి అని, లోకాలను రక్షించే సమయంలో విష్ణువు అని, క్రీడాకాలంలో భవాని అని, ఇంతేకాక, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి – అనే ప్రకారాలను కల్గినదిగా, లోకాలను సంహరించే కాలంలో పరమేశ్వరునిలో అంతర్లీనమైనదిగా తెల్పుతున్నారు. అటువంటి, ప్రసన్నుడైన, వినాయకుని పుత్రునిగా కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 113

**శ్లో॥ శ్రీహీరాల్లబ్ధచిన్తామణిమనుమనుసన్ధాయ నిర్జీవదేహే**
**మాతుర్మామల్లదేవ్యా నిశి విగతభయో హర్షనామోపవిశ్య ।**
**విప్రః శ్రీరుద్రభూమౌ యదధికకృపయా మాతరం సర్వవిద్యాం**
**సిద్ధీరన్యాశ్చ లేభే కరధృతడమరుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥114**

హర్షుడనే పేరును ఒక బ్రాహ్మణుడు తన తండ్రి అయిన శ్రీహీరుడనే వానివద్ద చింతామణి అనేపేరు కల ఏకాక్షర చిదంబర మంత్రాన్ని పొంది, రుద్రభూమిలో రాత్రివేళ భయం లేనివాడై, చనిపోయిన తన తల్లి మామల్లదేవి దేవిమృతశరీరంపై కూర్చుని దానిని జపించాడు. అందువల్ల సంతుష్టుడైన పరమేశ్వరుడు కృపవల్ల అతని చనిపోయిన తల్లిని, సకల విద్యలను, ఇంకా పలు సిద్ధులను పొందాడు. అటువంటివాడు, చేతిలో డమరుకాన్ని ధరించినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 114

**శ్లో॥ గఙ్గామాహర్తుకామే కపిలమునితపోవహ్నిసందగ్ధదేహాన్**
**స్వర్గం నేతుం పితౄన్ స్వాన్ యజతి రఘుపతౌ యః పురస్తాదుదేత్య ।**

**గర్వాహూత్యాస్నః పతన్తీం స్వశిరసి కణికాసన్నిభాం తాం నిరుధ్య**
**స్తుత్యా రాజ్ఞః పృథివ్యాం వ్యసృజదనుపమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥115**

భగీరథుడు కపిలముని తపోగ్నిలో దహింపబడిన శరీరాలను కల తన పితృ మూర్తులైన సగరులను స్వర్గానికి పంపించగోరి, స్వర్గలోకంలో ఉండే గంగను భూలోకానికి తీసికొని రాదలచినవాడై తపస్సు చేసేటపుడు, పరమేశ్వరుడు అతని ముందు ప్రత్యక్షమై, ఆకాశం నుండి గర్వంతో క్రిందకు పడే గంగను తన శిరస్సులో ఒక చిన్న జలకణంతో సాటిగా ధరించి, తరువాత, ఆ భగీరథుని స్తోత్రం వల్ల భూమికి విడచాడు. అటువంటి, సాటి లేని, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 115

శ్లో॥ **వంశ్యః కాకుత్స్థరాజ్ఞః దశరథనృపతిః యస్య పుత్రప్రదేష్టిం**
**క్షేత్రే కృత్వా వసిష్ఠప్రముఖవచనతః స శ్రియం పఞ్చవర్ణమ్ ।**
**జప్త్వా వర్షం వసిత్వా సదసి నటపతేః దర్శనాద్రామపూర్వాన్**
**విష్ణోరంశాన్సుపుత్రానభజదఘహరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥116**

పరమేశ్వరుని క్షేత్రమైన చిదంబరంలో కాకుత్స్థుడనే ప్రభువు వంశంలో జన్మించిన దశరథుడు అనే ఒకరాజు పుత్రలాభాన్ని కల్గించే యాగాన్ని వశిష్ఠుడు మొదలైన మునుల మాటతో అనుష్ఠించి, శ్రీ బీజంతోకూడిన పంచాక్షరిని జపించి, ఒక సంవత్సరకాలం అక్కడ నివసించి, సభలో నటరాజమూర్తిని దర్శించి, ఆ నటరాజస్వామి అనుగ్రహంతో విష్ణువుయొక్క అంశాన్ని కల శ్రీరాముడు మొదలైన నల్గురు పుత్రులను పొందాడు. అటువంటివాడు, పాపాన్ని తీర్చేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. (తిల్లైవన మాహాత్మ్యపురాణంలో ఈ వృత్తాంతం తెలుపబడింది.) 116

శ్లో॥ **కుమ్భోద్భూతోపదేశాద్వనభువి విరజాహోమసమ్భూతభూత్యాం**
**ఆసీనం సోఢసీతావిరహమపి సదా వేదసారం సహస్రమ్ ।**
**నామ్నామావర్తయన్తం దశరథతనయం వీతశోకం వ్యతానీత్**
**గీతావాక్యైర్య ఈశః స్వశరమపి దదౌ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥117**

అగస్త్యుని ఉపదేశంవల్ల దండకారణ్యం అనే వనంలో చేసిన విరజాహోమంలో పుట్టిన విభూతిలో కూర్చున్నవాడు, సీతావిరహాన్ని కలవాడు, వేదసారశివసహస్రనామస్తోత్రాన్ని అని పారాయణం చేసేవాడు, దశరథ పుత్రుడైన శ్రీరాముని పరమేశ్వరుడు శివగీతోపదేశంతో

శోకం లేనివానినిగా చేశాడు. తన పాశుపతాస్త్రాన్ని ఇచ్చాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 117

**శ్లో॥ గన్ధర్వశ్చిత్రసేనస్సురపతివచనాత్తిల్వకాన్తారమధ్యే**
**నృత్యన్తం చిత్సభాయాం గిరివరతనయాపాఙ్గదుగ్ధాబ్ధిచన్ద్రమ్ ।**
**శమ్భుం నత్వా ముహుర్యత్కరడమరురవాధీతసఙ్గీతవిద్యా**
**సిద్ధాన్తోఽభూత్తమీశం సురగణవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥118**

చిత్రసేనుడనే గంధర్వుడు దేవేంద్రుని మాటవల్ల తిల్లైవనం మధ్యలో చిత్సభలో నాట్యం చేసేవాడు, అంబికయొక్క కటాక్షమనే క్షీరాబ్ధికి చంద్రునివంటివాడు, శంభువు అయిన పరమేశ్వరుని మాటిమాటికి నమస్కరించి, ఆ పరమేశ్వరుని చేతిలో ఉండే డమరుకం యొక్క శబ్దం వల్ల గ్రహించిన సంగీతశాస్త్రాన్ని కలవాడయ్యాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 118

**శ్లో॥ యన్నృత్తం ద్రష్టుకామా రవిశశిముఖరాస్స్వాభిధానైర్నవేశాః**
**లిఙ్గాత్ సంస్థాప్య గఙ్గాతటవరనికటే పూజయిత్వా సభాయామ్ ।**
**తేజోరూపం చ లాస్యం బహిరివ హృదయే సన్తతం చిన్తయన్త-**
**ర్వాసం చక్రుస్తమీశం నిఖిలతనుమయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥119**

పరమేశ్వరుని నర్తనాన్ని దర్శింపగోరి సూర్యుడు మొదలైన గ్రహాలు తొమ్మిది మంది తమ పేరుతో తొమ్మిది లింగాలను శివగంగాతీరసమీపంలో స్థాపించి, పూజించి, సభలో తేజోరూపమైన తాండవాన్ని బయటవలె, హృదయంలోకూడా సదా ధ్యానిస్తూ, క్షేత్రవాసాన్ని చేస్తున్నారు. అటువంటివాడు, నిఖిల శరీరరూపుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 119

**శ్లో॥ శ్రీవిద్యాం సంజపన్తో బహుదినమసకృద్యే హయగ్రీవకుమ్భో-**
**ద్భూతప్రష్ఠా మునీంద్రాః పరాశరమహిషీం పాశకోదణ్డహస్తామ్ ।**
**సాక్షాత్కృత్యాథ తద్వాగమృతజనిమయద్దేవమన్త్రప్రభావాత్**
**నృత్తం దృష్ట్వాఽఽత్మబోధం సుఖకరమభజత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్॥120**

చిరకాలం మాటిమాటికి శ్రీవిద్యామంత్రాన్ని జపించేవారైన హయగ్రీవుడు, అగస్త్యుడు

మొదలైన మునులు పాశాన్ని, కోదండాన్ని చేతిలో కల్గినది, పరమేశ్వర పత్ని అయిన త్రిపురసుందరిని నేరుగా దర్శించి, తర్వాత, ఆ దేవియొక్క అమృతంవంటి వాక్కునుండి వ్యక్తమైన పరమేశ్వర మంత్రాన్ని ఉపాసించి, దాని ప్రభావంతో నటనను దర్శించి, సుఖాన్ని కల్గించే ఆత్మ జ్ఞానాన్ని పొందారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 120

**శ్లో॥ గీత్యాం సన్దిహ్యమానః కలహరసికహృన్నారదాఖ్యస్సురర్షిః**
**ధాతుర్వాక్యేన గత్వా యదమలనిలయం మన్త్రయోగాన్మహేశమ్ ।**
**ప్రత్యక్షీకృత్య ఢక్కోద్భవసరిగమపాధానివర్ణాన్ ద్విషట్కాన్**
**బుధ్వా గాయన్ సవీణః సదసి వసతితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥121**

**చిదమ్బర రహస్యే :**

ఆదౌ శ్రీనటరాజమూర్తిమసకృన్నత్వా మునిర్నారదః తద్ధస్తామ్బుజచఞ్చలడమరుకాజ్జాతౌ స్వరౌ యౌ సపౌ తాభ్యాం యుగ్మగపఞ్చకస్వరవరాన్ జాతాన్ రిగామాధనీన్ జ్ఞాత్వా ద్వాదశసుస్వరైః । పరిమితం సఙ్గీతశాస్త్రం దధౌ । ఇతి।

సమేశఢక్కోద్భవినౌ షనాన్తౌ సఙ్గీతవిద్యా ప్రకృతిస్వరౌ ద్వౌ। రిగౌ మధౌ నిఃప్రభవాశ్చ తాభ్యాం ద్వౌద్వౌ స్వరౌ ప్రాప్య దశత్వ మాపుః । ఇతి సరిగమపధనీనాం సప్తగీతస్వరాణాం ప్రకృతిపదమవాప్తౌ షాన్త నాన్తౌ స్వరౌ ద్వౌ । రిగమధనిదశత్వం ప్రాప తే సప్తవర్ణాః ప్రకృతివికృతియుక్తా ద్వాదశాఽఽద్యాః స్వరాస్స్యుః - ఇతి చ।

యడ్ఢక్కానినదోద్భవాన్ సరిరిగాగామామపాధాధనీ నీన్ శుద్ధాన్ వికృతీంశ్చ రూపగణితాన్ గీతి స్వరాన్నాయకాన్ । రేఫాఙ్కా శ్రుతయః కలారయ ఖుటీ గోపాఙ్గఖేటాఖమిత్యుద్భూతాత్మవిభాగశశ్చ సుతరాం ప్రాపుః క్రమాత్సోఽవతాత్ - ఇతి శివశఙ్కరదీక్షితః (సంగీతరత్నాకరే షష్ఠే వాద్యాధ్యాయే) :

స్నిగ్ధతా ఘనతా రక్తిః వ్యక్తిః ప్రచురతా ధ్వనేః । లాలిత్యం కోమలత్వం చ నోదానురణనం తథా। త్రిస్థానత్వం శ్రావకత్వం మాధుర్యం సావధానతా। ద్వాదశేతి గుణాః ప్రోక్తాః ఫూత్కారే సూరి శార్ఙ్గిణా - ఇతి ఫూత్కారాఙ్కితానాం ద్వాదశస్వరాణాం క్రమాత్ ద్వాదశ గుణా ఉక్తాః ।

యడ్ఢక్కోద్భసూత్రజాలమనఘం స్మృత్వా పురా పాణినిః కాణాదశ్చ పతఞ్జలిశ్చ భగవాన్ శ్రీజైమిని నారదః । వ్యాఘ్రాఙ్ఘ్రిం స్సనకాదయో ధిషణయా కుర్వన్ సుశబ్దావలిం తర్కం యోగవితానగీతియజనాన్యద్వైతభావం పరమ్ ।

( ఈ శ్లోకంలో సంగీత స్వరాలు నిర్మాణం చేయబడుతున్నాయి.)

కలహప్రియుడైన నారదుడనే దేవముని సంగీతవిద్యాతంత్రంలో ఉండే స్వరాల భేదాలలో సందేహంతో తన తండ్రి అయిన బ్రహ్మదేవుని వద్దకు పోయి, నమస్కరించి, సంగీతస్వరాల నిర్మాణం చేసి, ఉపదేశించమని అర్థించాడు. అపుడు బ్రహ్మదేవుడు "**పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ**", "**సంగీతరసచాతుర్యం శంకరో వేత్తి నాపరః**"– అని చెప్పబడినందున పరమేశ్వరుని వల్లనే అది నిర్మించడం సాధ్యం. అందువల్ల నీవు భూమిలో ఉండే శ్రీచిదంబరక్షేత్రానికి పోయి, శ్రీ నటరాజస్వామిని ఉపాసిస్తే, అతని అనుగ్రహం వల్ల అవి నీకు చక్కగా తెలుస్తాయి. అందువల్ల చిదంబరానికి వెళ్ళు " అని ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞానుసారం పరమేశ్వరుని పరిశుద్ధమైన నిలయాన్ని (చిదంబరాన్ని) చేరి, అక్కడ మంత్రయోగంతో (మంత్రయోగమంటే – మూలాధారం మొదలైన స్థానాలలో నటరాజ స్వామిని ధ్యానించి, ఆయా మంత్రాలను ఆవృత్తిచేయడం, దీనిని గూర్చి దహరవిద్యాఖండంలో విస్తృతంగా తెలుపబడింది.) చిరకాలం ఆరాధించి, శ్రీనటరాజ స్వామిని సాక్షాత్తుగా దర్శించి, అతని ఢక్కనుండి పుట్టిన "**సరిగమపధని**" అనే పన్నెండు విధాలైన భేదాలను స్వరాలు కల్గినవిగా తెలిసి, తన వీణలో ఆవిధంగా ధ్వనింపజేసి, పాడి, ఆ నటరాజస్వామి ముందు సభలో వసిస్తున్నాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 121

చిదంబరరహస్యంలో – "**ఆదౌ శ్రీనటరాజమూర్తిమసకృత్ నత్వా మునిర్నారదః తద్ధస్తాంబుజ చంచలడ్డమరుకాజ్జాతౌ స్వరౌ యౌసపౌ, తాభ్యాం యుగ్మగ పంచక స్వర వరాన్ జాతాన్ రిగామాధనీన్ జ్ఞాత్వా ద్వాదశ సుస్వరైః పరిమితం సంగీతశాస్త్రం దధౌ**" – పూర్వం ఒకానొక సమయంలో నారదుడు నటరాజమూర్తిని నమస్కరించి, అతనిచేతిలోని డమరుకం నుండి మొదట పుట్టిన "**స,ప**" అనే రెండు స్వరాలను, తరువాత, ఆరెండు స్వరాలనుండి రెండింతలుగా చేసిన స్వభావాన్ని కల "రిగమధని" అనే స్వరాలను (పదింటిని) తెలిసికొని, సంగీతశాస్త్రాన్ని పన్నెండు స్వరాలతో పరిమితమైనదిగా గ్రహించాడు – అని చెప్పబడింది.

ఇంతేకాక – "**సమేశ ఢక్కోద్భవినౌ షనాంతౌ సంగీతవిద్యాప్రకృతిస్వరౌ ద్వౌ, రిగౌ మధౌ నిః ప్రభవాశ్చ తాభ్యాం ద్వౌ ద్వౌ స్వరౌ ప్రాప్య దశత్వమాపుః** " అని, "**సరిగమపధనీనాం సప్తగీతాస్వరాణాం ప్రకృతిపదమవాప్తౌ షాంతనాంతౌ స్వరౌ ద్వౌ, రిగమధని దశత్వం ప్రాప తే సప్తవర్ణాః ప్రకృతివికృతివర్ణాః ద్వాదశాద్యాః స్వరాః స్యుః**" అనికూడా అందులో చెప్పబడింది. ఈ రెండు శ్లోకాలవల్ల సంగీతస్వరాలు శ్రీనటరాజస్వామి ఢక్కనుండి పుట్టినవి

అని చెప్పబడింది. "**స, ప**" అనే రెండు ప్రకృతి స్వరాలు ముందు ఉద్భవించి, తరువాత ఆ రెండు స్వరాల నుండి "**రిగమధని**" అనే వికృతి స్వరాలు పుట్టాయి - అని చెప్పబడినా, పరంపరా సంబంధంచేత అన్ని స్వరాలు ఢక్కనుండి పుట్టినవే.

"**యడ్ఢక్కానినదోద్భవాన్ సరిరిగాగామామపాధాధనీనీన్ శుద్ధాన్ వికృతీంశ్చ రూపగణితాన్ గీతిస్వరాన్ నాయకాన్, నాయకాన్, రేఫాంకాశ్శ్రుతయః కలారయఖుటీ-గోపాంగభేటాఖమిత్యుద్భూతాత్మవిభాగశ్చ సుతరాం ప్రాపుః క్రమాత్ సోఽవతాత్**" అని శివశంకరదీక్షితుల సూక్తి. శ్రీనటరాజు ఢక్క ధ్వనినుండి పుట్టినవి, వికృతులు పన్నెండు భేదాలను కల్గినవి. (అంటే - "**స,ప**" - అనే షట్జ, పంచమాలనే భేదాలను కల్గినవి, మిగిలిన "**రి గ మ ధ ని**" అనే ఋషభ, గాంధార, మధ్యమ, దైవత, నిషాదాలు ప్రత్యేక ప్రత్యేకంగా రెండు రెండు విధాలు.) నాయకులైన స్వరాలు ఈ స్వరాలను ఇరవై రెండు శ్రుతులు, 132121313212 అనే - ఈ విధమైన విభాగాన్ని కల్గి, చాలావరుసగా పొందాయి. అటువంటి నటరాజమూర్తి మనలను రక్షించాలి - అని దీని భావం. ఈ విధంగా తిల్లైవనంలో నివసించినవారు, సంగీతంలో పలురాగాలను రచించినవారైన శివగంగాదీక్షితులనే పెద్దల వాక్కువల్ల స్వరాలు పన్నెండు అని, అవి నటరాజస్వామి ఢక్కనుండి పుట్టినవి అని దృఢీకరింపబడుతున్నది. (ఈ శివగంగా దీక్షితులు నందనార్ చరిత్ర కీర్తనాచార్యులైన శ్రీ గోపాలకృష్ణ భారతి సమకాలంలో జీవించిన వారని తెలుస్తున్నది.)

సంగీతరత్నాకరం - షష్ఠే - వాద్యాధ్యాయే - "**స్నిగ్ధతా ధనతా రక్తిః, వ్యక్తిః ప్రచురతా ధ్వనేః, లాలిత్యం కోమలత్వం చ నాదానురణనం తథా, త్రిస్థానత్వం శ్రావకత్వం మాధుర్యం సావధానతా, ద్వాదశేతి గుణాః ప్రోక్తాః ఫూత్కారే సూరిశార్గిణా" - ఇతి ఫూత్కారాంగి తానాం ద్వాదశ స్వరాణాం క్రమాత్ ద్వాదశ గుణా ఉక్తాః** " (ఫూత్కారమనే పేరునుకల పన్నెండు స్వరాలకు వరుసగా పన్నెండు గుణాలు చెప్పబడ్డాయి). "**యడ్ఢక్కోద్భవసూత్రజాల మనఘం స్మృత్వా పురా పాణినిః కాణాదశ్చ పతంజలిశ్చ భగవాన్ శ్రీజైమినిర్నారదః, వ్యాఘ్రాంఘ్రిః సనకాదయో ధిషణయా కుర్వన్ సుశబ్దావళిం తర్కం యోగవితానగీతి యజనాన్యద్వైతభావం పరమ్**" - ఈ శ్లోకంలో సంగీతశాస్త్రం నారదమునిచే రచింపబడిందని, దానికి మూలం శ్రీనటరాజస్వామి ఢక్కనుండి పుట్టిన ధ్వని - అని చెప్పబడింది. ఇంకా వివరిస్తే విస్తృతి పెరుగుతుంది.

ఇక, అయిదు శ్లోకాలలో విష్ణువుయొక్క అయిదు అవతారాల నిగ్రహాన్ని వర్ణిస్తున్నారు.



శ్లో॥ పాఠీనాకారభాజం ఫణిభువనసమానీతవేదాసురఘ్నం
పుచ్ఛాఘాతప్రశాన్తామ్బునిధిశిఖిశిఖం పర్వతేన్ద్రానుకల్పమ్ ।
విష్ణుం దృష్ట్వాఽతిభీత్యా విబుధపరిబృఢైః స్తూయమానః కపాలీ
యస్తం నిఘ్నన్ జహార ద్వినయనమపి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥122

గొప్ప మత్స్యరూపాన్ని పొందినవాడు, పాతాళలోకానికి వేదాలను తీసికొని పోయిన సోమకుడనే అసురుని సంహరించినవాడు, తోకతో కొట్టినందున ఆర్పబడిన సముద్రంలోని బడబాగ్నిని కలవాడు, గొప్ప పర్వతంతో సాటివచ్చేవాడైన విష్ణువును చూచి చాలా భయపడిన దేవశ్రేష్ఠులచే స్తుతింపబడ్డ కపాలి అయిన పరమేశ్వరుడు ఆ విష్ణువును నిగ్రహించి, అతని రెండు కన్నులను అపహరించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 122

శ్లో॥ భీమం పీతామ్బురాశిం కమఠవరతనుం కాలకూటోపమాగ్ని-
జ్వాలాసన్దిగ్ధవక్త్రం జగదపి నిఖిలం క్షోభయన్తం స్వకృత్యైః ।
బ్రహ్మాద్యైరప్యజయ్యం హరిమధివసుధం కర్షయన్ యస్తదీయాన్
అఙ్గాన్ కణ్ఠే దధౌ తం నిఖిలసురనుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥123

భయంకరుడు, సముద్రాన్ని పానం చేసినవాడు, కూర్మరూపాన్ని ధరించినవాడు, కాలకూటానికి సాటివచ్చే అగ్నిజ్వాలలతో కూడిన ముఖాన్ని కలవాడు, తన దుష్కృత్యాలతో లోకాలను అన్నిటిని హింసించినవాడు, బ్రహ్మ మొదలైన దేవతలకు కూడా జయింపరాని వాడు, అయిన హరిని పరమేశ్వరుడు ఆ విష్ణువును భూమిలోనికి ఆకర్షించి, అతని అంగాలను కంఠంలో ఆభరణంగా ధరించాడు. అటువంటివాడు, దేవతలచే స్తుతింప బడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 123

శ్లో॥ పోత్రీరూపం మహాన్తం జలధిగతధరాం దంష్ట్రయోద్ధృత్యవేగాత్
యుద్ధే హత్వా హిరణ్యం సురరిపుమఖిలాఽనిష్టకృత్యైశ్చరన్తమ్ ।
వైకుణ్ఠం భైరవో యశ్శితశిఖవిగలద్వహ్నికీలాసశూల-
ప్రోతం కృత్వా తదీయం రదమురసి దధౌ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥124

పెద్ద వరాహ రూపాన్ని ధరించినవాడు, సముద్రంలో మునిగిన భూమిని తన కోరదంతంతో ఉద్ధరించినవాడు, హిరణ్యాక్షుడనే దేవశత్రువైన అసురుని యుద్ధంలో

సంహరించి, అందఱికి సుఖాన్ని కల్గించిన కృత్యాలతో సంచరించేవాడైన విష్ణువును భైరవరూపాన్ని దాల్చి, పరమేశ్వరుడు నిశితమైన అగ్రంనుండి వెలువడే అగ్నిజ్వాలలతో కూడిన శూలంలో గుచ్చి, అతని కోరదంతాన్ని పెరికి, తన వక్షస్సులో ఆభరణంగా ధరించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 124



**శ్లో॥ భీత్యా సన్త్రాసమానే నరహరివపుషో దేవతానాం సమూహే**
**ధాత్రా సంస్తూయమానశ్శరభవరతనుస్సాలువః పక్షిరాజః ।**
**వేగాత్తం ఛేదయిత్వా స్వపదనఖముఖైస్తత్త్వచాలఙ్కృతోఽభూత్**
**దంష్ట్రా సందీప్తలోకస్తమఖిలవరదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥125**

దేవసమూహాలు దుష్కృత్యాలతో కూడిన నృసింహరూపాన్ని చూచి, పరుగెత్తి నపుడు, బ్రహ్మచే స్తుతింపబడినవాడు, శరభమనే పక్షిరూపాన్ని ధరించినవాడైన పరమేశ్వరుడు వేగంగా ఆ నరసింహుని తన పాదనఖాగ్రాలతో చీల్చి, అతని తోలుతో అలంకరింప బడినవాడు, తన కోరదంతంతో ప్రకాశించేటట్లుగా చేయబడిన లోకాన్ని కలవాడయ్యాడు. అటువంటి, అన్ని వరాలను ఇచ్చే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 125



**శ్లో॥ యుద్ధే భగ్నోరుకాయం నరహరివపుషం గణ్డభేరుణ్డరూపీ**
**భూత్వా గర్జన్తమగ్రే శరభఖగపతిర్యస్స్వఫాలాక్షికుణ్డాత్ ।**
**ఉగ్రప్రత్యఙ్గిరాఖ్యాం శతశతవదనాం కాలికామాశు సృష్ట్వా**
**తస్యా జిహ్వాగ్రవహ్నిం సుచరువదనయత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥126**

యుద్ధంలో భగ్నమైన గొప్ప శరీరాన్ని కలవాడు, గండభేరుండమనే పక్షిరూపాన్ని ధరించి తన ముందు గర్జించేవాడైన నరసింహుని శరభరూపి అయిన పరమేశ్వరుడు తన ఫాలనేత్రమనే కుండంనుండి ఉగ్ర, ప్రత్యంగిర అనే పేర్లను కల్గినది, వేయి ముఖాలతో కూడినదైన కాళిని శీఘ్రంగా సృష్టించి, ఆమె జిహ్వాగ్రంలో ఉండే అగ్నికి చరువుగా (హోమద్రవ్యంగా) చేశాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 126

(ఈ వృత్తాంతం ప్రత్యంగిరా మంత్ర కల్పంలో తెలుపబడింది. "**పువిప్పాణి**" అనే సిద్ధుడు "**పలతిరట్టు**" అనే ద్రావిడభాషలోని వైద్యగ్రంథంలోను దీనిని గూర్చి తెలిపాడు.

ఈ ప్రత్యంగిరను శరభశక్తి అని, అధర్వణభద్రకాళి అని, ఆ దేవీ ఉపాసకులపట్ల వైరం కూడదని ("**ప్రత్యంగిరాధ్యయనశీలే న కుర్యాద్వైరమాత్మనః**") అని చెప్పబడింది. ఈ దేవి యొక్క ఉపాసనా క్రమాలు అధర్వణ వేదంలో కూడా కన్పిస్తున్నాయి. రామాయణంలో చెప్పబడిన ఇంద్రజిత్తు చేసిన నికుంభిలయాగ మనేది దీనిని ఉద్దేశించియే.)

---

**శ్లో॥ యాచ్నా ఖర్వీకృతాంగం బలిమఖసదసి స్వాం తనూం వర్ధయిత్వా**
**ద్యావాభూమీసురారే ర్మకుటమపి పదా మానయిత్వా త్రిలోకీమ్ ।**
**హుఙ్కారాద్భీషయన్తం సురగణవినుతో వామనం యో వినిఘ్నన్**
**కఙ్కాలం తస్య దేహత్వచమపి హృతవాన్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥127**

యాచనార్థం చిన్నరూపాన్ని ధరించినవాడు, బలిచక్రవర్తి యాగశాలలో తనశరీరాన్ని పెద్దదిగా చేసి, ఆకాశాన్ని, భూమిని, బలిచక్రవర్తి తలను తన పాదాలతో కొలిచి, మూడు లోకాలను తన గర్జనతో భయంపొందేటట్లు చేసిన వామనుని, దేవసమూహాలచే స్తుతింపబడిన పరమేశ్వరుడు సంహరించి, అతని కంకాళమనే నడుములోని మధ్యఎముకను, దేహంలోని తోలును హరించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 127

---

**శ్లో॥ శ్రీచక్రస్యన్దనస్థాం గజతురగసమారూఢశక్త్యగ్రభాగాం**
**నిత్యావారాహిమన్త్రిణ్యనుచరసహితాం దృష్టబాలాస్త్రవిద్యామ్ ।**
**సర్వాస్త్రాశ్లిష్టహస్తాం రణభువి విలసద్యుద్ధవేషాం భవానీం**
**దృష్ట్వా తుష్టోఽభవత్తం ధనపతిసుహృదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥128**

శ్రీశంకరస్వరూపమైన రథంలో ఉన్నది, గజాలు, అశ్వం అనే వీనిపై అధిరోహించిన శక్తి గణాలను ముందు భాగంలో కల్గినది, ఫాలంలో వారాహి, మంత్రిణి మొదలైన శక్తులతో కూడినది, బాలాస్త్రవిద్యను చూచి సంతోషించేది, సర్వాస్త్రాలను చేతిలో ధరించినది, యుద్ధవేషంతో కూడినది అయిన భవానిని పరమేశ్వరుడు యుద్ధంలో (భండాసురునితో జరిగిన పోరులో) చూచి సంతోషంతో కూడినవాడయ్యాడో, అటువంటివాడు, కుబేర సఖుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 128

---

**శ్లో॥ విష్ణోరంశావతారాన్ దశకరనఖరైః యుద్ధరఙ్గే సృజన్తీ**
**కామేశాలోకనోద్యద్గజవదనకరధ్వస్తవిఘ్నేశయన్త్రా ।**

**యస్యాస్త్రేణాశుభణ్డం ససుతగణపురం నాశయామాస దైత్యమ్**
**దేవీ శ్రీచక్రసంస్థా తమపి శివకరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥129**

యుద్ధరంగంలో మత్స్యాది విష్ణువు యొక్క అవతారాలను పదింటిని తన హస్తనఖాల నుండి ఆవిర్భవింపజేసేది, కామేశ్వరుని ముఖాన్ని చూచినమాత్రంతోనే ఉద్భవించిన వినాయకుని చేతితో ధ్వంసం చేయబడిన మహావిఘ్నేశ యంత్రాన్ని కల్గినది, శ్రీచక్రంలో ఉండేది అయిన దేవి పరమేశ్వరుని కామేశ్వరాస్త్రంతో ("**కామేశ్వరాస్త్రం శ్రీమచ్చిదంబరం దశాక్షరీమంత్రాధిష్ఠానకమ్**") భండుడనే అసురుని అతని పరివారంతోపాటు సంహరించింది. అటువంటివాడు, మంగళాన్ని కల్గించేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. (ఈవృత్తాంతాన్ని లలితోపాఖ్యానంలో చూడవచ్చు.) 129

---

శ్లో॥ **ద్వాత్రింశద్రాగబోధచ్యుతమకుటశశిస్వచ్ఛపీయూషధారా**
**సంగావాప్తస్వజీవామ్బుజభవవదనోద్దామగీతాభిరామమ్ ।**
**స్తబ్ధీభూతర్షినారీగణమధివిపినం సర్వశృఙ్గారరూపం**
**యం దృష్ట్వా విష్ణుమాయాపతిమతిమతనోత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥130**

ముప్పై రెండు సంగీత కర్తృరాగాలను తెలియజేసేది, మకుటంలో ఉండే చంద్రుని శుద్ధమైని అమృతధారయొక్క సంబంధంచేత పొందబడిన ప్రాణధారతో కూడినవి అయిన బ్రహ్మదేవుని ముఖాలనుండి వెలువడిన గొప్ప గానంచేత మనోహరుడు, మునిపత్నులను స్తబ్ధలుగా చేసినవాడు అందాలన్నిటిని కలరూపాన్ని కల్గినవాడైన పరమేశ్వరుని దారుకా వనంలో చూచి విష్ణుమోహిని తనకు నాయకుడుగా అతడు కావాలనే బుద్ధిని పొందింది. (భావించింది) అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 130

(చిదంబర రహస్యంలోకూడా సంగీత రాగాలు ముప్పైరెండుగా చెప్పబడ్డాయి. "**శంభౌ దారుకకాననే మధురయా గీత్యా ప్రగీతే శిరో శిరోభూషాచంద్రకలాచ్యుతా-మృతరఝరీప్లావాత్ సజీవం విధేః, మూర్ధా కల్పితమండనం ఖగమితైః రాగైరగాయద్ధరిః దృష్ట్వా వేణుమపాస్య మోహమభజత్ సాకం మునీంద్రైః భృశమ్**" (పరమేశ్వరుడు దారుకా వనంలో పాడినపుడు అతని శిరస్సులో ఉండే చంద్రకళ నుండి స్రవించిన అమృతధారయొక్క సంబంధంచేత చైతన్యాన్ని పొందిన బ్రహ్మదేవుని తలలు అతనికి కంఠాభరణమయ్యాయి. ఆ శిరస్సులు ముప్పైరెండు భేదాలను కల రాగాలతో పాడినవి. దీనిని చూచిన విష్ణువు తన పిల్లనగ్రోవిని పారవేసి, అక్కడ ఉండే మునులతో పాటు చాలా మోహాన్ని పొందాడు).

దీనిని కాళిదాస మహాకవి కూడా "**పురాతనీం బ్రహ్మకపాలమాలాం కంఠే వహంతం ముహురాశ్వసంతీమ్, ఉద్గీతవేదాం మకుటేందువర్షత్సుధాభశాఘాప్లుతలబ్ధసంజ్ఞామ్**" అని కుమారసంభవంలో (12-17) బ్రహ్మకపాలమాల గానంచేసినట్లుగా పలికాడు. సంగీత రత్నాకరవ్యాఖ్యానంలో కల్లినాథుడనే వారిచే ఇది అంగీకరింపబడింది. (శ్రీనటరాజమూర్తి కంఠంలో ఎల్లప్పుడు ధరించే సువర్ణ బ్రహ్మకపాలమాలలో ఉండే బ్రహ్మదేవుని ముఖాలు ముప్పై రెండు అయినందున, కర్తృరాగాలు ముప్పైరెండు అని తెలుస్తున్నది. (**సంగీతరత్నాకరే - తృతీయే - ప్రకీర్ణాధ్యాయే - గాయన ప్రకరణే - హృద్యశబ్దః సుశారీరో గ్రహమోక్ష-విచక్షణః, రాగ రాగాంగ భాషాంగ క్రియాంగోపాంగ కోవిదః" ఇతి. అత్ర - రాగ రాగాంగ ఇతి శబ్దస్య ద్వాత్రింశత్ భేద విశిష్ట రాగాంగ ఇత్యర్థ స్ఫురణాత్ కర్తృరాగాణాం** ద్వాత్రింశదేవ భేద ఇతి ప్రతిభాతి) కర్తృరాగాలు ముప్పైరెండే అయినా, జన్యరాగాలు చాలా ఉన్నాయి.

**శ్లో॥ మాతృద్రోహాఘశాన్తిం స్వపితృనిధనకృత్ క్షేత్రశైలేన్ద్రపక్ష-**
**ద్వంద్వం చ్ఛేదాతితీక్ష్ణప్రబలపరశుమప్యాప్తుకామో మునీన్ద్రః ।**
**నృత్తం యస్యేదమాత్మన్యనుగతమసకృద్భావయన్ జామదగ్న్యో**
**రామో లేభే చిరాయుః ప్రముఖవరవరాన్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥131**

తల్లి ద్రోహంచేత కల్గిన పాపాన్ని పోగొట్టుకొనదలచి, తన తండ్రిని చంపి రాజైన పర్వతశ్రేష్ఠుని రెండు రెక్కలను ఖండించడంకోసం మిక్కిలి పదునైన, బలమైన గొడ్డలి అనే ఆయుధాన్ని పొందగోరి మునిశ్రేష్ఠుడు, జమదగ్ని కుమారుడైన పరశురాముడు పరమేశ్వరుని నటనను మాటిమాటికి ధ్యానించి, చిరకాలం జీవించిఉండడం - మొదలైన వరాలను పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 131

**శ్లో॥ యత్పూజాలబ్ధభూతిప్రభవితయువతీ భావవృద్ధస్వజాయో**
**యత్ క్షేత్రానేకసేవాశమితమునివరధ్వంసనాగో వికారః ।**
**తాలాఙ్కో రౌహిణేయః ప్రబలహలవరాకృష్టదుష్టప్రలమ్బో**
**జాతో యస్య ప్రసాదాదమృతకరధరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥132**

బలరాముడు, పరమేశ్వరుని పూజలోని విభూతి ప్రభావంచేత జరను (ముసలి తనాన్ని) పోగొట్టుకొని యౌవనాన్ని పొందిన పత్నిని కలవాడు, అనేక క్షేత్రాలలో సేవచేత సూతమునియొక్క హత్యాదోషాన్ని పోగొట్టినవాడు, తాళవృక్షాన్ని చిహ్నంగా కల ధ్వజం

కలవాడు, నాగలితో దుష్టుడైన ప్రలంబాసురుని సంహరించినవాడయ్యాడు. అటువంటి, చంద్రుని ధరించిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 132



**శ్లో॥ ఆరుహ్యాశ్వం ముకున్దః ప్రతికలివిగమం కల్కిరూపీ పృథివ్యాం**
**గచ్ఛన్ పాషణ్డవర్గం కుమతిమఘయుతం తత్రతత్రైవ సంస్థమ్ ।**
**అఙ్గుష్ఠాకారభాజం యదమలకరుణావాప్తఖడ్గేన నిఘ్నన్**
**సర్వాం భూమిం యథావత్కలయతి తమజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥133**

ఒక్కొక్క కలియుగం చివర కల్కి రూపాన్ని ధరించిన ముకుందుడు అశ్వాన్ని అధిరోహించి, భూమిలో సంచరించి, అక్కడక్కడ ఉన్నది, పాపంతో కూడినది, అంగుష్ఠాకారాన్ని పొందినది అయిన పాషండవర్గాన్ని పరమేశ్వరుని కరుణతో పొందిన ఖడ్గంతో సంహరించి, భూమిని అంతటిని పూర్వంవలె ఉండేటట్లు సంస్కరించాడు. అటువంటివాడు, ఉత్పత్తి వినాశాలు లేనివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 133



**శ్లో॥ మధ్యే మార్గం స్వభక్తిం ద్విజవరజనుషం గణ్డభేరుణ్డసింహ-**
**వ్యాఘ్రాశ్వేభర్క్షతార్క్ష్యప్లవగనరముఖే మాధవే భక్షయిత్వా ।**
**క్రోధాద్బ్రహ్మాణ్డవర్గం ముహురపి చ ముధా తర్జయత్యాశు తం యః**
**హత్వాఽరక్షత్స్వ భక్తం జగదపి సకలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥134**

బ్రాహ్మణుడైన తన భక్తుని శివక్షేత్రాలకు పోయినపుడు దారిలోచూచిన గండభేరుండ మనే రెండుతలల పక్షి, సింహం, పులి, గుఱ్ఱం, ఏనుగు, భల్లూకం, గరుడుడు, వానరం, మానవుడు – అనే వీని ముఖాలను కల ఒక రూపాన్ని ధరించిన విష్ణువు భక్షించి, దానివల్ల కల్గిన గర్వంతో ఈలోకానికి భయంకల్గించిన తరుణంలో, భక్తులకు దాసుడైన పరమేశ్వరుడు కరుణతో లోకాలను రక్షించదలచి, ఆ రూపాన్ని దాల్చిన మాధవుని, సంహరించి, తన భక్తుడైన ఆ బ్రాహ్మణుని రక్షించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 134

ఈ వృత్తాంతాన్ని తిరువైయాఱ్రు పురాణమనే ద్రావిడ గ్రంథంలో గమనించవచ్చు.



**శ్లో॥ యేనోక్తం రాజతాద్రౌ చరితమనితరజ్ఞాతపూర్వం మృడాన్యై**
**శ్రుత్వా తద్యోగలబ్ధభ్రమరవరతనుః పుష్పదన్తస్స్వసఖ్యా ।**
**ప్రకాశ్యం నీయమానః కుపితనగసుతాశాపతో మర్త్యయోనా-**
**వుత్పన్నస్సంస్తువన్ యం స్వపదమధిగతః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥135**

పరమేశ్వరుడు కైలాసపర్వతంలో పూర్వం ఒకానొక సమయంలో అంబికకోసం ఒకసారి అరుదైన ఒక చరిత్రను చెప్పాడు. పుష్పదంతుడనే గంధర్వుడు తన యోగబలంతో తుమ్మెద రూపాన్ని ధరించి ఆ పరమేశ్వరుని సమీపంలో ఉండి, ఆ చరిత్రను విని, దానిని తన భార్యకు తెలిపి, తద్వారా బయల్పఱచాడు. ఈ సంగతి తెలిసి లోపాన్ని పొందిన అంబిక యొక్కశాపంచేత మానవుడై జన్మించి, తరువాత ఆ పరమేశ్వరుని స్తుతించి తన పూర్వ పదవిని పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 135

---

**శ్లో॥ దైత్యానాం ధ్వంసనార్థం సకలమపి జగద్రక్షణార్థం మురారిః**
**లక్ష్మ్యా క్షీరామ్బురాశౌ కృతకఠినతపాస్సామ్బమూర్తిం ప్రభుం యమ్ ।**
**భక్త్యా సంపూజ్యచిత్తే మనువరమపి యన్నామసాహస్ర సంజ్ఞం**
**స్తోత్రం లబ్ధ్వా జపంస్త్రిభురభవదజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥136**

అసురులను సంహరించగోరి, సకలలోకాలను రక్షించగోరి మురారి లక్ష్మితో కలిసి పాలకడలిలో కఠినంగా తపస్సును చేసేవాడై, అంబికతో కూడిన (సోమాస్కందమూర్తిని) పరమేశ్వరుని తన హృదయంలో భక్తితో పూజించి, దానివల్ల ప్రసన్నుడైన పరమేశ్వరునిచేత ఉపదేశింపబడిన మంత్రశ్రేష్ఠమైన ఒక నటరాజమూర్తి సహస్రనామస్తుతిని జపించి, దాని ప్రభావంతో జగత్పతి అయ్యాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 136

(దీనిని మాణిక్కవాచకర్‌స్వామికూడా-
**ఒరునామ మోరురువమ్ ఒన్ఱుమిల్లాత్కాయిరమ్**
**తిరునామమ్ పాడినాన్ తెళ్ళేణజ్కొట్టామో! అని,**

ఆ తిరునామం ఏదంటే-
**ఏరార్ ఇళమ్ కిళియే ఎజ్గళ్ పెరుమ్‌తుఱైక్కోన్**
**శీరార్ తిరునామత్తేర్‌న్ఱురైయాయ్ - ఆరూరన్**

**శెమ్బెరుమాన్ వెణ్మురాన్ పారక్కడలాన్**
**శెప్పువపోల్ ఎమ్బెరుమాన్దేవర్ పిరానెన్డు**

ఇందులో సోమస్కంధమూర్తిచేతి (సాంబమూర్తిచేత స్తుతి ఉపదేశింపబడడం, పాఱ్కడలాన్ (విష్ణుమూర్తి)చేత అది జపింపబడడం, "**శీరార్ తిరునామత్తేర్న్ఱురైయాయ్**" అని శ్రీనటరాజస్వామి నామ సహస్రాన్ని చెప్పమని అడిగిన అర్థాన్ని పలికారు. "**బ్రహ్మాదయోఽపి యన్నామ పాఠస్యైవ ప్రసాదతః, సృష్టిస్థిత్యంతకర్తారో జగతాం చిరజీవినః**" (బ్రహ్మ మొదలైన దేవతలు నటరాజ సహస్రనామజపాన్ని చేసి, దాని ప్రభావం వల్ల సృష్టించడం, రక్షించడం, లయంచేయడం – అనే వ్యాపారాలకు కర్తలయ్యారు) అనే ఉత్తర పీఠిక పల్కుతున్నందున, విష్ణువునకు ఉపదేశించే తరుణం ఆ విష్ణువుయొక్క నాభీకమలంలో ఉండే బ్రహ్మకూడా ఆ నామసహస్రాన్ని తెలిసికొన్నాడనే దానిని గూర్చి, "శెమ్బెరుమాన్, వెణ్మలరాన్" అని విశేషించి తెలిపారు (మాణిక్కవాచకర్)

ఆ నామసహస్రస్తుతి పూర్వపీఠికలో పరమేశ్వరుడు సాంబమూర్తి రూపంలో ఉండి, విష్ణువునకు ఉపదేశించాడని కూడా తెలుపబడుతున్నది. విష్ణువు ఆ మూర్తిని చిరకాలం పూజించి, వాల్కలి అనే రక్కసుని సంహరించగోరిన శ్రీచిదంబరక్షేత్రంలో ఆ మూర్తిని దేవేంద్రునకు ఇచ్చాడని, ఆ దేవేంద్రుడు స్వర్గంలో చిరకాలం ఆరాధించి, తరువాత ఒకానొక సమయంలో దానిని ముచుకుందచక్రవర్తికి ఇచ్చాడని, తర్వాత ఆ చక్రవర్తి, తిరువారూర్‌లో ఆ మూర్తిని వేంచేపు చేశాడని కమలాలయమాహాత్మ్యం తెల్పుతున్నది.)

---

**శ్లో॥ ఆజ్ఞా యస్యాఖిలానాం న భవతి హి సదా లఙ్ఘనీయా యదీయం**
**తత్త్వాతీతస్వరూపం విధిముఖవిబుధా వర్ణితుం నైవ శక్తాః ।**
**యం ద్రష్టుం వేదవాచోఽప్యగణితవిభవం నూనమద్యాపి యత్నం**
**కుర్వన్త్యమ్బాసహాయం సనకముఖగురుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥137**

పరమేశ్వరుని ఆజ్ఞ అనేది ఎల్లప్పుడు ఎవరివల్ల దాటడానికి సాధ్యం కానిది. ఆ పరమేశ్వరుని తత్త్వాతీతమైన స్వరూపాన్ని బ్రహ్మాది దేవతలు వర్ణించడానికి తగిని శక్తిని కలవారుకారు. లెక్కించడానికి సాధ్యం కాని వైభవాన్ని కల పరమేశ్వరుని దర్శించడానికి వేదాలు ఇప్పటికీ నిశ్చయంగా యత్నిస్తున్నవి. అటువంటివాడు, అంబికకు సహాయంగా ఉండేవాడు. సనకాది మునులకు గురువు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 137

---

శ్లో॥ యుద్ధే సంజాతకమ్పః పితృపతితనయో భీష్మముఖ్యప్రవీరాన్
చక్రబ్జాకారసేనాగతరథగజరాడశ్వపాదాతివర్గాన్ ।
జేతుం కష్టోపదిష్టో మధుమయనుతిభిస్తోషయన్ యస్య శక్తిం
దుర్గాం తస్యాః ప్రసాదాదజయదరిబలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥138

పాండుపుత్రులైన ధర్మరాజాదులు భారతయుద్ధంలో భీతిని పొందినవారై, చక్రవ్యూహం, పద్మవ్యూహాలతో కూడిన సేనామధ్యభాగంలో ఉండే రథగజతురగపదాతి వర్గాలతో కూడిన భీష్మాది వీరశ్రేష్ఠులను జయించడానికి శ్రీకృష్ణునిచే ఉపదేశింపబడినవారై, మధుమయాలైన స్తుతులతో పరమేశ్వరుని శక్తి అయిన దుర్గను సంతోషించేటట్లు చేసి, ఆ అంబికయొక్క అనుగ్రహంతో ఆ శత్రువుల బలాన్ని జయించారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 138

---

శ్లో॥ యస్యాఘోరాస్త్రరూపం వసుకరవిధృతోద్దణ్డభేతాలఘంటా-
ఢక్కాఖేటాసిపాత్రత్రిశిఖశిఖి శిఖం భీమదంష్ట్రాధరోగ్రమ్ ।
సౌవర్ణశ్మశ్రువక్త్రం రథముఖనిహితస్వాఙ్ఘ్రిమారక్తవస్త్రం
ధ్యాయేచ్చేత్కాలమృత్యుం తరతి విధుజటం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥139

ఎనిమిది చేతులలో ధరించిన, భయంకరమైన భేతాళ, గంట, డమరుక, ఖేటం, ఖడ్గం, పాత్రం, త్రిశూలం, అగ్ని – అనే వీనిని భయంకరమైన కోరపళ్ళతో కూడిన దవుడలతో ఉగ్రంగాను, (స్వర్ణ)ఎఱ్ఱగన్నేరు వర్ణంలోని మీసాలతో కూడిన ముఖంతో కూడినది, రథం ముందు భాగంలో పెట్టిన కాలును కల్గినది, ఎఱ్ఱని వస్త్రాన్ని ధరించినది అయిన పరమేశ్వరుని అఘోరాస్త్రరూపాన్ని ఎవడు ధ్యానిస్తాడో, అతడు కాలమృత్యువును దాటగలడు. అటువంటివాడు, చంద్రుని ధరించినవాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 139

---

శ్లో॥ ఆరోగ్యం లబ్ధుకామో దివసకరమహామణ్డలాన్తర్యమమ్బా
యుక్తం రుక్మాభమాద్యం కలయతి నితరాం యో జపన్ రౌద్రమంత్రాన్ ।
తస్య త్వఙ్గాం సరక్తావయవగతమహారోగవర్గాః ప్రాణాశం
యాన్తి శ్రీసున్దరాజ్ఞస్య చ భవతి శివం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥140

వ్యాధిలేకుండా ఉండే స్థితిని పొందగోరినవాడు సూర్యమండలం మధ్యలో అంబికతో

కూడినవాడు, స్వర్ణమయమైన మేనిని కలవాడైన పరమేశ్వరుని శతరుద్రీయ మంత్రజపంచేసి ధ్యానించినట్లయితే అతని తోలు, మాంసం, రక్తం – అనే వీటితో కూడిన అంగాలను చేరిన మహారోగవర్గాలు మిక్కిలి నాశాన్ని పొందుతాయి. అతడు అందం కల్గిన అంగాలను కలవాడవుతాడు. అటువంటివాడు, మంగళస్వరూపుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 140

**శ్లో॥ పుత్రార్తాకాఙ్క్షీ పుమాన్ యః పరశుమృగవరాభీతిహస్తం త్రిణేత్రం**
**గౌర్యా స్కందేన సాకం వృషభ మధిజుషం సానుకమ్పం స్మితాస్యమ్ ।**
**సర్వాలఙ్కారభాజం సకలనిగమవిత్ స్తూయమానాపదానం**
**ధ్యాయత్యాప్నోతి పుత్రం గుహమివ స చ తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥141**

పుత్రుని పొందగోరే పురుషుడు పరశువు, లేడి, వరద, అభయముద్రలనే వీనిని కల చేతులను కలవాడు, మూడు నేత్రాలను కలవాడు, గౌరి, సుబ్రహ్మణ్యుడనే వీరితో పాటు వృషభంపై ప్రకాశించేవాడు, దయను కలవాడు, చిఱునవ్వును కలముఖం, అన్ని ఆభరణాలతో అలంకరింపబడిన మేనిని, సకల వేదవిత్తులచే స్తుతింపబడిన పూర్వ చరిత్రలను కలవాడైన పరమేశ్వరుని ధ్యానించేవాడు శీఘ్రంగా సుబ్రహ్మణ్యునివంటి కుమారుని పొందు తాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 141

**శ్లో॥ యో విద్యార్థీ వటద్రోర్నికటతటగతం పుస్తకజ్ఞానముద్రా**
**వీణారుద్రాక్షమాలా కృతకరకమలం యోగపట్టాభిరామమ్ ।**
**తత్వార్థం బోధయన్తం సకలమునితతేశ్చన్ద్రగఙ్గాహిభూషం**
**యం ధ్యాయత్యాశు వాగ్మీ స చ భవతి గురుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥142**

విద్యను కోరేవాడు వటవృక్షం క్రింద ఉండేవాడు, పుస్తకం, జ్ఞానముద్ర, వీణ, రుద్రాక్షమాల – అనే వీనిని ధరించిన చేతులను కలవాడు, సకలమునిసమూహాలకు ఆత్మతత్వార్థాన్ని ఉపదేశించేవాడు, చంద్రుడు, గంగ, సర్పం – అనే వీనిని అలంకరించు కొన్నవాడైన పరమేశ్వరుని ధ్యానించేవాడు శీఘ్రంగా వాగ్విలాసం కలవాడవుతాడు. అటువంటి గురువు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 142

**శ్లో॥ భిక్షాం దేహీతి చక్షన్మునిసుతసహితః క్రోధభట్టారకాఖ్యః**
**దూర్వాసా యన్నగర్యామనధిగతచరుః క్షున్నివృత్త్యై నిశీథే ।**
**శక్తిం యస్యాన్నపూర్ణాం హృది పరికలయన్ సత్వరం యత్ప్రసాదా-**
**వాప్తక్షీరాన్నభుక్త్యా సుఖమభజదజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥143**

క్రోధభట్టారకుడనే దుర్వాసుడు తన శిష్యులతో కలిసి ఒకరాత్రివేళ పరమేశ్వరుని నగరమైన చిదంబరంలో తన ఆకలిని తీర్చుకొనగోరి భిక్షను పెట్టమని గట్టిగా అరుస్తూ, భిక్షదొరకనందున, పరమేశ్వరుని శక్తి అయిన అన్నపూర్ణను హృదయంలో ధ్యానించి, ఆదేవి ప్రసాదంవల్ల శీఘ్రంగా లభించిన క్షీరాన్న బోజనంతో సుఖాన్ని పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 143

**శ్లో॥ కశ్చిల్లుబ్ధో గిరీన్ద్రే మృగనిబిడవనే లిఙ్గమైశం యదీయం**
**దృష్ట్వా గణ్డూషతోయైః స్వకచధృతసుమైర్భుక్తశేషైశ్చ మాంసైః ।**
**పూజాం కుర్వన్ కదాచిన్నిజనయనవరం చార్పయిత్వాఽతిభక్త్యా**
**నేత్రే యస్యానురూపం పదవరమభజత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥144**

మృగాలతో నిండిన కొండపై (కాళహస్తి క్షేత్రంలో) ఒక వేటగాడు (కన్నప్ప) పరమేశ్వరుని లింగాన్ని (కాళహస్తీశ్వరుని) తాను వేటాడి సంచరించే సమయంలో చూచి, మిక్కిలి భక్తితో పుక్కిలించిన నీళ్ళతో, తన తలలో ధరించిన పూలతోను, తాను భుజించగా మిగిలిన మాంసంతోను పూజిస్తూ, ఒకానొక సమయంలో తన కంటిని ఆ లింగంయొక్క నేత్రంలో చాలా భక్తితో అర్పించి, ఆ పరమేశ్వరుని సారూప్యపదవిని పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 144

**శ్లో॥ బాలో విప్రస్య గోష్ఠస్థితపశునికరం దోహయిత్వా పయోభిః**
**నద్యాస్తీరే యదీయం జనిమసుఖకరం పార్థివఞ్చాభిషిఞ్చన్ ।**
**ధ్యాయన్ క్రోధాత్స్వపూజావికృతికరపితుశ్ఛేదయిత్వా పదం యం**
**స్తుత్వా యత్పార్షదానామధిపతిరభవత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥145**

ఒక బ్రాహ్మణ కుమారుడు గోశాలలో ఉండే పశుబృందాన్ని నదీతీరానికి తీసికొని పోయి, వాటి క్షీరంతో పరమేశ్వరుని పార్థివలింగాన్ని అభిషేకించి, పరమశివుని ధ్యానించే సమయంలో తన పూజకు విఘ్నాన్ని కల్గించిన తన తండ్రి పాదాన్ని కోపంతో నటికి, ఆ

పరమేశ్వరుని స్తుతించి, (శివానుగ్రహంతో) ఆ పరమేశ్వరుని కన్నులకు అధిపతి అయ్యాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 145

**ఇది చండేశ్వర నాయనార్ గాథ.**

---

**శ్లో॥ యేషాం వేదోక్తకర్మ స్వనిధికృతిరభూదద్రిజాతా పృథివ్యాం**
**తేషాం ధర్మాదిమాప్త్యై పరశివరచితం కామికాదిప్రభేదమ్ ।**
**సాఙ్గం సిద్ధాన్తతన్త్రం ప్రకరమపి చతుష్షష్టిసంఖ్యాః కలాశ్చ**
**యస్యాదేశాత్ప్రకాశం త్వనయదగనుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥146**

భూమిలోని ఏ ప్రాణులకు వేదంలో చెప్పబడిన కర్మలను అనుష్ఠించే విషయంలో అధికారంలేదో, అటువంటి ప్రాణులకు ధర్మాది పురుషార్థాలను పొందించ గోరి, అంబిక పరమేశ్వరుని చేయబడిన కామికాది భేదాలతో కూడినది, అంగాలతో కూడినది అయిన సిద్ధాంత తంత్ర ప్రకారాన్ని 64 కళలను, పరమేశ్వరుని ఆజ్ఞతో ప్రకాశాన్ని పొందేటట్లు చేసింది. అటువంటి, హిమవంతునిచే స్తుతింపబడిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 146

---

**శ్లో॥ కుర్వన్తః క్షేత్రవాసం హృదయసరసిజే చిన్తయన్తో జపన్తో**
**విద్యాం సౌవర్ణరఙ్గే యమజహరినుతం స్వేచ్ఛయాఽవాప్తనృత్తమ్ ।**
**పశ్యన్తస్సార్వకాలం విబుధపరిబృఢా లబ్ధకామాస్సుఖిత్వా**
**బ్రహ్మే సౌధే రమన్తే చరమవయసి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥147**

జ్ఞానం కలవారు, చిదంబరక్షేత్రంలో వసించేవాడు, తనకు హృదయంలో ధ్యానం చేసేవాడు, శ్రీ పంచాక్షరిని జపించేవాడు, చిత్సభలో బ్రహ్మ విష్ణువులచే స్తుతింప బడేవాడు, తన ఇచ్ఛతో పొందబడిన నాట్యవిలాసాన్ని కలవాడైన పరమేశ్వరుని ఎల్లప్పుడు దర్శనం చేస్తూ, ఇహలోకంలో సకల మనోరథాలను పొంది, చివరలో బ్రహ్మసంబంధి అయిన సౌధంలో సుఖిస్తారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 147

---

**శ్లో॥ సర్వస్వారాభిధానే దివిషదభిమతే సప్తతన్తౌ ద్విజేన్ద్రః**
**కశ్చిద్యజ్వా హుతాశే నిజమపి వపుస్త్యక్తుమత్యన్తభీరుః ।**

**యం ధ్యాత్వా యత్ప్రసాదాదగమదనితరప్రాప్యమౌపాధిహీనం**
**ధామస్వర్గం సదేహస్తమతులవిభవం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥148**

ఒక బ్రాహ్మణుడు సర్వస్వారమనే పేరును కల, దేవతలకు ప్రియమైన యాగంలో ఉండే అగ్నిలో తన శరీరాన్ని త్యాగం చేయడానికి చాలా భయపడినవాడై, పరమేశ్వరుని ధ్యానించి, ఆ పరమేశ్వరుని అనుగ్రహంతో ఇతరులకు పొందడానికి సాధ్యం కానిది, ఉపాధిలేనిది అయిన స్వర్గలోకాన్ని ఈ కర్మదేహంతోనే పొందాడు. ఇటువంటి, సాటి లేని వైభవాన్ని కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 148

(సర్వస్వారమనే పేరునుకల యాగాన్ని అనుష్ఠిస్తే ఈ కర్మశరీరంతోనే స్వర్గాన్ని చేరవచ్చునని వేదాలలో చెప్పబడింది. దీని ప్రయోగంలో మాధ్యందిన సవనంలో ఉద్గాత చేత వనమానమనే స్తోత్రాన్ని గానంచేసే టపుడు యజమాని ఇకపై గల యజ్ఞభాగాలను మీరే పూర్తిచేయండి – అని ఋత్విక్కులకు అనుమతిని ఇచ్చి, తరువాత తన శరీరాన్ని ఆహవనీయమనే అగ్నిలో త్యాగం చేయాలి. (అర్పించాలి) తరువాత గల యజ్ఞభాగాలను ఋత్విక్కులు పూర్తిచేయాలి – అని చెప్పబడింది. ఇంతేకాక, ఇందులో గల ఇంకా విశేషధర్మాలు మీమాంసాశాస్త్రంలో వివరింపబడ్డాయి. ఈ విధమైన యాగాన్ని చేసినా శరీరత్యాగంలో భయపడిన తన భక్తునకు పరమేశ్వరుడు వేదంలో చెప్పబడిన రీతిలో సశరీరస్వర్గప్రాప్తిరూప ఫలాన్ని ఇచ్చాడని భావం.)

---

**శ్లో॥ క్రీడాసంసక్తగౌరీ కనకఘటనిభోత్తుఙ్గవక్షోజశైల–**
**ప్రోద్యత్శృఙ్గారమాధ్వీమధురరసధునీ లోలభృఙ్గాయతాక్షమ్ ।**
**భూషానాగోక్తసౌఖ్యప్రవచనఘటజస్తబ్ధగర్వాబ్ధితార్ క్ష్య–**
**వ్రీడాకృత్శ్వాసవక్త్రప్రమథపతినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥149**

లీలలో అభిలాషను కల గౌరియొక్క, కనకకలశంవంటి ఉత్తమాంగమైన వక్షోజమనే పర్వతంనుండి పెల్లుబికే శృంగారమధురసప్రవాహంలో చలించే తుమ్మెదవంటి నేత్రాలను కలవాడు, ఆభరణాలైన సర్పాలచేత అడుగబడిన కుశల ప్రశ్న అనే అగస్త్యునిచేత అణచబడిన గర్వం అనే సముద్రాన్ని కల గరుడునకు (గరుడుని గర్వం సముద్రంవంటిది. ఆ గర్వాన్ని సర్పాలు అడిగిన కుశల ప్రశ్న అనే అగస్త్యుడు లేకుండా చేశాడని భావం) లజ్జను కల్గించే ఉచ్ఛ్వాస వాయువును కల (బుసనుకల) ముఖాన్ని కల్గిన నందికేశ్వరునిచే స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 149

---

**శ్లో॥ నృత్తేశం బాణదైత్యప్రముఖగణవరోద్దణ్డదోర్భృన్దవర్య-**
**క్రూరోద్వేగాహతోద్యద్ఘటధిమిధిమితక్శబ్దభావానుకల్పమ్ ।**
**తానాతానాతనేతి క్వణితదశశతీ తన్త్రివీణానుగానో-**
**న్మోదోద్గ్రీవాహిభూషావలయమభయదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥150**

నృత్తాన్ని చేసేవాడు, బాణుడు మొదలైన గణశ్రేష్ఠుల దీర్ఘమైన చేతులతో వేగంగా వాయింపబడ్డ ఘటవాద్యాల నుండి పుట్టిన "**ధిమి ధిమి**" అనే శబ్దాల భావాలను అనుసరించేవాడు, "**తానా తాన తన**" అని శబ్దంచే వేయి తంత్రులను కల వీణల అనుగానాన్ని వినగోరి ఆశతో విస్తరించిన ముఖాలను కల సర్పాలను కంకణాలుగా కలవాడు, అభయాన్ని ఇచ్చేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 150

**శ్లో॥ సాహస్రక్రూరవక్త్రప్రభవగురుమరుత్పూరహుంహుంభభంభం-**
**ఝుంఝీకృచ్ఛంఖశృఙ్గప్రముఖవరమహావాద్యభృద్భానుకోపమ్ ।**
**దృష్ట్వా హాహాహహేతి భ్రమితసురగణాఽభీతిసందాయిపార్ష-**
**హవ్యాప్తేరఙ్గేయ ఈశో నటతి తమనఘం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥151**

వేయి క్రూరమైన ముఖాలనుండి వెలువడిన గొప్ప వాయువుయొక్క పూరణలతో "**హుమ్ హుమ్ భం భం ఝుం ఝీ**" అను శబ్దం చేసే శంఖం, కొమ్ము మొదలైన గొప్ప వాద్యాలను ధరించే భానుకోపుడనే వానిని చూచి "**హా హా హ హ**" అని భ్రమించే దేవగణానికి అభయప్రదానాన్ని చేసేవాడు, ప్రమథగణాలచే పరివేష్ఠింపబడిన సభలో ఏ పరమేశ్వరుడు నర్తనం చేస్తున్నాడో, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 151

**శ్లో॥ కైలాసాద్రిం కదాచిత్ప్రబలభుజబలాద్రావణశ్చాలయిత్వా**
**దాక్షాయణ్యాఽతిభీత్యా కిమిదమపి సమాలిఙ్గితస్యాశు యస్య ।**
**పాదాఙ్గుష్ఠాగ్రనీతద్విరసనభువనక్ష్మాధరోచ్ఛిన్నబాహుః**
**సామ్నా స్తుత్వా యమిష్టం వరమలభత తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥152**

ఒకానొక సమయంలో రావణుడు తన భుజబలంతో కైలాసపర్వతాన్ని చలించేటట్లు చేసి, అపుడు అంబికచే మిక్కిలి భయంతో "ఇదేమి అతిశయం!" అని వేగంగా ఆలింగనం చేసికొనబడిన పరమేశ్వరుని పాదంలోని అంగుష్ఠం యొక్క అగ్రం చేత పైకి తీసికొనిరాబడిన సర్పాల లోకమైన పాతాళాన్ని కల, కైలాస పర్వతంచేత ఖండింపబడ్డ బాహువులను కలవాడై,

(రావణుడు), సామవేదగానంతో ఆ పరమేశ్వరుని స్తుతించి తనకు అభీష్టాలైన వరాలను పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 152

---

**శ్లో॥ శ్రీరుద్రం కోటిసంఖ్యా త్రిగుణితమనిశం యత్పురస్తాజ్జపిత్వా**
**శైలాదిర్యస్య శమ్భోరనవధికకృపాపాఙ్గపూరాభిషిక్తః ।**
**మత్తుల్యోఽసి ప్రియోఽసి త్వమపి చ సకలం జ్ఞాతవాంశ్చాసి తాతే-**
**త్యుక్తో యేనాథ యస్య ప్రమథపతిరభూత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥153**

పరమేశ్వరుని సన్నిధానంలో శిలాదుడనే మునియొక్క కుమారుడైన నందికేశుడు మూడుకోట్ల పర్యాయాలు శ్రీ రుద్రాన్ని పారాయణ చేసి, పరమేశ్వరుని అంతులేని కృపతో కూడిన కృపాకటాక్షాలతో చూడబడినవాడు, "నీవు నాకు సమానమైన వాడవు, నాకు ప్రియమైన వాడవు, నీకు అన్నిటిని తెలిసినవాడవుగా కాగలవు." అని ఆ పరమేశ్వరునిచే చెప్పబడినవాడయ్యాడు. ఆ పరమేశ్వరుని ప్రమథగణాలకు అంతటికి పతి అయ్యాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 153

ఈ చరిత్ర శివపురాణంలో తెలుపబడింది.

---

**శ్లో॥ శ్రీమాన్ భృఙ్గీ మునీన్ద్రో మృగపరశుకరం దేవమేవైకమీశం**
**నత్వా తత్పార్శ్వగాయా నిజవిముఖరుషశ్చణ్డికాయాశ్చ వాక్యాత్ ।**
**శాక్తం మాంసాదివర్గం స్వతనువరగతం ప్రోత్సృజన్యత్ప్రసాదాత్**
**లేభే దణ్డ త్రిపాదం స్వధురిచి వసతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥154**

శ్రీమంతుడైన భృంగి అనే మునివరుడు లేడిని, పరశువును, ధరించిన దేవుడైన ఈశ్వరుని ఒక్కనిమాత్రమే నమస్కరించి, ఆ ఈశ్వరుని ఎడమభాగంలో ఉన్నది, తనకు నమస్కరించనందున కోపించినది అయిన అంబిక యొక్క వాక్కుచే శక్తి సంబంధమైన తన శరీరంలో ఉండే మాంసం మొదలైనవానిని వెదజల్లినవాడై, పరమేశ్వరుని అనుగ్రహంచేత దండాన్ని, మూడు పాదాలను, ఈశ్వరుని ముందుగా భాగంలో ఉండే స్థితిని పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 154

---

**శ్లో॥ కశ్చిద్విప్రోరిటాఖ్యస్స్వపతినియమవిధ్వంసకమ్వాతరజ్ఞాం**
**నారీం దగ్ధ్వా సతీం తచ్చితిగతభసితైర్లేపయన్ సామ్బమూర్తిమ్ ।**

**నైవేద్యం కర్తుమిచ్ఛన్నిహ నయచరుమిత్యాహ్వయన్ యత్ప్రసాదాత్**
**కాన్తాం భేజే నిజాన్తే శివపదమపి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥155**

రిటుడనే పేరును గల ఒక బ్రాహ్మణుడు తన నియమం పాడయిపోయే విషయంలో భయపడినది, పతివ్రత అయిన తన పత్నిని దహించి, ఆ చితిలోని భస్మంతో పరమేశ్వరుని అభిషేకంచేసి, నైవేద్యాన్ని చేయగోరి, “ఓ ప్రియా! భగవానునకు నివేదనాన్ని తీసికొని రా! ” అని ఆహ్వానించినవాడై పరమేశ్వరుని అనుగ్రహంతో చనిపోయిన ఆ పత్నిని, చివరలో శివపదాన్ని పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 155

---

**శ్లో॥ గౌర్యాం శృఙ్గారవాప్యాం స్వసఖివరగణైః క్రీడయన్త్యాం కపర్దీ**
**గత్వా తద్ధస్తపంకాత్ జనితమపి నరం ద్వార్స్థముద్దణ్డచణ్డమ్ ।**
**హత్వాన్తస్సంప్రవిష్టః కుపితసఖిముదే తం పునర్జీవయిత్వా**
**తస్మై విఘ్నేశ్వరత్వప్రముఖవరమదాత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥156**

గౌరి నందనవనంలోని సరస్సులో తన చెలికత్తెలతో పాటు క్రీడించే సమయంలో కపర్ది అయిన పరమేశ్వరుడు ఆ నందన వనాన్ని చేరి, ఆనందన వనాన్ని కాపలాకాసేవాడు, చాలా క్రూరమైన నడతను కలవాడు, అంబిక యొక్క చేతిలో ఉండే బురదనుండి పుట్టినవాడైన ఒక నరుని సంహరించి, లోపలకుపోయి, ఆ ద్వారపాలకుడైన నరుని సంహరించినందున కోపించిన అంబికయొక్క సంతోషం కోసం ఆ నరుని మళ్ళీ (గజముఖాన్ని చేర్చి) బతికించి, అతనికి విఘ్నాలకు ఈశ్వరుడై ఉండే స్థితి మొదలైన వరాలను ఇచ్చాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 156

---

**శ్లో॥ ఏకాన్తే జాతు యస్య ప్రముదితమనసా ప్రోక్తవేదాన్తతత్త్వే**
**ప్రేక్షారుష్టస్య వాక్యాద్ధిమగిరితనయా ధీవరాధీశవంశే ।**
**ఆవిర్భూయామ్బుధిస్థప్రబలశఫరసంగ్రాహిణం యం వరేణ్యం**
**వృత్వా తద్ధామభాగే వసతిమపి గతా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥157**

ఒకానొక సమయంలో ఏకాంతంలో సంతోషించిన మనస్సుతో చెప్పబడిన వేదాంతశాస్త్రతత్త్వాలను ఆలకించేటపుడు అశ్రద్ధతో ఉన్నందున కోపించిన పరమేశ్వరుని వాక్యంచేత హిమవంతుని కుమార్తె అయిన పార్వతి బెస్తకులంలో జనించి, (పర్వసమయంలో)

సముద్రం నుండి పుట్టిన, గొప్ప బలాన్ని కల మకరమత్స్యాన్ని పట్టినవాడు, గొప్పవాడైన పరమేశ్వరుని వివాహమాడి, అతని వామభాగంలో వసించే స్థితిని పొందింది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 157

ఈ వృత్తాంతం తిరువిళైయాడల్ అనే ద్రావిడ గ్రంథం లోని "**వలై వీశియ పటలమ్**" అనే గ్రంథంలో ఉన్నది.

---

**శ్లో॥ కేకీభూత్వా మృడానీ స్వపితృకృతశివద్వేషసంవృద్ధపాపం**
**భస్మీకర్తుం పురాణం శతధృతిరచితే కాననే యం త్రిణేత్రమ్ ।**
**సంపూజ్యానన్యదృష్టం నటనమతిముదా వీక్షమాణా కృపార్ద్రైః**
**యస్యాలోకైః పునీతా సమజని నితరాం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥158**

మృడాని అనే పార్వతి తన తండ్రి అయిన దక్షునకు కల శివద్వేషం వల్ల కల్గిన పాపాన్ని భస్మం చేయడంకోసం నెమలిరూపాన్ని దాల్చి, బ్రహ్మచే సృష్టింపబడిన వనంలో (మయూర క్షేత్రంలో) త్రినేత్రుడైన పరమేశ్వరుని పూజించి, ఇతరులచే చూడబడని పరమేశ్వరుని తాండవాన్ని దర్శిస్తున్నదై, కృపతో కూడిన పరమేశ్వరుని కటాక్షాలతో పునీతమైనది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 158

ఈ కథ మయూర మాహాత్మ్యంలో ఉన్నది.

---

**శ్లో॥ యస్య క్షేత్రే మృతానాం సకలజనిభృతాం సఞ్చితాదీని పాపా-**
**న్యబ్దానేకప్రభోజ్యాన్యపి చ నిమిషతో భైరవరశ్శూలఘాతాత్ ।**
**భస్మీకృత్యాశు భూయో జననమృతిహరం తారకం యన్నిదేశాత్**
**తత్త్వం సమ్బోధయన్ యత్సదసి వసతి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥159**

పరమేశ్వరుని క్షేత్రమైన చిదంబరంలో మరణాన్ని పొందిన సకల ప్రాణులకు అనేక వర్షాల కాలం అనుభవించదగిన సంచితం మొదలైన పాపాలను ఒక నిముషంలో పరమేశ్వరుని ఆజ్ఞచే భైరవుడు తన శూలంతో కొట్టి, వేగంగా భస్మం చేసి, తిరిగి జనన మరణాలను పోగొట్టే తారక మంత్రాన్ని, బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశిస్తూ, ఆ పరమేశ్వరుని చిత్సభలో నివసిస్తాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 159

(ఇది పుండరీకపురమాహాత్మ్యంలోని నాల్గవ అధ్యాయంలో ఉన్నది. "**దర్శనా-**

**ద్దేవదేవస్య విముక్తా మనుజాదయః, క్షేత్రాంతరేషు యత్పుణ్యం పాపం, వా క్రియతే నరైః, తదేవాత్ర కృతం సర్వమేకం కోటిగుణం భవేత్, క్షేత్రపాలస్తు తేషాం వై పాపినాం పాపశాన్తయే। శాసితానయమోనాన్యోహ్య సమర్థాస్తు తే యతః, శూలాగ్రేణతు దణ్ణ్యన్తే తేన పాపరతా నరాః, అష్టావింశతిభిః పాపైః కోటిభి ర్నరకైః మునే!, అతిఘోరైస్తు పీడ్యంతే యమేనాఽఽ భూత సంప్లవమ్, తావత్కాలేన తేషాం వై యద్దుఃఖం జాయతే మహత్, తద్దుఃఖం కోటిగుణితం లభంతే ప్రాణిన స్త్విహ, క్షేత్రపాలేన శూలాగ్రే దండ్యమానా క్షణేవత"** అనే శ్లోకాలు స్మరణీయాలు. చిదంబర పురాణమనే ద్రావిడ గ్రంథంలోని "**నియమచ్చురుక్కమ్**" లోగల 37,38,39వ పాశురాలలోకూడా గమనించవచ్చు. పాద్మంలోని శివగీతలో 16వ అధ్యాయం – 9వ శ్లోకంలో, **అవిముక్తే ద్వారకాయాం శ్రీశైలే పుండరీకకే, దేహాంతే తారకం బ్రహ్మ లభతే మదనుగ్రహాత్**" ఇత్యాది ప్రమాణాలలో చక్కగా ఇది తెలుపబడింది.)



**శ్లో॥ విష్ణోరన్యః పరో నేత్యసకృదపి ముధా జల్పమానం మునీన్ద్రం**
**నందీకోపప్రభూతస్తనితనిభరవస్తమ్భితప్రోచ్చబాహుమ్ ।**
**వ్యాసం దృష్ట్వా ముకున్దః స్వపతిరితి శివం బోధయన్ యత్ కృపాయా**
**నిన్యే పాత్రత్వమీశం తమఖిలవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 160**

విష్ణువుకంటే గొప్పదైవం ఇంకొకటి లేదని మాటిమాటికి అజ్ఞానంతో (కాశీక్షేత్రంలో విశ్వనాథుని సన్నిధిలో) పలికేవాడు, మునిశ్రేష్ఠుడు, నందికేశ్వరుని కోపం వల్ల కల్గిన, పిడుగుతో సమానమైన శబ్దంతో స్తంభించేటట్లు చేయబడిన పైకి ఎత్తిన చేతులను కలవాడైన వ్యాసుని చూచి, మహా విష్ణువు సర్వమంగళకరుడైన పరమేశ్వరుడు తనకు పతి అని బోధించి, ఆ పరమేశ్వరుని కృపకు పాత్రమై ఉండే స్థితిని పొందించాడు. అటువంటి, ఈశ్వరుడు, అందఱిచే స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. ఈ కథ శంకరసంహితలో ఉన్నది. 160



**శ్లో॥ సర్వే దేవాశ్చ విష్ణోర్హృదయసరసిజోద్భాసిలిఙ్గం యజన్తః**
**కుద్ధోఽప్యన్యోన్యచర్చాపదఘనవిలసత్పఞ్చరుద్రాదిమంత్రైః ।**
**స్తుత్వా యత్రాపవిద్యాజపపరకవిరాడ్యోగసంతప్తలోకాన్**
**సౌఖ్యం నిన్యుః నితాన్తం యదమలదయయా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥161**

దేవతలందఱు మందరపర్వతంలోని విష్ణువు హృదయకమలంలో వెలిగే లింగ రూపుడైన పరమేశ్వరుని పూజించడంకోసం ఉండి, ఒకరితో ఒకరు చర్చలతో కూడిన పద, ఘన, క్రమాలలో వెలిగే (వేద మంత్రాలను ఉచ్చరించే ఒక క్రమం) పంచ రుద్రం మొదలైన మంత్రాలతో స్తుతించి, ఆ పరమేశ్వరునివద్దనుండి పొందబడిన మృతసంజీవనీ మంత్ర జపశీలుడైన శుక్రాచార్యుల యోగాగ్నిచే తపింపబడే లోకాలను మిక్కిలి సౌఖ్యాన్ని కల్గినవిగా చేశాయి. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 161

ఈ కథ కూర్మపురాణంలో ఉన్నది.

---

**శ్లో॥ యస్యోక్త్యా విఘ్నరాజస్సురగణవినుతో రక్షసాం సార్వభౌమాత్**
**మాయా సంమోహితాద్యజ్ఞనిమశుభకరం బాహునాऽऽదాయ భూమ్యామ్ ।**
**సంస్థాప్యాగ్రే యుయుత్సుం తమపి నిశిచరం స్వీయశుణ్డాగ్రరన్ధ్రా**
**కర్షాత్ సమ్భుగ్నదేహం దశభుజమకరోత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేऽహమ్ ॥162**

పరమేశ్వరుని మాటవల్ల దేవతలచే స్తుతింపబడిన వినాయకుడు (తన) మాయతో మోహించేటట్లు చేయబడిన రాక్షసశ్రేష్ఠుడైన రావణునివద్ద మంగళాన్ని కల్గించేదైన పరమేశ్వరుని లింగాన్ని (వినాయకుడు) చేతితో గ్రహించి, భూమిలో పెట్టి, తిరిగి ఆ లింగాన్ని పైకెత్తలేక పోయినందువల్ల కోపంతో తనముందుగా యుద్ధంచేయ గోరిన ఆ నిశాచరుని (రావణుని) తన తొండం చివర ఉండే రంధ్రంలోకి ఆకర్షించడం ద్వారా వంగిన శరీరాన్ని కలవానినిగా చేశాడు. అటువంటివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. (ఇది గోకర్ణమాహాత్మ్యంలో ఉన్నది.) 162

---

**శ్లో॥ ఆర్యావామాంసభూషా నవమణిగణభాసంగవైవర్ణ్యనీల-**
**గ్రీవాలేకాతిశఙ్కిప్రసృతవిషభయాక్రాన్తదిక్పాలవర్గమ్ ।**
**చూడాచన్ద్రాజిహీర్షాదరవివృతఫణాకుణ్డలీకర్ణలోలత్**
**గఙ్గాకూలాయమానస్వసటవరవనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేऽహమ్ ॥163**

అంబికయొక్క ఎడమభుజంపై ఉండే ఆభరణాలలోని నవరత్నాల కాంతియొక్క సంబంధంచేత రూపుమాటిన (శివుని) నీలకంఠాన్ని చూచి, అది చాలా కాలకూటవిష ప్రసారమేమోనని సందేహంతో భయపడి పరుగుదీసే దిక్పతుల సమూహాన్ని కలవారు, తన తలలో ఉండే చంద్రుని, భుజించాలనే కోరికతో కొంచెం విప్పిన పడగలను కల

సర్పాలచే అలంకరింపబడిన రెండు చెవులవరకు వేలాడేది, గంగకు తీరంవంటిది అయిన తన జటాజూటమనే శ్రేష్ఠమైన వనాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 163

**శ్లో॥ శిఞ్జన్ మఞ్జీరమఞ్జుద్యుతిశమితజగన్మోహమాయావిలాసం**
**ఫాలాక్షిస్ఫారకుణ్డప్రభవహుతవహధ్వస్తకామప్రభావమ్ ।**
**సంసారామ్భోధిమధ్యభ్రమదఖిలజగత్తారనౌకాయితాఙ్ఘ్రిం**
**ద్వన్ద్వాద్వన్ద్వాదిశూన్యం విజయినుతకృతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥164**

సవ్వడి చేసే మంజీరాలయొక్క అందమైన కాంతిచే ఉపశమింపజేయబడిన లోకానికి మోహాన్ని కల్గించే మాయా ప్రభావాన్ని కలవాడు, ఫాలనేత్రమనే గొప్ప కుండంలో పుట్టిన అగ్నితో ధ్వంసం చేయబడిన మన్మథుని ప్రభావాన్ని కలవాడు, సంసార సముద్రం నడుమ పరిభ్రమించే సమస్త లోకాలను కాపాడే విషయంలో నావవంటి చరణాన్ని కలవాడు, ద్వంద్వాద్వంద్వాది శూన్యుడు, అర్జునునిచే స్తుతింపబడిన కృత్యాలను కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 164

**శ్లో॥ ఏకాన్తే యస్య లీలారదవసనసుఖాస్వాదదన్తక్షతాని**
**వ్యాఘ్రత్వగ్రోమరూక్షా కనకమృదుతరక్షౌమభూతీరజాంసి ।**
**దృష్ట్వా కస్మాదియం శ్రీ స్త్వయి భవతి వదేత్యాలిగీః సోపహాసం**
**శ్రుత్వా గౌరీ తదాసీన్నతముఖకమలా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥165**

ఏకాంతసమయంలో పరమేశ్వరుని లీలాకాలంలో ఏర్పడిన దంతక్షతాలను, పులితోలు రోమాలతో కూడినది, బంగారు వర్ణాన్ని, మిక్కిలి మృదువైన, వెండిపట్టు వస్త్రం లోని విభూతికణాలను చూచి, “ఎందువల్ల ఈ విధమైన శోభ నీవద్ద ఉన్నది? తెలుపు” అని చెలికత్తెలు పరిహాసవచనాలను విని అంబిక అపుడు చల్లని ముఖాన్ని కల్గినదిగా అయినది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 165

**శ్లో॥ క్రీడన్నాస్తే మహేశో గిరివరసుతయా సప్రమోదం మనోజ్ఞే**
**హర్మ్యే నైవాద్య దేవాగదితుమవసరో యాతమౌనేన శీఘ్రమ్ ।**

**ఏవం కోపారుణాక్షో విధిహరిముఖరాన్వారయన్ యద్ధరాభృన్**
**మూలే నన్దీగణేన్ద్రైర్వసతి తమపరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 166**

"మహేశ్వరుడు అంబికతోపాటు మనోహరమైన హర్మ్యంలో సంతోషంతో క్రీడిస్తూ ఉన్నాడు. ఓ దేవతలారా! ఇపుడు మాట్లాడడానికి సమయం లేదు. మౌనంగా శీఘ్రంగా ఇక్కడనుండి తొలగిపొండి" అని కోపంతో ఎఱ్ఱని కన్నులను కల నందికేశ్వరుడు బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలను అడ్డుకొని, పరమేశ్వరుని కైలాసపర్వతం సాను ప్రదేశాలలో ప్రమథగణాలతో పాటు నివసిస్తున్నాడు. అటువంటి, తనకంటె గొప్పవారు ఇంకొకరు లేని, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 166

---

**శ్లో॥ అక్షక్రీడాసు లబ్ధత్రిదశపురవధూబోధనాత్ స్వాన్తకాలే**
**నూత్నానూత్నానుయోగాత్ సవిశయమనప్రాప్తయత్సన్నిధానః ।**
**పాపారోపాతిరోషప్రహరణసభయోద్భ్రాన్తచిత్రో యదుక్త్యా**
**విప్రః కశ్చిన్నిధీనామధిపతిరభవత్కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 167**

పాచికల ఆటలో జయించినందున స్వాధీన అయిన దేవలోకకన్యక చేసిన బోధనచేత తన అంతిమసమయంలో తనవద్దకు వచ్చినవాడు, "కొత్తయముడా! పాతయముడా?" అనే ప్రశ్నవల్ల సందేహంతోకూడిన అయిన యమునిచే పరమేశ్వరునివద్దకు తీసికొనిరాబడినవాడు, తనను "పాపి" అనిన కారణంచేత కోపంతో చిత్రగుప్తుని కొట్టి, భయంతో భ్రమించేటట్లుచేసినవాడైన ఒక బ్రాహ్మణుడు పరమేశ్వరుని ఆజ్ఞచే నిధులకు అధిపతి అయ్యాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 167

---

**శ్లో॥ హంస్యాం లబ్ధ స్వజన్మాకరటవరవపుస్స్వర్ణకాన్తిర్భుసుణ్డో**
**లేభే యస్య ప్రసాదాదనితరసులభం మృత్యుభీతేరభావమ్ ।**
**కల్పేకల్పే వసిష్ఠప్రముఖమునివరప్రశ్రుతానేకవృత్తోఽ**
**ప్యాస్తే యత్ ధ్యానయోగాత్కనకగిరివరే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 168**

ఆడుహంస (హంసి) వల్ల జన్మించినవాడు, కాకి రూపాన్ని ధరించినవాడు, బంగారు వంటి మేనిని కలవాడైన భుశుండి అనే యోగి పరమేశ్వరుని అనుగ్రహంవల్ల ఇతరులచేత పొందడానికి సాధ్యంకాని, మరణభయంలేకుండా ఉండే స్థితిని పొందాడు, కల్పాల తరబడి వశిష్ఠుడు మొదలైన మునులచే ప్రశ్నింపబడిన అనేక, కల్పాంతరాలలో జరిగిన వృత్తాంతాలను

తెలిసినవాడై, మహామేరుపర్వతంపై, పరమేశ్వరుని ధ్యానిస్తూ ఉన్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 168

ఈ వృత్తాంతం జ్ఞానవాసిష్ఠంలో ఉన్నది.

---

**శ్లో॥ ధూమ్రాక్షం రక్తబీజం మహిషమపి మధుం కైటభం చణ్డముణ్డౌ**
**క్రూరం శుమ్భం నిశుమ్భం సురరిపుమపరం దుర్గమత్యుగ్రవృత్తమ్ ।**
**హత్వా యుద్ధే విధీన్ద్రముఖమకుటభాదీప్తసింహాసనస్థా**
**దుర్గా యస్యాదిశక్తిః నిఖిలమవతి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 169**

ధూమ్రాక్షుడు, రక్తబీజుడు, మహిషాసురుడు, మధువు, కైటభుడు, చండుడు, ముండుడు, క్రూరుడైన కుంభుడు, నికుంభుడు, దేవతలకు శత్రువు, రెండవపేరులేనివాడు, ఉగ్రమైన నృత్తాన్ని కలవాడైన దుర్గుడనే వాడు - అనే వీరిని యుద్ధంలో సంహరించి, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతల కిరీట కాంతిచే ప్రకాశించే సింహాసనంలో కూర్చొన్న దుర్గాదేవి పరమేశ్వరునకు ఆదిశక్తి, అన్నిటిని రక్షిస్తున్నది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 169

---

**శ్లో॥ జ్యోతిష్టోమాఖ్యసోమక్రతుసవనహవిఃపుఞ్జమత్యన్తభక్త్యా**
**గూఢాకారం యమీశం సగణమపి శివం యజ్ఞవాటప్రవిష్టమ్ ।**
**హేరమ్బోక్త్యా ప్రబుధ్వా స్వయమపి ముదితో యాజ్యయా యత్ కరాబ్జే**
**దత్వామారాభిధోగ్ర్యశ్శివనగరమగాత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 170**

"**మారన్**" అనేపేరును కల (**సోమయాజినాయనార్**) ఒక బ్రాహ్మణుడు జ్యోతిష్టోమ మనే యాగంలో హవిస్సులను, మిక్కిలి భక్తితో (నీచవేషంలో) మఱుగుపడిన రూపంతో ప్రమథగణాలతో తన యజ్ఞవాటికను చేరిన సర్వమంగళకరుడైన పరమేశ్వరుని వినాయకుని అనుగ్రహంతో తెలిసికొని, సంతోషంతో తానే యాజ్యాపురోనువాక్యంతో (ఒక మంత్ర విశేషంతో) పరమేశ్వరుని చేతిలో అర్పించి చేతులను పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 170

---

**శ్లో॥ క్రీడార్థం స్వాగ్రభాగస్థితగిరితనుజావక్త్రచన్ద్రావలోక-**
**ప్రోద్యత్కన్దర్పరక్షాముకులితవరదృక్ఫాలపట్టాభిరామమ్ ।**

**లోలాడోలానుకూలశ్వసనముఖవృషప్రాన్తరాయాతమోహా-**
**భ్రాన్తస్వర్ధేను మృగ్యత్సురనిజశరణం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 171**

క్రీడించగోరి, తన ముందు భాగంలో కూర్చుని ఉండే అంబికయొక్క ముఖమనే చంద్రుని చూచినందున కల్గిన మన్మథుని రక్షించగోరి మూసికొన్న మూడవకన్నుతో కూడిన గొప్పఫాలంతో అందాన్ని కల్గినవాడు, క్రీడార్థంగా నిర్మింపబడిన ఊయెలలో అటు ఇటు చలించడానికి వీలయిన ఉచ్ఛ్వాసనిఃశ్వాసాలతో ఊడిన ముఖంకల వృషభంయొక్క సమీపాన్ని పొంది, మిక్కిలి మోహంతో భ్రాంతిని చెందిన (పరుగుతీసిన) కామధేనువులను వెదకే దేవతలతో నిండినదైన తన ఆలయాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 171

---

**శ్లో॥ విధ్యణ్డానేకకోటిచ్యుతికరడమరుస్ఫారఘోషాన్వితాన్తం**
**కల్పాన్తాశఙ్కిలోకాఽభయకరవలయవ్యాలరత్నాంశుకాన్తమ్ ।**
**తిర్యక్కిఞ్చిత్ప్రకుఞ్చీకృతపదరవిభావాప్తి మోదానుధావ-**
**ద్ధస్తం ప్రోచ్చప్రసర్పచ్ఛిఖిలసితకరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 172**

పలు బ్రహ్మాండాలను చ్యుతి కలిగేటట్లుచేసే (పైకి ఎత్తిన కుడిచేతిలో ధరింపబడ్డ) డమరుకం యొక్క గొప్ప ధ్వనితో మిక్కిలిగా కల్పాంతకాలం వచ్చిందేమోనని సందేహపడే లోకానికి అభయప్రదానాన్ని చేసే చేతిలో (అభయాన్ని ఇచ్చే చేతితో) చుట్టుకొనబడిన సర్పంలోని రత్నాల కాంతిలో మనోహరమైనవాడు, అడ్డంగా పైకి ఎత్తి వంచిన పాదమనే సూర్యుని కాంతిని పొందగోరి సంతోషంతో అనుసరించిన డోలును కల హస్తాన్ని కలవాడు, పైపైకి వృద్ధిచెందే అగ్నిని కల ఇంకొక చేతిని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 172

---

**శ్లో॥ భోభోః భ్రాత! స్తవైషా షడపి వదనతా బ్రూహి మహ్యం కిమర్థం**
**జాతా చేత్యాదరేణ ద్విపవరవదనేనానుపృష్టే కుమారే ।**
**స్వామిన్! షట్ఛాస్త్రమద్యాభ్యసితుమథ పితుశ్చైకదేతి బ్రువాణే**
**దృష్ట్వాఽజిఘ్రత్పురా యో గుహమధిగిరితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥173**

పూర్వం ఒకానొక సమయంలో కైలాసంలో “ఓ తమ్ముడా! నీకు ఆఱు ముఖాలు ఎందుకోసం ఉన్నాయి? నాకు చెప్పు” అని ఆదరంతో వినాయకుడు అడుగగా, తర్వాత స్వామియొక్క తండ్రి వద్దనుండి ఒకే కాలంలో ఆఱు శాస్త్రాలను అభ్యసించడంకోసం

నాకు ఆఱుముఖాలు కలిగాయి - అని బదులు పల్కిన కుమారుడైన సుబ్రహ్మణ్యుని పరమేశ్వరుడు ముద్దాడాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 173

**శ్లో॥ మత్స్యాక్షి క్రూరకర్మ పృథుతరకఠినత్వగ్వరాహోస్థదంష్ట్రా-**
**ఘోరత్రైవిక్రమాస్థిప్రబలనరహరిస్ఫారరక్తాజినాని ।**
**విష్ణోర్నేత్రామ్బుజాతం విధిముఖనిచయం పూషదన్తాంశ్చ ధృత్వా**
**యస్తద్దర్పప్రశాన్త్యై ప్రథయతి విభుతాం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥174**

పరమేశ్వరుడు మత్స్యంయొక్క కంటిని, క్రూరమైన కూర్మరూపుని, మిక్కిలి కఠినమైన తోలును, వరాహ దంతాన్ని, ఘోరమైన వామనుని ఎముకలను, మిక్కిలి బలాన్నికల నారసింహుని రక్తాన్ని కల, దట్టమైన తోలును, విష్ణువుయొక్క నేత్రమైన తామరపుష్పాన్ని, బ్రహ్మముఖాలను, సూర్యుని దంతాలను ఆయా దేవతల గర్వాన్ని అణచగోరి తన శరీరంలో ఆభరణంగా ధరిస్తూ ప్రభువై ఉండే స్థితిని ప్రకాశింపజేస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 174

శ్రీ పరమేశ్వరుడు విష్ణువుయొక్క మత్స్యాది అవతార నిగ్రహంలో అపహరించిన అంగాలను తన మేనిలో ఏయేచోట్ల ధరిస్తున్నాడనే విషయాన్ని "**పాదే విష్ణువిలోచనం కటితటే శ్రీనారసింహాజినం హారేకూర్మశిరోలసత్కరతలే కంకాళనామాయుధమ్, శూలాగ్రే శవకేశవం, విధిశిరోమాలాంశ్చ దంతాన్ రవేః సర్వం విష్ణుమయం సదాశివ వపుః వ్యక్తం పురాణోదితమ్**", "**కల్పాంతే శమితత్రివిక్రమహాకంకాళబద్ధస్ఫురచ్ఛేషస్యూతనృసింహపాణి-నఖరప్రోతాది కోలామిషః, విశ్వైకార్ణవతా విహారముదితౌ యౌ మత్స్యకూర్మౌ వుభౌ కర్షన్ ధీవరతాం గతోఽస్య తు సతాం మోహం మహాభైరవః**" అనే శ్రీమణియ శివన్ - అని ప్రసిద్ధుడైన సుబ్రహ్మణ్య శివుని సూక్తివల్ల, చతుర్వేద తాత్పర్యసంగ్రహానికి వ్యాఖ్యానాన్ని రచించిన శ్రీ శివలింగభూపతి వాక్కుచేత తెలియాలి.

84వ, 111వ శ్లోకాలలో తెలుపబడిన "**అంశి**" భావాన్ని ఈ శ్లోకంలో శ్రీనటరాజస్వామియే తన కళలోని ఒక కళను ఇతరక్షేత్రాలలో ఉండే రూపాలలో ప్రకాశించేటట్లు చేసి, రాత్రిలో అర్ధయామకాలంలో తనలోనే వ్యాపించేటట్లుగా చేస్తాడు. అని అంటారు.

శ్లో॥ **ఆసేతోరాసుమేరోర్ధరణిగతనిజక్షేత్రవర్యేషు నిత్యం**
**సాహస్రాకారభాజాం స్వతనుమధి చ జుషత్ చిత్కలానాం ప్రమోదాత్ ।**
**ఏకాం సంయోజయంస్తాం నిశినిశి నిజహృత్పఙ్కజే సన్నిరున్ధన్**
**యో భాత్యానన్దమూర్తి బహువిధ ఫలదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥175**

రామసేతువు నుండి మహామేరువు వరకు భూమిలో ఉండే తన క్షేత్రాలలో వేయి భేదాలైన తన చిద్రూపకళలలో ఒక కళను ఒక్కొక్క దినం సంచరించేటట్లు చేసి, రాత్రిలో ఆ కళను తన హృదయంలో అణచి, వేరొక్క ఆనందమూర్తి అయిన పరమేశ్వరుడు ప్రకాశిస్తున్నాడో, అటువంటి, పలురీతులలోని ఇచ్చే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 175

**"సువ్యక్తమేతత్ పుండరీకమాహాత్మ్యే - తృతీయాధ్యాయే - "సర్వేంద్రియాణి హృదయే లయంతే హి సుషుప్తిషు, తథైవ సర్వక్షేత్రాణి పుండరీకపురే లయమ్, లయేనాస్య కదాచిచ్చ జైమినే! సత్యమీరితమ్, దేవదేవః స్వయంసాక్షాత్ క్షేత్రరూపేణ వర్తతే, క్షేత్రాంతరాణి నైవ స్యుః తస్మాదేతద్విశిష్యతే, క్షేత్రాంతరస్థితా దేవాః నిశీథస్య తు మధ్యమే, పుండరీకపురం యాంతి తదాసేవా విశిష్యతే, దేవదేవః సభానాథో న యాతి క్వాపి కుత్రచిత్" ఇతి. చిదంబరపురాణమ్ - దుచ్చకచ్చురుక్కమ్ - 111వ పాశురం.**

**ఎప్పదికళినుముళ్ళే విఱైయరుణ్మూర్తి యావుమ్**
**శెప్పరుమ్ శిదమ్బరత్తుట్టిరువత్తయామమ్ తన్నిల్**
**ఒప్పుఅవదైతలానులురైక్కు మెక్కాలత్తుళ్ళుమ్**
**అప్పరుమ్కాలచ్చేవైయదికవుత్తముమామన్నే**

(ఏ క్షేత్రంలో నివసించే కరుణామూర్తి శివునిరూపాలన్నీ వాక్కుకు అందని చిదంబరంలోని కోవెలలోనికి నిశీథి అర్ధయామంకాలంలో వచ్చిచేరుతాయి. అందువల్ల అన్ని కాలాలలోకంటే, ఆసమయంలో అక్కడ సేవించడం ఉత్తమం.)

అప్పర్‌స్వామి మూడవ తిరుముఱైగ్రంథంలో "**కోయిఱ్పుక్క తిరుత్తాణ్డవమ్**"లో

**మఞ్జన్ మదితవళస మాడవీది**
**మయిలాప్పినుళ్ళార్ మరుకలుళ్ళార్**
**కొఞ్జుత్కొడిముడియాల్**
**కుట్రాలత్తార్ కుడమూక్కిలుళ్ళార్**

**పోయ్క్కొళ్ళమ్ పుదూర్త్తఙ్గుమిడమతియార్**
**శాలనాళార్ తరుమపురత్తుళ్ళార్ తక్కళూరార్**
**పొఙ్గువెణ్ణీరణిన్దు పూదమ్శూళ**
**ప్పులియూర్చ్చిట్రంబలమే పుక్కార్ తామే**

అని మొదలైన పదకొండు పాశురాలు మొదలైన ప్రమాణాలు ఈ విషయాన్ని చక్కగా తెల్పుతున్నవి. ఈ మూర్తిని అర్ధజాముకాలంలో దర్శించడం ఇతర క్షేత్రాలను అన్నిటిని దర్శించడంతో సమానం.



**శ్లో॥ కల్పే కల్పే స్వకీయ ప్రభవలయభయం త్యక్తుపాద్యే పరార్ధే**
**వేదాయం కాలకాలం బహువిధతపసా తోషయిత్వా యదుక్త్యా ।**
**త్రైసాహస్రం ద్విజత్వం దివిషదసులభం లబ్ధవన్తః క్రమేణ**
**నిత్యం యం పూజయన్తి స్వసరణివిధినా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥176**

వేదాలు ప్రతి కల్పంలోను తమ ఉత్పత్తి వినాశాల వల్ల కల్గిన భయాన్ని పోగొట్టగోరి ప్రథమపరార్ధంలో (ప్రకృత కల్పారంభంలో కాలునకు సైతం కాలుడైన పరమేశ్వరుని అనేక విధాలైన తపస్సులతో సంతోషించేటట్లుచేసి, పరమేశ్వరుని ఆజ్ఞతో, దేవతలకు పొందడానికి సాధ్యం కాని మూడు వేలమంది బ్రాహ్మణులై, క్రమంగా ఒక్కొక్క దినం పరమేశ్వరుని తమ మార్గంలోని విధిద్వారా (వేదోక్తవిధిద్వారా) పూజను చేస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 176

చిదంబరరహస్యం, దహరవిద్యాఖండం మొదలైన గ్రంథాలలో ఈ విషయం తెలుపబడింది. అందులో "**త్రిసాహస్రం ద్విసాహస్రం సాహస్రం ద్విశతం తదా, సంతతిర్లవనే విప్రాః క్రమాత్ యుగాదిషు**" అని ఈ కలిలో 200 మంది అని తెలుపబడింది. "**శుద్ధాన్వయానామేతేషాం జ్వలత్ పావకరోచిషామ్, అహ మేక స్త్రిసాహస్రసంఖ్యా సంఖ్యాతి పూరకః**" (చిదంబరమాహాత్మ్యమ్ – 24 ఆశ్వాసం – 73వ శ్లోకం)

**శెమ్మైమెయ్పెరియోర్ పోలత్తేదరిదెన్ఱు మైన్దన్**
**మెయ్మ్మైయిట్రుయరనోక్కి విమలన్ విణ్ణవరుమ్కేట్ట**
**వెమ్మైయొప్పవర్కళ్యారుమ్ యామవర్క్కొప్పామెన్ఱే**

అని చిదంబర రహస్యంలోని కోయిల్ పురాణమ్ పల్కుతున్నందున నటరాజస్వామి యే మూడువేల సంఖ్యను పూర్తిచేస్తున్నాడు. అంతేకాక, శ్రీచిదంబరంలోని నటరాజ

దేవస్థానం సంబంధించిన సుమారు 800 సంవత్సరాల పైబడిన తాళపత్రగ్రంథాలలోను "నపర్" (తంబళ్ళ) సంఖ్య కొంచెం ఇంచుమించుగా ఆ విధంగానే లిఖించబడింది.

వీరు వేదమూర్తులనే విషయాన్ని గూర్చి శ్రీమణివాచకర్ కూడా "**వేదఙ్గళ్ తొళుతేత్తుమ్ విళఙ్గు తిల్లైకణ్డేనే**" ( వేదాలు నమస్కరించి కీర్తించే, ప్రకాశించే తిల్లైవనమనే చిదంబరాన్ని దర్శించాను.) అనే పాశురంలో చక్కగా వివరించారు. వేదాలు శబ్దరూపాలు, రూపరహితాలైనందున, వేదరూపులైన తిల్లైలోనివసించే బ్రాహ్మణులు – అనే దాని అర్థం (వేదాలు నమస్కరించడమంటే వేదరూపులైన బ్రాహ్మణులు నమస్కరించడమని అర్థం.) అదే దశకంలో 6వ పాశురంలో కూడా "**మత్తైయవరుమ్ నానవరుమ్ వణఙ్గిడనాన్ కణ్డేనే**" (వేదవిదులు, దేవతలు నమస్కరించగా నేను చూచాను) అనే మాటయే ఈ అర్థాన్ని తెలిపే గమకం. జ్ఞాన సంబంధర్ కూడా ఈ బ్రాహ్మణులు నటరాజస్వరూపులుగానే దర్శించి,

**నిలత్తాల్ కరియమిడట్రార్ నల్లనెట్రి మేలుట్రకణ్ణినార్**
**పట్రుశూలత్తార్ కడలైప్పొడి నీఱణివార్ శడైయార్**
**శీలట్రార్ తొళుతేత్తుమ్ శిట్రమ్బలమ్ శేర్తలార్ కళత్ప్రేవడి**
**వైతాఖక్కోలత్తాయరుళాయున్ కారణమ్ కూరుదుమే.** – అని కీర్తించారు.

వేదాలు పరమేశ్వర స్వరూపాలు, "**వేదశ్శివః శివో వేదః, వేదమూర్తిరహమ్ విప్రాః**" అనే ప్రమాణాలతో తెలియబడుతున్నది. పరమేశ్వర స్వరూపులైన ఈ బ్రాహ్మణులు వేదస్వరూపులనే విషయం స్పష్టం.

ఇంకా వివరాలు మహా మహోపాధ్యాయ శ్రీ దండపాణి స్వామిదీక్షితులు ప్రకాశింప జేసిన **చిదంబర తత్త్వానిర్ణయ**మనే సంస్కృత గ్రంథంలో చూడవచ్చు.



**శ్లో॥ యస్యోత్కర్షం చ విష్ణోస్సదనమధిగతో వహ్నిసన్దగ్ధపీఠే**
**స్థిత్వా శ్రుత్యన్తవేద్యం శివమపి పరమం బోధయన్ స్వాం చ భూతిమ్ ।**
**ధిక్కుర్వన్ దుర్మతీనాం నికరమపి యదీయాజ్ఞయా బన్ధువర్గైః**
**విప్రః కశ్చిద్ బుధేడ్యో రజతగిరిమగాత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥177**

విద్వాంసులచే పొగడబడిన ఒక బ్రాహ్మణుడు (హరదత్తుడు) విష్ణువు ఆలయాన్ని చేరి, అగ్నిలో మిక్కిలిగా తపింపబడిన పీఠంలో కూర్చొని, పరమేశ్వరుని ఉత్కర్షను, వేదాంతంలో చెప్పబడిన పరమ తత్త్వాన్ని తన మాహాత్మ్యాన్ని వివరించి, దుష్టుల సమూహాన్ని

ధిక్కారం చేసి, ఆ పరమేశ్వరుని ఆజ్ఞతో బంధువర్గంతో పాటు కైలాసాన్ని చేరాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 177

ఈ చరిత్ర హరదత్త చంద్రికలో తెలుపబడింది.

---

**శ్లో॥ గౌర్యాః పణిం గృహీత్వా హిమగిరికటకే సత్వరస్థూలపృష్ఠం**
**ధర్మాకారం వృషేన్ద్రం నిజచరణజవోల్లఙ్ఘితామ్భోధివర్గమ్ ।**
**అధ్యారూఢో నిజాఙ్కస్థితగిరితనయాం ప్రేయసీం వాగ్విలాసైః**
**లజ్జానమ్రాం ప్రకుర్వన్ నతనుతవిహృతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥178**

హిమాలయం సానుప్రదేశాలలో గౌరిని కల్యాణం చేసికొని, శీఘ్రంగా స్థూలమైన పృష్ఠభాగాన్ని కల్గినది, ధర్మంయొక్క స్వరూపాన్ని తన కాలివేగంతో దాటబడిన సముద్రాలను కల్గినది, శ్రేష్ఠమైనది అయిన వృషభంలో అధిరోహించి, తన ఒడిలో ఉండే అంబికను తన వాగ్విలాసాలతో సిగ్గుతో నమస్కరించినదిగా చేసినది, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 178

---

**శ్లో॥ యత్ఫాలస్థం మృగాఙ్కం స్వరదమితి ముధాశుణ్డయాఽఽదాయ తస్మిన్**
**బిమ్బే దృష్టస్వవక్త్రప్రతిఫలనసమాకర్షణవ్యగ్రచిత్తమ్ ।**
**దానామోదానుధావద్భ్రమరముఖరితస్వర్గపాతాలభాగం**
**యోఽజిఘ్రత్ స్వాఙ్గసంస్థం గజముఖమనిశం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥179**

పరమేశ్వరుని శిరస్సులో ఉండే చంద్రుని తన కొమ్ము (దంతం) అనే భావంతో తొండంతో ఎత్తిన ఆ చంద్రబింబంలోకన్పించే తన ప్రతిబింబాన్ని స్వీకరించడంలో ప్రయత్నాన్ని కల్గినవాడు, మదజలవాసనచేత పరిభ్రమించే తుమ్మెదల శబ్దాలచే పూరింపబడిన స్వర్గం, పాతాళం – అనే వీటి ప్రదేశాలను కలవాడు, తన ఒడిలో ఉండేవాడైన వినాయకుని పరమేశ్వరుడు మిక్కిలిగా ముద్దాడి ప్రశంసించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 179

---

**శ్లో॥ కాత్యాయన్యాః కరాబ్జం దినకరవదనాధీతవేదార్థబోధాత్**
**లబ్ధానన్దాన్తరఙ్గప్రశమితతమసస్తాపసస్యాశ్రమే యః ।**

**గృహ్ణన్ సంసారవార్ధావధికభయకరే మగ్నసత్త్వప్రపఞ్చం**
**నిత్యం రక్షన్నజస్రం జయతి శివపురే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 180**

సూర్యునివల్ల అభ్యసింపబడిన వేదాల అర్థజ్ఞానంచేత పొందబడిన ఆనందంతో కూడిన హృదయంనుండి తొలగించుకొన్న (తరిమివేసిన) అజ్ఞానాన్ని కల్గినవాడైన మునియొక్క ఆశ్రమంలో, ఆ మునిపుత్రికైన కాత్యాయనిని పరిణయమాడి, సంసారసముద్రంలో మునిగిన ప్రాణులను రక్షించేవాడై, శివపురంలో పరమేశ్వరుడు ప్రకాశిస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 180

ఈ కథ తిరువీథి మిఖలై పురాణంలో ఉన్నది.

---

శ్లో॥ **యన్మూర్తిం బ్రహ్మనిష్ఠాః పరమహసి పదే ప్రాజ్ఞమానన్దరూపం**
**శైవాస్సాదాఖ్యమూర్తిం హరిమితి చ పరే శక్తిమన్యేఽపరే తు ।**
**విఘ్నేశం చేతరేఽహ్నాం పతిమితి వటుకస్కన్దవిధ్యగ్నిశక్రాన్**
**ఇన్దుం కేచిద్విభావ్యాఖిలసుఖమభజన్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 181**

పరమేశ్వరుడైన నటరాజ మూర్తిని బ్రహ్మజ్ఞానులు గొప్ప పదంలో ఆనందరూపుడైన ప్రాజ్ఞునిగా, శైవులు సదాశివమూర్తిగా, ఇంకా, భక్తులు విష్ణువు, శక్తి, విఘ్నేశ్వరుడు, సూర్యుడు, భైరవుడు, సుబ్రహ్మణ్యుడు, బ్రహ్మ, అగ్ని, ఇంద్రుడు, చంద్రుడు – అని ఈ విధంగా పలురూపాలుగా, భావించి పూజించి, సర్వసుఖాలను పొందారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 181

---

శ్లో॥ **ఏకం బ్రహ్మాఽద్వితీయం త్రివిధమపి చతుర్వాఙ్మయం పఞ్చబాణ-**
**భ్రాతృవ్యం షడ్విపక్షద్విషదభివినుతం సప్తజిహ్వాలికాక్ష్మమ్ ।**
**అష్టమ్యేణాఙ్కచూడం నవరసనటనాలోలవాసో దశాశం**
**రుద్రైస్సాదిత్యవర్గైస్సతతనతపదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 182**

అద్వితీయమైన బ్రహ్మం, రెండవది (సాటి అయినది) లేనివాడు, మూడు విధాలైన (బ్రహ్మ, విష్ణు, రుద్ర స్వరూపంగా) ఉన్నప్పటికీ నాల్గు విధాలైన వాక్ స్వరూపమైనవాడు, మన్మథునకు శత్రువు, కామక్రోధాదులు లేని మునివరులచేత స్తుతింపబడేవాడు, అగ్ని నేత్రాన్ని ఫాలంలో కలవాడు, అష్టమీ చంద్రుని తలలో కలవాడు, నవరసాలతో కూడి నటనా విలాసంతో చలించే వస్త్ర రూపాలైన పది దిక్కులను కలవాడు, ఆదిత్యులతోకూడిన

రుద్రులతో సదా నమస్కరింపబడే చరణాలను కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 182

ఈ విధంగా "**తిరుమందిరమ్**" (తిరుమంత్రం) అనే ప్రబంధంలోని

**ఇన్ఱవన్తానే ఇరణ్డవన్ ఇన్నరుళ్**
**నిన్ఱనన్ మూన్ఱినుళ్ నాన్గుణర్న్దాన్ ఐన్దు**
**వెన్ఱనన్ అఱువిరిన్దనన్ ఏళుమ్బార్**
**చ్చెన్ఱనన్ తానిరున్దానుణర్న్దెట్టే - (1-1-1)**

అనే పాశురంలో ఒకటినుండి ఎనిమిది వరకు గల సంఖ్యా వాచకాలు ప్రయోగింప బడటం గమనించవచ్చు.

---

**శ్లో॥ విష్ణోర్లాలాటదేశచ్యుతరుధిరఝరీసజ్గమేనాప్యపూర్ణం**
**బ్రాహ్మం హస్తే కపాలం డమరుమపి వహన్ విశ్వకద్రూన్స్వపార్శ్వే ।**
**దంష్ట్రాగ్రాభాపి శజ్గీకృతవిపులజటో భైరవః క్షేత్రపాలో**
**విశ్వం రక్షన్నపాధేర్యమపి భజతి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 183**

విష్ణువుయొక్క ఫాలంనుండి స్రవించే రక్తధారతో నిండని బ్రహ్మకపాలాన్ని, డమరుకాన్ని హస్తంలో, తన పార్శ్వభాగంలో శునకాలను వహిస్తూ, కోఱపళ్ళ కాంతితో బంగారు గన్నేరు పూవు వర్ణాన్ని కల్గినదిగా చేయబడిన, విస్తారమైన జటలను కల, క్షేత్రపాలురనే భైరవులు లోకాన్ని అపాయంనుండి రక్షిస్తూ పరమేశ్వరుని సేవిస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 183

---

**శ్లో॥ సీతాహస్తాబ్జపిణ్డీకృతవరపృథివీలిఙ్గమూలానుకర్ష-**
**త్రుట్యద్వాలాస్య శాఖామృగపతిరచితస్తోత్రతుష్టాన్తరఙ్గమ్ ।**
**రక్షో బృన్దప్రహారప్రభవకలినివృత్త్యాశ్రితామ్బోధితీర-**
**శ్రీరామప్రష్ఠరాజార్చితపదయుగలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 184**

సీతయొక్క తామరపూవువంటి చేతితో ముద్దచేసి చేయబడిన గొప్ప పార్థివ లింగాన్ని లాగినందున తెగిన తోకను, పగిలిన ముఖాన్నికల ఆంజనేయునిచే చేయబడిన స్తుతులచే సంతోషాన్ని పొందినవాడు, రాక్షస సమూహాలను సంహరించినందున కల్గిన పాపాన్ని పోగొట్టుకొనగోరి సముద్రతీరంలో (రామేశ్వరక్షేత్రంలో శ్రీరాముడు మొదలైన ప్రభువులచే

అర్చింపబడిన పదయుగళాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. (ఈ కథ సేతుపురాణంలో చెప్పబడింది.) 184

**శ్లో॥ యోగాన్నిర్బీజసంజ్ఞాత్ సముదితపరమానన్దకాష్ఠాసమాధి-**
**స్థిత్యా వల్మీకగూఢాం తనుమవనిగతాం నీతకల్పాం ధరన్ స్వామ్ ।**
**శ్రీమాన్ శ్రీమూలసంజ్ఞో నృపనుతచరితో నిత్యనిస్సంగవిద్యో-**
**ప్యాద్యస్సిద్ధో యమన్తః కలయతి నితరాం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥185**

నిర్బీజయోగంతో పరమానందాన్ని అనుభవించే సమాధి అవస్థలో అనేక కల్పాలు గడచిన కారణంచేత పుట్టచేత కప్పబడినది, భూమిలో మఱుగుపడి ఉండేదైన తన శరీరాన్ని ధరించేవాడు, రాక్షసులచే స్తుతింపడిన చరిత్రలను కలవాడు, ఆత్మజ్ఞాని అయిన శ్రీ తిరుమూలర్ అనే పేరును కల గొప్పసిద్ధుడు పరమేశ్వరుని సదా ధ్యానంచేస్తూ, ఉండేవాడు, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 185

(తిరుమూలర్ – అనే సిద్ధుడు బ్రహ్మచే సృష్టింపబడిన సిద్ధులలో ప్రముఖుడు. ఇతడు సదా శివరాజయోగంలో (సంపూర్ణ సమాధిలో) ఉండి, పరమేశ్వరునితో అద్వితీయ స్థితిలో కలిసి ఉండేవాడు.

ఒకానొక సమయం ఒక బ్రాహ్మణుని ఇంటికి చేరి, ఆకలి వ్యాధులు పోగొట్టుకొనదలచి, అమృతాన్ని ప్రార్థించాడు అపుడు ఆ ఇంటి గృహిణి తిరుమూలర్‌నుచూచి భక్తితో మంచి రుచిని కల వంటను వండిపెట్టగోరి "ఓస్వామీ! కొంచెం సేపు ఇక్కడే ఉండండి. కూరను వండుతున్నాను. అది పక్వం కాగానే భుజించవచ్చు. నన్ను అనుగ్రహించండి." అని పలుమార్లు నమస్కరించి ప్రార్థించి వంటగదికి పోయింది.

తరువాత సిద్ధుడు ఆ భోజనాన్ని తినకుండా, అక్కడ ఉండే ఒక వినాయకుని ఆలయాన్నిచేరి, అక్కడ ఒక సొరంగాన్ని చూచాడు. ఆనందంతో దానిలోపలకు పోయి యోగసమాధిలో ఉన్నాడు. చిరకాలం గడచింది. సిద్ధుని శరీరంపై పుట్టలు పెరిగి ఆవరించాయి. క్రమంగా ఆ కోవెలకూడా భూమిలో మఱుగుపడిపోయింది. ఆ కోవెలపై రాజభవనం నిర్మింపబడింది.

ఈ విధంగా ఉండగా, ఒకానొక సమయంలో అక్కడ రాజ్యపాలనను చేసే చోళవంశ ప్రభువు ఒకడు ఆదారిలో రథంపైన వచ్చాడు. రథాన్ని లాగే అశ్వాలు ఆ ప్రాంతానికి రాగానే నిలిచిపోయాయి. అది గమనించి, ఆ రాజు దీనికి ఏమి కారణం? ఏమి? అని

తన మంత్రులను ప్రశ్నించగా, వారు ఈ ప్రదేశంలోపల వెదికి చూడాలి – అని అన్నారు. ఆ విధంగానే అక్కడ శోధించగా, ఆ కోవెల, సొరంగం, సిద్ధుని రూపం కన్పించాయి. ప్రభువు చాలా సంతోషంతో ఆ సిద్ధుని తన రథంలో కూర్చుండబెట్టుకొని, తన రాజధానికి చేరి, ఆ రూపాన్ని తన సింహాసనంపై నిలిపి, సమాధి నుండి సిద్ధుడు లేచేటట్లు చేయగోరి, అమాత్యుని మాటతో గేదెవెన్నను సిద్ధుని తలపై పెట్టాడు. కొంచెం సేపటికి ఆ వెన్న కరిగి సిద్ధుని దేహం అంతా పాకింది. సిద్ధుడు తెలివిని పొంది కళ్ళు తెరచి, రాజును చూచి "కూర పక్వమైనదా?" అని అడిగాడు. అపుడు రాజు షడ్రసోపేతమైన ఆహారాన్ని సిద్ధునకు పెట్టి, నమస్కరించాడు. అపుడా సిద్ధుడు ప్రభువునకు పుత్రసంతతి కలిగేటట్లు వరమిచ్చాడు. ప్రభువు "కూర పక్వమైనదా?" అని ప్రశ్నించడానికి గల కారణాన్ని ప్రశ్నించగా సిద్ధుడు పూర్వవృత్తాంతాన్ని తెల్పి "డెబ్భైకోట్ల యుగాల కాలం సమాధిలో ఉన్నాను" అని పలికాడు. ఈ విధంగా ఇంకా పలుపలు కథలు ఈ సిద్ధుని గూర్చి వినబడుతున్నాయి.

తిరుత్తొణ్డర్ పురాణంలో తిరుమూలనాయనార్ చరిత్ర చెప్పబడింది. ఆ చరిత్రలో ఈ నాయనార్ చివర కైలాసాన్ని చేరాడని, సంస్కృత భాషలోని అగస్త్య భక్త విలాసంలో "**తిరునావదుతుఱై**" క్షేత్రంలో శివలింగజ్యోతిలో కలిసిపోయాడని తెలుపబడింది.

సిద్ధులు పరమేశ్వరుని పూజించి, చిరంజీవులై యోగసమాధిలో ఉండే క్షేత్రాలు 21.

"**ఆద్యః శ్రీమూలసంజ్ఞో నటపతియజనాత్ తిల్లవన్యాం ప్రపేదే సిద్ధిం నందీ చ** కాశ్యామరుణగిరివరే వామకాంతారసిద్ధః, భూమూలాధారసంజ్ఞే కమలమునివరః కొంకణో వేంకటాద్రౌ, కుంభశ్చానంతశయ్యాపురి నలదపురే తత్ర వాల్మీకిసిద్ధః, శ్రీరామః సుందరాద్రావమృతఘటపురే సార్పకః కృష్ణపుర్యాః, కృష్ణాభిఖ్యే పురే శ్రీ ఫలగిరిశిఖరే భోగనాథాభిధానాః, శ్రీగృధ్రాద్రౌ కుదంబః పరగిరిశిఖరే మత్స్యసిద్ధః పతంజల్యాఖ్యః, సేతౌ చ గౌరీమృగ ఇతి గదితః కాలహస్తౌ నితాంతమ్, హాలాస్యే సుందరః శ్రీనగమధిమహితః కోరకోదార్వికేయో వృద్ధాద్రౌ వైద్యనాథ్యేఽ ప్యధిగతసుయశాద్ధి ధన్వంతరిశ్చ, శ్రీరంగే కంచుకాఖ్యో మునిరపి చ తథా నందిదేవాభిధానః, శ్రీ కాశ్యామిత్యవోచన్ భువి శివనిలయాన్యేకవింశం మహాన్తః।"

1) శ్రీమూలః, 2) నందీ, 3) వామకాంతార సిద్ధః, 4) కమలమునివరః, 5) కోంకణః, 6) కుంభః, 7) వాల్మీకిసిద్ధః, 8) శ్రీరామః, 9) సార్పకః, 10) భోగనాథః, 11) కుదంబః, 12) మత్స్యసిద్ధః, 13) పతంజలిః, 14) గౌరీమృగః, 15) సుందరః,

16) అధిమహితః, 17) కోరకఃదార్వికేయః, 18) వైద్యనాథః, 19) ధన్వంతరిః, 20) కంచుకాఖ్యః, 21) నందిదేవః)

---

**శ్లో॥ హల్లీసోన్ముఖ్యకేలీనమితనిజశిరసంస్థగఙ్గాముఖేన్దో-**
**రాలోకోత్పన్నకోపత్వరితగతిశివాసాంత్వనవ్యగ్రచిత్తమ్ ।**
**దృష్ట్వా కణ్ఠస్థనీలం జలముగితి ముధాఽఽయాతకౌమారవాహాత్**
**బిభ్యద్భూషా ఫణీనాం మణిరుచి సుషుమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥186**

"**పిన్నల్ కోలాట్టమ్**" మొదలైన క్రీడలలో వంచిన తన శిరస్సులో ఉండే గంగయొక్క చంద్రునివంటి ముఖాన్ని చూచినందున కోపించి, వేగంగా నడచిన గౌరీదేవిని సమాధాన పరచేవాడు, తన కంఠంలో ఉండే విషాన్ని చూచి మేఘమనే బుద్ధితో సమీపానికి వచ్చిన సుబ్రహ్మణ్యుని వాహనమైన నెమలివల్ల భయాన్ని పొందిన, ఆభరణంగా ఉండే సర్పాల తలలపై ఉండే రత్నాలకాంతితో అందాన్ని పొందినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 186

---

**శ్లో॥ స్వర్గాధీశోపదిష్టాఖిలసుఖకరీం యత్తిరోధానశక్తేః**
**విద్యాం మోదాజ్జపిత్వా సురయువతిసమామాప భైమీం స్వకాన్తామ్ ।**
**యత్సేవా నిర్గతాఽఽర్కిగ్రహరచితమహోపద్రవో నైషధేన్ద్రో**
**విశ్వం రక్షన్నిజాన్తే ద్యుసదనమభజత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 187**

నిషధదేశ ప్రభువైన నలుడు దేవేంద్రునిచే ఉపదేశింపబడినది, సమస్త సుఖాన్ని ఇచ్చేది అయిన పరమేశ్వరుని తిరోధాన శక్తియొక్క మంత్రాన్ని (తిరస్కరిణీ మంత్రాన్ని) సంతోషంతో జపించి, దేవకాంతతో సాటివచ్చే దమయంతిని పొందాడు. ఆ పరమేశ్వరుని సేవతో శనేశ్వరగ్రహ బాధలను పోగొట్టుకొని, చిరకాలం లోకాలని పాలించి, చివరలో స్వర్గాన్ని చేరాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 187

ఇది తిరునల్లాఱు పురాణమనే గ్రంథంలో చెప్పబడింది.

---

**శ్లో॥ కన్దర్పాణాం బహూనాం ప్రసవకరవరాపాఙ్గవీక్షావిలాసై-**
**రుద్యానే రాజతాద్రేర్వరిధృతసుతనోశ్శాస్త్రభిఖ్యం కుమారమ్ ।**

**ఉత్పాద్యాయాత గౌరీమధురవచనతః పాలకత్వం వనానాం**
**సర్వేషాం దత్తవాన్ యస్త్రిజగదభినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 188**

పరమేశ్వరుడు పూర్వం ఒకానొక సమయంలో కైలాసపర్వతంలో ఉండే ఉద్యానవనంలో పలు మన్మథులను సృష్టించే కటాక్షాలతో విష్ణుమోహిని నుండి శాస్తా అనే పుత్రుని ఉత్పత్తి చేసి, ఆ సమయంలో అక్కడకు వచ్చిన అంబిక యొక్క తీయని వాక్కులతో ఆ కుమారునకు అన్ని వనాలకు పాలకుడై ఉండే స్థితిని అనుగ్రహించాడు, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 188

ఈ కథ శంకరసంహితలో తెలుపబడింది.

---

**శ్లో॥ ముగ్ధే కైలాసవాసీజఠరశుభకరే గౌరి చర్మామ్బరోఽసౌ**
**బ్రహ్మన్నైశ్వర్యదోఽమ్బ పితృభువి నటకృద్విప్రకైవల్యదాతా ।**
**ఏవం యద్వాక్యభఙ్గీం ముహురపి చ తిరస్కృత్య సద్మాన్తరాలం**
**గన్తుం వ్యగ్రాముమాం యోఽప్యకురుత ముదితాం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥189**

హిమాలయంలో అంబిక పరమశివుని వివాహం చేసికొనదలచి తపస్సు చేసేటపుడు, ఆ దేవిని పరీక్షించడం కోసం, వృద్ధబ్రాహ్మణరూపంతో శివుడు ఆమెవద్దకువచ్చి సల్లాపం చేసినరీతి ఈ శ్లోకంలో తెలుపబడింది.

ఈశ్వరుడు : ఓ సుందరీ! నీవు మనస్సులో భావించే శివుడు కైలాసమనే పర్వతంలో నివసించేవాడు. అందువల్ల తగినవాడు కాడు.

అంబిక : ఓ వృద్ధుడా! అతడు మంగళకరుడు.

ఈశ్వరుడు : ఓ గౌరీ! అతడు తోలును ధరించినవాడు. వస్త్రం లేనివాడు (దరిద్రుడు)

అంబిక : ఓ బ్రాహ్మణుడా! అతడు అందఱికి ఐశ్వర్యాలను ఇచ్చేవాడు.

ఈశ్వరుడు : ఓ గౌరీ! అతడు శ్మశానభూమిలో నాట్యమాడతాడు.

అంబిక : ఓ బ్రాహ్మణా! అతడు మోక్షప్రదాత.

ఈ రీతిలో పరమేశ్వరుని మాటల రీతిని మాటిమాటికి తిరస్కరించి, తన పర్ణశాలలోపలికి వెళ్ళదలిచిన ఉమాదేవిని పరమేశ్వరుడు తన నిజరూపాన్ని దర్శింపజేసి, ఆనందింపజేసాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 189

కుమారసంభవకావ్యంలోని పంచమసర్గలో కాళిదాసు "**ఇతోగమిష్యామ్యధివేతి వాదినీ**

**చచాల బాలాస్తనభిన్న వల్కలా, స్వరూపమాస్థాయ చ తాం కృతస్మితః సమాలలంబే వృషరాజకేతనః**" అని అన్నాడు. ఇంకా ఇటువంటి సూక్తులు.

---

**శ్లో॥ యద్ధాసోద్భుప్రభూతా నిఖిలమపి జగద్వ్యాపినీ చన్ద్రికాభా-**
**ప్యావిష్ణుస్థావరాన్తం హృదయమధిగతం బాహ్యగఞ్చాన్ధకారమ్ ।**
**దూరీకృత్యాశు సర్వాన్ స్వపదసరసిజధ్యానశీలానజస్రం**
**రక్షత్యాద్యన్తహీనం గురుభృగువినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 190**

పరమేశ్వరుని మందహాసం నుండి పుట్టినది, సమస్తలోకాన్ని వ్యాపించినది అయిన చంద్రకాంత విష్ణువు మొదలుస్థావరపర్యంతం లోపల బయట ఉండే చీకటిని వేగంగా పోగొట్టి, తన పాదాన్ని ధ్యానించేవారైన సమస్త ప్రాణులకు మిక్కిలి రక్షిస్తున్నాడు. అటువంటి, ఆది అంతం లేని, అసుర దేవ గురువైన, అసురగురువుచే స్తుతింపబడిన కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 190

---

**శ్లో॥ గోదావర్యాస్తటస్థోఽ నృతవచనపరో దృష్టకార్తాన్తికో యత్**
**క్షేత్రే గౌల్యాం జనిత్వా నిజసుకృతలవాత్ స్వీయపాతోక్తిదోషమ్ ।**
**భస్మీకర్తుం చిరం యం స్తుతిభిరభినమన్ సున్దరాఙ్గో యదుక్త్యా**
**జాతో యత్క్షేత్రపాలో జయతి తమసమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥191**

గోదావరీ తీరంలో ఉన్నవాడు, అసత్యాన్ని పలికేవాడు, దుష్టుడు అయిన ఒక జ్యోతిష్కుడు, (క్షేత్రాటన గతిలో శ్రీనటరాజస్వామిని దర్శించిన పుణ్యలవలేశంచేత మఱుజన్మలో చిదంబరక్షేత్రంలో బల్లిగా పుట్టి, స్వల్ప పుణ్యంతో పూర్వజన్మవాసన కలవాడై, తన బల్లిపాటువల్ల, వచనంవల్ల, ప్రాణులకు కలిగే పాపాన్ని తీర్చడానికోసం పరమేశ్వరుని స్తుతించి, నమస్కరించి, దానివల్ల సంతుష్టుడైన పరమేశ్వరుని క్షేత్రాన్ని రక్షించేవాడై ప్రకాశిస్తున్నాడు. అటువంటి, సాటిలేని, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 191

ఈ చరిత్ర అర్ధయామ అళకర్‌ను గూర్చినది. ఇది చిదంబరరహస్యంలో తెలుపబడింది. ఆ బల్లిరూపాన్ని శ్రీచిత్సభలోని తూర్పుదెసలోను, ఆ బల్లిని అనుగ్రహించిన పల్లీశ్వరర్ అనే మూర్తిని రెండవ ఉత్తర ప్రాకారంలోను నిత్యం దర్శించడమయింది.

---

శ్లో॥ భుక్త్వా హాలాహలాంశం యుధి నిహతతనుం దారుకాఖ్యం సురారిం
కృత్వా ఘోరస్వకృత్యప్రచలితభువనాం భద్రకాలీం శివో యః ।
ప్రత్యేత్యానన్దనృత్తం పితృపతిభువనే దర్శయిత్వా తయాఽణ్డాన్
సర్వాన్ సంరక్షతీశస్తమినవిధునుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 192

శివుని కంఠంలోగల హాలాహలవిషంయొక్క అంశాన్ని భుజించి యుద్ధంలో దారుకాసురుని సంహరించి, ఘోరమైన తనకృత్యాలతో లోకాలు భయపడేటట్లుచేసినది, రుద్రభూమిలో ఉండేది అయిన భద్రకాళిని దగ్గరకు వెళ్లి, పరమేశ్వరుడు తన ఆనందనాట్యాన్ని చూపించి, అందువల్ల ఆమె మదవేగాన్ని శమింపజేసి, ఆమెద్వారా అన్ని బ్రహ్మాండాలను పాలిస్తున్నాడు. అటువంటి, సూర్యచంద్రులచే స్తుతింపబడిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 192

ఈ కథను అప్పయ్యదీక్షితులు బ్రహ్మతర్కస్తవంలోని 48వ శ్లోకంలో తెలిపారు. తిరువాచకమ్ అనే ద్రావిడ గ్రంథంలోకూడా-

**తేన్ పుక్కతణ్పనైశుళ్ తిల్లైచ్చిట్రంబలవన్**
**తాన్ పుక్కునట్టమ్ పయిలువదు ఎన్నేడే !**
**తాన్పుక్కు నట్టమ్ పయిన్డిలనేల్ తరణియెల్లామ్**
**ఊన్ పుక్కవేల్కాళిమాట్టమ్ కాణ్ శాఖలే!**

(మధువుతో నిండిన తాళవృక్షాలను చుట్టూకల తిల్లైలోని నటరాజస్వామి నాట్యం చేయడం ఏమి సఖీ! -

నటరాజస్వామి తాను నాట్యం చేయకపోతే భూమి అంతా మాంసంతో కూడిన వేలాయుధాన్ని కాళి రూపాల సమూహమే అవుతుంది) అని పల్కడం గమనించవచ్చు.



శ్లో॥ యస్యోద్వాహే హిమాద్రిం గతవతి నిఖిలప్రాణివర్గేఽర్కసూనో-
రాశామౌన్నత్యభాజం రచయితుమధరాం విధ్యమద్రిఞ్చ దైత్యమ్ ।
ధిక్కర్తుం కుమ్భజన్మా చులుకితజలధిః ప్రేషితో యేన మోదాత్
తం దేవం కోటి కోటి ద్యుమణితనురుచిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥193

పరమేశ్వరుని వివాహసమయంలో హిమాలయానికి సమస్త ప్రాణులు వచ్చినపుడు, ఎత్తుగా ఉండే దక్షిణభాగంలో ఉండే భూమిని సమానంగా చేయడం కోసం, వింధ్యపర్వతాన్ని, వాతాపి, ఇల్వలుడు - అనే అసురులను సంహరించడం కోసం, అరచేతిలో (పుడిసిటిలో)

ఇముడ్చుకొన్న సముద్రాన్నికల అగస్త్యుడు పరమేశ్వరునిచే సంతోషంతో దక్షిణదిక్కువైపు పంపబడినాడు. అటువంటి, అనేక సూర్యులవంటి శరీరకాంతిని కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. ఈ కథ స్కందపురాణంలో తెలుపబడింది. 193

---

**శ్లో॥ వీణా సంక్రాన్తకాన్తా మధురతరరసాలాపగీతి ప్రమోద-**
**ప్రోద్యద్రోమాఞ్చ కూటద్విగుణతనులతా భోగసౌన్దర్యశిల్పమ్ ।**
**యన్నానారత్నభూషాకిరణకబలితే దిక్తటే వప్రలీలాం**
**కుర్వత్యద్యాపి మోదాత్ ద్విరదపరిబృఢాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥194**

వీణను మీటే అంబిక చేసిన గానంతో సంతోషించిన వాడు, వృద్ధిచెందిన రోమాంచంతో రెండింతలైన శరీరాన్ని, సౌందర్యాన్ని కలవాడైన పరమేశ్వరుని రత్నమయాలైన ఆభరణాల కిరణాలతో వ్యాపింపబడిన దిక్ ప్రదేశాలలో దిగ్గజాలు ఆనందంతో తొండాలను ఎత్తి వప్రలీలలను ఈనాటికి చేస్తున్నాయి. (తొండంతో పర్వత చరియలను మోదే క్రీడ వప్రలీల) అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 194

---

**శ్లో॥ కస్త్వం కిన్నామధేయో ధరణిసురవపుః కమ్పితాపాదచూడో**
**గోత్రం సూత్రం కులం త్వత్పితరమపి తథా మాతరం బన్ధువర్గమ్ ।**
**శత్రుం మిత్రం కలత్రం తనయమపి వయోజ్ఞాతుమీహే తవేతి**
**ప్రోవాచాద్రౌ పురా యం ప్రతిగిరితనయా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥195**

అంబిక, పూర్వం ఒకానొక సమయంలో హిమాలయపర్వతంలో పరమేశ్వరుని వివాహం చేసికొనగోరి, తపస్సును చేసేటపుడు తనను పరీక్షచేయవచ్చిన ఆ పరమేశ్వరుని, “నీవెవరు? నీ పేరేమి? బ్రాహ్మణులకు కూడా కంపించే రూపాన్ని కల్గి ఉన్నావు. నీ గోత్రం, సూత్రం, కులం, తండ్రి, తల్లి, బంధువులు, శత్రువులు, సఖులు, భార్య, కుమారుడు, వయస్సు - అనే వీనిని తెలియజేయి - అని అడిగింది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 195

---

**శ్లో॥ స్కన్దే విఘ్నేశశుణ్డాం స్వకరసరసిజైః మానయిత్వా తదుక్తైః**
**స్వీయైర్వక్త్రాక్షిసంఖ్యాగణనపరిభవై రోదితే సానుకమ్పా ।**
**దేవీ దృష్ట్వా స్వసూనోశ్చరితమపి యదీయాజ్ఞయా హేమకూటే**
**వాచా సప్రేమభాజావతనుత తనయౌ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 196**

హేమకూట పర్వతంలో సుబ్రహ్మణ్యస్వామి వినాయకుని తొండాన్ని తన చేతులతో కొలిచి, దానిని గూర్చిన పల్కిన మాటలవల్ల (వినాయకుడు), సుబ్రహ్మణ్యస్వామి తన ముఖాలను కన్నులను వినాయకుడు లెక్కించినందువల్ల కల్గిన అవమానంచేత, వారిరువురు ఏడ్చేటపుడు, వారిపట్ల దయకల్గిన గౌరీదేవి దానిని తెలిసికొని, పరమేశ్వరుని ఆజ్ఞతో వారికి హితాన్ని పల్కి, ఆ ఇద్దఱు పుత్రులను పరస్పరం ప్రీతికల్గినవారినిగా చేసింది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 196

**శ్లో॥ స్వామిన్! మాస్త్వాధిపత్యం శమనపదమహారాజ్యభారే మమాలం**
**పాశం దణ్డశ్చ వాహం మహిషమపి భటాన్త్వత్పదేఽద్యార్పయేఽహమ్ ।**
**ఇత్యుక్త్వాగ్రే నతాస్యం శివయజనపరకర్షకుప్యద్గణేన్ద్రో-**
**ద్విగ్నం దృష్ట్వా యమం యోఽప్యకురుత ముదితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥197**

"స్వామీ! ఇక నాకు యమరాజధానికి పతిగా ఉండే స్థితి వద్దు. నా పాశం, దండం, వాహనమైన మహిషం, భటులు – అనే వీనిని అన్నిటిని ఇపుడు నీ పాదాలలో అర్పిస్తున్నాను–" అని తన ముందు పల్కి నమస్కరించినవాడు, శివపూజను చేసే భక్తుని ప్రాణాలను హరించిన కారణంగా కోపించిన శివభటులచే హింసను పొందినవాడైన యముని పరమేశ్వరుడు "ఇక నా భక్తుల వద్దకు పోకు" అని పల్కి, అతనిని సంతోషింపజేసినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 197

**శ్లో॥ పిత్రోః దుఃఖైకహేతుం కమఠనిభతనుం పాపజాం స్వాం ప్రమోక్తుం**
**వార్ధౌ స్థిత్వా నిరున్ధన్ రథమపి తరణేస్తన్ముఖాద్యస్య విద్యామ్ ।**
**లబ్ధ్వా జప్త్వాథ భూత్వా సురయువతిసమాహ్లాదిసౌన్దర్యకాయో**
**రాజాస్వామాత్యపుత్రీపరిణయ మకరోత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥198**

ఒక రాజకుమారుడు తన తల్లిదండ్రులకు దుఃఖాన్ని కల్గించేది, పాపంవల్ల కల్గినది అయిన తన కర్మరూపశరీరంనుండి విముక్తిని పొందడంకోసం సముద్రాన్నిచేరి, సూర్యాభిముఖంగా ఉండి, పరమేశ్వరుని (చిదంబరవిద్యా) మంత్రాన్ని పొంది, జపించి, తత్కారణంగా దేవకన్యలచే అభిలషింపబడే, అందం కల్గిన శరీరాన్ని కల్గినవాడై, తన మంత్రికుమార్తెను వివాహమాడాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 198

**శ్లో॥ కిం దారైః కిఞ్చ పుత్రైః కిమితి చ వసుభిః కిం సుహృద్భిః కిమన్యైః
భూయాన్నాస్త్యేవ సత్యం ఫలమితి హృదయే సన్తతం చిన్తయన్తః ।
త్యక్త్వా దుఃఖాదిహేతుం యదమలవసుధాప్రాన్తకప్తా శ్రమాస్తే
సిద్ధాస్సర్వే బభూవుర్యదనుగతధియః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 199**

"అందఱు సిద్ధులు, పత్నులు, పుత్రులు, ధనం, స్నేహితులు, ఇంకా ఉండే వారైన వీరివల్ల ఏమి ప్రయోజనం కల్గుతుంది?" అని మనస్సులో తలచి, దుఃఖాలకు కారణమైన వీనిని విడచి, పరమేశ్వరుని చిదంబరక్షేత్ర సమీపప్రదేశాలలో ఆశ్రమాలను నిర్మించుకొని, పరమేశ్వరుని ధ్యానిస్తూ నివసిస్తారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 199

**శ్లో॥ హేమాద్రిప్రాన్తభాగస్థలకమలవనాక్రీడనోద్యోగహంస-
వ్రాతాలోకాపదేశాత్ సవిధగతశివాహస్తగాఢోపగూఢమ్ ।
నానాకారానుభూతానుపమరతిసముత్కూజితార్యా కుచాగ్ర-
స్పర్శోన్మృష్టాలికాన్తస్థలసితభసితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 200**

మహామేరువు సమీపదేశంలో ఉండే మెట్టతామరల వనంలో క్రీడించే హంస సమూహాల చూచిన కారణంచేత సమీపానికి వచ్చిన అంబికచేత ఆలింగనం చేసికోబడిన వాడు, అనేక విధాలైన రూపాలతో అనుభవింపబడిన, గొప్ప ఉపరతిచేత ఉత్కూజితాలను (మధురమైన అవ్యక్తధ్వనులను) చేసే అంబికయొక్క కుచాగ్రస్పర్శచేత చెఱుపబడిన ఫాలంలోని విభూతిని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 200

**శ్లో॥ విష్ణో నైవాద్య దృష్టం భవతి చ సమయో వేదవాక్యార్థబోధే
బ్రహ్మన్ కాలో న చేషో హరిముఖవిబుధా గచ్ఛతాన్యత్ర యూయమ్ ।
ఆస్తాం వీణామునే సోఽప్యుపదిశతి పరం బ్రహ్మతత్త్వం మునీనాం
ఇత్యుక్త్వా తాన్ యదుక్త్యా త్వరయతి గణరాట్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥201**

"ఓ విష్ణూ! దర్శించడానికి ఇది సమయం కాదు. ఓ బ్రహ్మా! వేద వాక్యాల అర్థాన్ని తెలియడానికి ఇది కాలం కాదు. ఇంద్రాది దేవతలారా! మీరు మీరు ఇంక ఎక్కడికైనా వెళ్ళండి. ఓ నారదా! నీవీణను ఉండనీ, ఇపుడు పరమేశ్వరుడు సనకాది మునులకు బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశిస్తున్నాడు- " అని పల్కి ఆ దేవతలను, పరమేశ్వరుని ఆజ్ఞతో

నందికేశ్వరుడు ఆచోటునుండి తొలగి పోయేటట్లు చేస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 201

శ్లో॥ **యద్వర్షం మానుషాణాం తదపి చ దివసం దేవతానాం ప్రసిద్ధం**
**ప్రోక్తం తచ్చాపకుమ్భప్రథమయుగహరిస్త్రీషు మాసేషు షట్సు ।**
**ఆసన్యన్నృత్తమూర్తేరుదయముఖవరాభ్యర్చనాస్తే తమిన్ద్రా-**
**దృష్టాశాపాలపూర్వాఖిలసురవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 202**

మానవునకు ఒక సంవత్సరకాలం దేవతలకు ఒకదినం. ఇది ప్రసిద్ధం. ఆ మానవ వర్షంలోని మార్గశిర, మాఘ, చైత్ర, ఆషాఢ, శ్రావణ, భాద్రపదాలనే ఆఱు నెలలో గల మహాభిషేకపూజలు నటరాజమూర్తికి ఉషఃకాలం, కాలసంధి, ఉచ్చికాలం, సాయంరక్షకాలం, రెండవకాలం, అర్ధయామం – అనే ఆఱుకాలాలలోని పూజలు అవుతున్నాయి. అటువంటి, అష్టదిక్పాలకాది దేవతలచే స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 202

శ్లో॥ **యస్యేశస్యాంశభూతాశ్శరభవటుకరాడ్వీరభద్రాదిదేవాః**
**కల్పేకల్పేఽమ్బుజాక్షద్రుహిణముఖధృతక్రూరసత్వోగ్రకృత్యమ్ ।**
**నిఘ్నన్తస్సార్వకాలం జగదపి సకలం పాలయన్తోఽన్తరజ్ఞే**
**ధ్యాయన్తో యం జయన్తి ప్రసృమరమహసం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥203**

పరమేశ్వరుని అంశనుండి ఆవిర్భవించినవారైన శరభుడు, భైరవుడు, వీరభద్రుడు మొదలైన దేవతలు ఒక్కొక్క కల్పంలోను విష్ణువు, బ్రహ్మ మొదలైన దేవతల క్రూరకృత్యాలను అడ్డుకొని, లోకాన్ని ఎల్లప్పుడూ రక్షించి, హృదయంలో ఆ పరమేశ్వరుని ధ్యానిస్తూ ప్రకాశిస్తున్నారు. అటువంటి, అధికమైన కాంతిని కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 203

శ్లో॥ **కుప్యత్తాతోక్తిభఙ్గ్యవిపినమధిగమన్ విప్రగోసంఘరక్షాం**
**కుర్వన్ తత్రైవ దిష్ట్యా సరసి చ విహృతిం తన్వతీనాం సురీణామ్ ।**
**గాయన్తీనాం మనాంసి స్వవశమపి నయన్ యత్పదధ్యానయోగాత్**
**రేజే కశ్చిన్నరేన్ద్రో జితరిపునికరః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 204**

ఒక రాజకుమారుడు (రాజ్యాన్ని కోల్పోయిన కారణంచేత కోపాన్ని పొందిన) తండ్రి మాటచేత అరణ్యానికి పోయి, అక్కడ ఒకముని పశువులను రక్షించేవాడై, దైవవశం వల్ల సరస్సులో స్నానం చేసేవారు, గానం చేసేవారైన దేవకాంతలను తనవశం చేసికొని, పరమేశ్వరుని చరణాల ధ్యానంతో శత్రువులను జయించి వెలిగాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 204

**శ్లో॥ సౌవర్ణశ్మశ్రుకాన్త్యా కపిశకుముదినీనాథబిమ్బం విజేతుం**
**నాసాలోలమ్బభూషామణిరుచిభిరివ ప్రోన్నటద్దివ్యసిన్ధుమ్ ।**
**మూర్ధ్నా భిభ్రాణమచ్ఛచ్ఛవిముఖకమలామోదపుష్పంధయాక్షం**
**నానావిద్యాంకురాభద్విజగణలసితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 205**

బంగారు వన్నెను కల మీసాల కాంతితో బంగారు గన్నేరు వర్ణమైన చంద్రబింబాన్ని తన ముఖంలో కల ఆభరణాల శోభతో జయించడం కోసం అనేటట్లు, చలించే గంగను శిరస్సులో ధరించినవాడు, చాలా తెల్లని ముఖమనే తామరపూవులో వాలిన తుమ్మెదవంటి నేత్రాలను కలవాడు, అనేక విద్యల అంకురాలవంటి దంతాలతో ప్రకాశించే వాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 205

**శ్లో॥ జ్వాలామాలాన్తరాలప్రవిలసదమలస్వాఙ్గలోలమ్బచేలా**
**మూలాలగ్నాలిశిల్పోల్లలితకటిరటత్కిఙ్కిణీజాలభూషమ్ ।**
**నైలీహాలాహలాభాకబలితజలముక్తారకోలాహలోద్యత్-**
**కేలీమయూరలాస్యప్రముదితలలనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 206**

అగ్నిజ్వాలల నడుమ వెలిగే పరిశుద్ధమైన తన అవయవాలలో చలించే వస్త్రాల అగ్రభాగంలో సంబంధం కల్గిన తుమ్మెదల సమూహం వంటిది, నడుములో కట్టబడినది అయిన కింకిణీభూషణాలను కల్గినవాడు, తన కంఠంలో ఉండే నీలమైన హాలాహల విషంయొక్క కాంతితో, కబళించిన మేఘాల శబ్దాలతో సంతోషాన్ని పొంది క్రీడించే మయూరాల నృత్యాలతో సంతోషించిన అంబికతో కూడి ఉండేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 206

**శ్లో॥ యో యస్య జ్ఞానశక్తిం దహరకుహరణీం శ్రీమహాషోడశార్ణాం**
**విద్యాం శ్రీనాథవీరైః గురుభిరపి నుతాం యోగినీదూతిసేవ్యామ్ ।**
**ఆత్మాఽభిన్నాం శివాం తాం హృది పరిచినుతే సః స్వయం నిర్వికల్పో**
**భూత్వా యోగీన్ద్రపూజ్యో భవతితమగుణం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥207**

పరమేశ్వరుని జ్ఞానశక్తి రూపమైనది, దహరాకాశంలో వెలిగేది, శ్రీనాథ వీరులచే స్తుతింపబడినది, యోగినీదూతీ సమూహాలతో సేవింపబడేది, ఆత్మకంటే వేఱు కానిది, ప్రసిద్ధి అయినది, శ్రీషోడశాక్షరీ మంత్రాధిదేవత, సర్వమంగళాకార అయిన విద్యను ఎవడు హృదయంలో ఉపాసిస్తాడో, అతడు నిర్వికల్పుడై, యోగి శ్రేష్ఠులచే పూజింపబడే వాడుగా అవుతున్నాడు. అటువంటి, గుణాలను లేనివాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 207

**శ్లో॥ యచ్ఛమ్భోర్నృత్తరఙ్గం పితృభువనమభూత్కాలకూటం చ భిక్షా**
**భూషా నాగావిభూతిర్మలయభవరజో బ్రహ్మశీర్షం కపాలమ్ ।**
**అద్రిశ్శయ్యా చ వస్త్రం త్వగపి సహకృతాభూతభేతాలవర్గా**
**వాహశ్చోక్షాపతిస్తం ధృతహరివిశిఖం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 208**

శంభువైన పరమేశ్వరునకు శ్మశానం – నాట్యంచేసే చోటు, కాలకూటమనే విషం – ఆహారం, సర్పాలు – భూషణాలు. విభూతి – సువాసనను కల్గించే మైపూత. బ్రహ్మకపాలం – ఆహారపాత్ర. పర్వతం – శయనించే చోటు. తోలు – వస్త్రం. భూత భేతాళాదులు – సహవాసం చేసేవారు. ఎద్దు – వాహనం, ఇటువంటి, విష్ణువును బాణంగా కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 208

**శ్లో॥ వాసిష్ఠబ్రహ్మదణ్డప్రముషితసుధనుర్బాణసేనాసమూహో**
**బ్రహ్మణ్యప్రాప్తికామో రచితవరతపాః కౌశికః క్షత్రవర్యః ।**
**తుష్టస్వాయమ్భువాస్య ప్రభవితసవితృఖ్యాతయచ్ఛక్తి విద్యా**
**ప్రాప్తస్వేష్టానుభావో భువి జయతితరాం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥209**

వశిష్ఠుని బ్రహ్మదండం అనే అస్త్రంతో వ్యర్థాలైన విల్లు, బాణాలు, సేనలు – అనే వీటి సమూహాలను కలవాడు, బ్రాహ్మణుడు కావాలని కోరినవాడు, ఘోరతపస్సును చేసినవాడు, క్షత్రియశ్రేష్ఠుడు అయిన కౌశికుడు (విశ్వామిత్రుడు – తీవ్రమైన తపస్సు

చేసినందువల్ల) సంతోషాన్ని పొందిన బ్రహ్మముఖం నుండి వెలువడిన సావిత్రి అనే పేరు కల, పరమేశ్వరుని శక్తి అయిన గాయత్రీమంత్రంయొక్క ఉపాసనతో తన అభీష్టాన్ని (బ్రాహ్మణత్వాన్ని) పొంది, భూమిలో గొప్పగా వెల్గుతున్నాడు (కీర్తింపబడుతున్నాడు.) అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 209

---

**శ్లో॥ యాతాయాతాదిహీనం యమనియమపరప్రార్థితబ్రహ్మతత్త్వం**
**యజ్ఞం యజ్ఞాగ్నిరూపం యజనకరబుధైరీడ్యమానం త్రిసంధ్యమ్ ।**
**యాథార్థీకారలీనాఖిలభువనమజం యామనీశానచూడం**
**యచ్ఞాకాపాట్యహీనం యతివరవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥210**

రాకపోకలు లేనివాడు, యముని యమాదులను అనుష్ఠించే యోగులచే ఆశపడే బ్రహ్మతత్త్వం కలవాడు (తెలిసినవాడు), యజ్ఞరూపి, యజ్ఞంలోని అగ్నిరూపి, యాగాన్నిచేసే విద్వాంసులచే మూడుకాలాలలో స్తుతింపబడేవాడు, నిజమైన రూపంలో మఱగుపడిన సకల లోకాలను కలవాడు, జన్మరహితుడు, చంద్రుని శిఖలో ధరించేవాడు, ప్రార్థించేవానిపట్ల కపటంలేనివాడు, సన్న్యాసులచే స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 210

---

**శ్లో॥ విశ్వేశం విశ్వవన్ద్యం వివిధభయహరం విశ్వరూపం వృషాఙ్కం**
**విష్ణుం విన్ధ్యారికాన్తాముఖరమునిసతీ పూజితాఙ్ఘ్రిం విరాగమ్ ।**
**విద్యావిశ్రాన్తిభూమిం విధుధరమకుటం వ్యాప్తకేశం వినాశం**
**స్థిత్యుత్పత్త్యాదిహేతుం వికృతిమవికృతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥211**

లోకానికి ఈశ్వరుడు, లోకాలచే నమస్కరింపబడేవాడు, (లోకాలకు కలిగే) అనేక విధాలైన ఉత్పాతభయాలను పోగొట్టేవాడు, విశ్వరూపుడు, (గొప్పరూపాన్ని కలవాడు), వృషభాన్ని చిహ్నంగా కలవాడు, విష్ణురూపుడు (అంతటా వ్యాపించి ఉండేవాడు), అగస్త్యపత్ని అయిన లోపాముద్ర మొదలైన మహర్షిపత్నులచే పూజింపబడేవాడు, ఆశ లేనివాడు, జ్ఞానంయొక్క (విద్యలయొక్క) అవధి, చంద్రుని శిరస్సులో కలవాడు, వ్యాపించిన కేశాలను కలవాడు, సృష్టిస్థితిరక్షణలకు కారణభూతుడు, వికారాన్ని కలవాడు, వికారం లేనివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 211

---

**శ్లో॥ కేల్యామౌత్సుక్యభాజా తుహినగిరిజయా సస్పృహం దత్తవీటీ**
**సేవారక్తాధరోష్ఠద్యుతిజితదినకృద్బాలబిమ్బాంశు చక్రమ్ ।**
**గీతీ ప్రావీణ్యశైలీ ప్రకటనకుతుకాత్ హస్తావాస్తవ్యలోలాం**
**వీణాం సంవాదయన్తం ప్రథమరసమయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥212**

క్రీడలో సంతోషాన్ని పొందిన హిమవంతుని కుమార్తె అయిన అంబికచే ఆశగా ఇవ్వబడిన తాంబూలసేవనం చేత ఎఱ్ఱని అధరాల కాంతితో జయించిన బాలసూర్యుని కాంతి సమూహాన్ని కలవాడు, సంగీతంలోని ప్రావీణ్యశైలిని ప్రకటించాలనే ఆసక్తిచేత వీణను మీటేవాడు, శృంగారరసస్వరూపి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 212

(వీణను ధరించిన నటరాజమూర్తి రూపం **కాశ్యపశిల్పంలో** తెలుపబడింది. ఇటువంటి ఇంకా అనేక రూపభేదాలను చూడవచ్చు.)

---

**శ్లో॥ అశ్వత్థామా కృపార్యో బలిరపి హనుమాన్ కుమ్భకర్ణానుజాతో**
**వ్యాసర్షిర్జామదగ్న్యోఽ పృథిగతయశసస్సప్తధీరా మహాన్తః ।**
**యత్పాదాబ్జార్చయాఽఽపుర్జనిమదసులభం శ్రీచిరంజీవిభావం**
**తం కృష్ణశ్వేతరక్తద్యుతిమతికరుణం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 213**

అశ్వత్థామ, కృపాచార్యుడు, బలి, హనుమంతుడు, విభీషణుడు, వ్యాసుడు, పరశురాముడు – అనే నామాలను కలవారు, ప్రసిద్ధులు, ధీరులైన ఏడుగురు మహాత్ములు పరమేశ్వరుని పాదపూజతో అన్య ప్రాణులవల్ల పొందరాని చిరంజీవిత్వాన్ని పొందారు. అటువంటివాడు, నలుపు, తెలుపు, ఎరుపు – అనే మూడువిధాలైన కాంతులను కలవాడు, అధికమైన కరుణను కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 213

---

**శ్లో॥ జాయా దానప్రకుప్యత్స్వజనకృతరణావేశకాలే ప్రసన్నం**
**యం దృష్ట్వా నేత్రవారిస్నపితతనులతాభోగసాతఙ్కకమ్పః ।**
**యస్యాఙ్ఘ్రిం ధ్యానభానుప్రకటివిభవో వైశ్యజో భక్తవర్యో-**
**ప్యధ్యారూఢోవృషేన్ద్రం రజతగిరిమగాత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥214**

తన పత్నిని దానంచేసినందువల్ల కోపాన్ని పొందిన తన బంధువులతో యుద్ధం చేసేటపుడు తనపట్ల ప్రసన్నుడైన పరమేశ్వరుని చూచి, కన్నీటితో తడుపబడిన శరీరంతో

భయాన్ని పొందిన హృదయంతో పరమేశ్వరుని పాదాన్ని భావించడమనే సూర్యునిచే ప్రకాశింపజేయబడిన వైభవాన్ని కలవాడు, వైశ్యుడు, గొప్ప భక్తుడు ("**ఇయఱ్పకైనాయనార్**") వృషభంపై ఎక్కి కైలాసాన్ని పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 214

---

**శ్లో॥ త్యక్తస్వాధికారాస్సరసిజనయనా శ్చాగతం దేవసౌఖ్య-**
**ప్రాప్త్యై గోవిన్దముక్త్వా కుశలమపి కరాశ్లేషపూర్వం ప్రమోదాత్।**
**వత్స త్వం బ్రహ్మతత్త్వం హృది న వికలయన్ ప్రార్థ్యసే దుఃఖహేతుం**
**కర్మేఽత్యుద్బోధయన్తో యమపి గిరివరే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥215**

దేవతలకు అసురులవల్ల కల్గిన ఉపద్రవాలను పోగొట్టి, సౌఖ్యాలను కల్గించగోరి, కైలాసగిరిని చేరిన (ఆకల్పంలోని) విష్ణువును చూచి ఆ కైలాసపర్వతంపై నివసించే పూర్వకల్పాలలో విష్ణువై ఉన్న ప్రాచీనవిష్ణువులు ఆలింగనం చేసికొని, కుశలప్రశ్నలను చేసి, సంతోషంతో బ్రహ్మతత్త్వాన్ని మనస్సులో తలచకుండా దుఃఖానికి కారణమైన ఈ కర్మను పరమేశ్వరుని వద్ద ప్రార్థిస్తున్నావా? అని అడిగి, ఆ పరమేశ్వర తత్త్వాన్ని బోధిస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 215

---

**శ్లో॥ భో భో బ్రహ్మర్షివర్యాః సదయమపి మయా శిక్షితాశ్చాప్యజస్రం**
**వేదాన్తే తత్త్వబోధే న భవత విబుధా యత్తతోఽద్యాపి యూయమ్ ।**
**మేధా ప్రాప్త్యై సభేశం వ్రజత శరణమిత్యాదరాద్బోధయిత్వా**
**ధాతా యత్క్షేత్రరాజం మునిగణమనయత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥216**

బ్రహ్మదేవుడు, తనవద్ద వేదాధ్యయనాన్ని చేసే మునివరులను ఉద్దేశించి, "ఓ బ్రహ్మనిష్ఠులారా! నాచే ఎల్లప్పుడు అధ్యయనం చేయించబడేవారుగా మీరు ఉన్నప్పటికీ మీరు వేదాంత తత్త్వజ్ఞానాన్ని తెలిసే విషయంలో మీరు పండితులు కానందువల్ల, మేధను పొందగోరి, నటరాజస్వామిని శరణంగా పొందండి" అని పల్కి, నటరాజమూర్తియొక్క చిదంబరక్షేత్రాన్ని ఆ మునులు చేరేటట్లు చేశాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 216

---

**శ్లో॥ గీర్వాణాద్రిం కదాచిద్విపులరదనయోరన్తరే స్వర్ణరమ్భా-**
**భ్రాన్త్యా సంధార్యవేగాద్రజతగిరివరే క్రీడయన్తం గణేశమ్ ।**
**దృష్ట్వా ప్రేమ్ణాఽద్రిజాతా యమపి చ తరసాఽఽహూయ నిర్దిశ్య సూనోః**
**వృత్తం తుష్టాఽభవత్తం దివిషదధిపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥217**

ఒకానొక సమయంలో దేవగిరి అయిన మహామేరుపర్వతాన్ని విశాలమైన రెండు దంతాల (కొమ్ముల) మధ్య బంగారు అరటిచెట్టు అనే భ్రాంతితో ధరించి వేగంగా కైలాసపర్వతంతో క్రీడించే వినాయకుని చూచి అంబిక, ప్రీతితో, వేగంతో పరమేశ్వరుని పిలిచి, కుమారుని క్రీడను చూపించి, సంతోషాన్ని పొందినది అయినది. అటువంటి, దేవతలకు అధిపతి అయిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 217

**శ్లో॥ సోత్సాహం వీరబాహుప్రముఖసఖియుతో దోర్భిరబ్ధిం షడాస్య-**
**స్తీర్త్వా పూర్వక్షమాభృత్ శిఖరమధిజుషం బాలమార్తాణ్డబిమ్బమ్ ।**
**చోలీమానీయమానో ధురి చ విరచయన్ సైంహికే యస్య లీలాం**
**యద్వాచా సంవ్యధాత్తం నభసి చ పరమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥218**

సుబ్రహ్మణ్యుడు, వీరబాహువు మొదలైన స్నేహితులతో కలిసి సముద్రాన్ని చేతులతో ఈది దాటి, చాలా సంతోషంతో ఆ సముద్రానికి తూర్పుదిక్కులో ఉండే పర్వతాగ్రంపై ఉదయించే లేత సూర్యబింబాన్ని తన చేతిసంచిలోపల పెట్టి, రాహువు యొక్క ఆటను ఆడేవాడై, పరమేశ్వరుని మాటతో ఆ సూర్యుని ఆకాశంలో విడిచిపెట్టాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 218

**శ్లో॥ సద్వ్యోమ వ్యాపితారప్రవలయవిలసద్జ్ఞానవాఞ్ఛాక్రియాది-**
**శ్రీమచ్చిచ్ఛక్తి విద్యాహృతవిపులతమో రాజసం సద్భకుంసమ్ ।**
**గాఢాఽవిద్యాకవాటోన్నయనశమముఖద్వారపాలాభిగోప్యన్**
**మోక్షద్వారాన్తరంగోపనిషదుపచితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 219**

సద్రూపమైన ఆకాశాన్ని వ్యాపించిన, ఓంకారమయమై - ప్రకారంతో ప్రకాశించేది జ్ఞాన - ఇచ్ఛా - క్రియాది - చిత్ శక్తులతో పోగొట్టబడిన దట్టమై తమస్సును (అజ్ఞానాన్ని) కల్గినదైన రాజసభలో నటనం చేసేవాడు, దట్టమైన అజ్ఞానమనే తలుపును తెరిచే శమదమాది

వాకిటి కాపలాదారులచే రక్షింపబడే మోక్షద్వారం లోపల భాగంలో ఉండే ఉపనిషత్తులచే దర్శింపజేయబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 219

---

**శ్లో॥ ఆవిఃస్మేరాననస్య ద్యుతిభిరభినవైః పాణిపద్మాన్తరాల-**
**ప్రోద్యత్కాన్తిప్రరోహైర్నభసి చ రచయన్ జాలమహ్నాం పతీనామ్ ।**
**నవ్యామమ్భోదమాలామధిధరణిరుచా పార్శ్వగాయాశ్శివాయాః**
**చిత్రం యో నానటీతి భ్రమరనటనకృత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥220**

మందహాసంతో కూడిన ముఖకాంతులతోను, నూత్నంగా పూచిన తామరపూవువంటి చేతుల మధ్యలో పుట్టే కాంతిమొలకల (ప్రసారాల) తోను, ఆకాశంలోని సూర్య సమూహాలను, వామభాగంలో ఉండే అంబిక యొక్క కాంతితో నూతనమైన మేఘమాలను భూమిలోకూడా రచిస్తూ, పరమేశ్వరుడు ఆశ్చర్యకరమైన తాండవాన్ని చేస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 220

---

**శ్లో॥ అచ్ఛామచ్ఛిన్నధారామమృతకరరుచీర్వర్షయన్ లబ్ధకామాం**
**దీనామత్యన్తఖిన్నాం రతిమపి ముదితాం సంవ్యధాదీశ్వరో యః ।**
**యద్రఙ్గాఖణ్డలాశామధిగతపరమానన్దకూపామ్బుపానాత్**
**వాచాలత్వం ప్రపన్నాస్సురగురుముఖరాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥221**

పరమేశ్వరుడు తన తలలో ఉండే చంద్రుని కాంతితో స్వచ్ఛంగాను, నాశం పొందనిదిగాను ఉండే అమృతధారను వర్షిస్తూ, దుష్కర్మను, మిక్కిలి దుఃఖాన్ని పొందిన రతీదేవి ఇష్టాన్ని (తనపతిని) పొందినది, సంతోషాన్ని పొందినదిగా చేశాడు. ఆ పరమేశ్వరుని చిత్సభలో తూర్పుదిక్కులో ఉండే పరమానందమాపమనే బావిలోని తీర్థాన్ని పానం చేసినందున దేవగురువు మొదలైన పెద్దలు విద్వాంసులుగా అయ్యారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 221

---

**శ్లో॥ ఓంకారస్వర్ణసంసత్ప్రసృతపరశివవాచ్యోతిరానన్దనృత్తా-**
**ఽఽలోకాదుత్తీర్ణముగ్రం భవమతివిపులం వార్ధికల్పం మునీన్ద్రైః ।**
**ఊహాపోహాదిహీనస్వతనుగతజగద్భ్రాన్తమధ్యాత్మవిద్యా-**
**బోధాచార్యం పురాణప్రశమితతమసం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 222**

ప్రణవరూపమైన స్వర్ణసభలో ప్రకాశించే పరమశివుని జ్యోతిరూపమైన ఆనందనర్తనం యొక్క దర్శనంచేత భయంకరమైనది, మిక్కిలి పెద్దది, సముద్రతుల్యమైనది అయిన సంసారబంధం మునులచే దాటబడినది. (తీర్చుకోబడినది) భావించడానికి సాధ్యం కాని తన తిరుమేనిని పొందిన అఖిల ప్రపంచాలను కలవాడు, వేదాంతశాస్త్రానికి ఆచార్యుడు, తమస్సును పోగొట్టినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 222



**శ్లో॥ దక్షాద్వామాచ్చ పృష్ఠాత్ ద్రుహిణహరిహరాన్ సర్వం సంపత్సమృద్ధాన్**
**కల్పారమ్భే య ఈశోఽప్యనితరసులభస్వేచ్ఛయా సప్రమోదమ్ ।**
**సృష్ట్వా సంసృష్టిరక్షాలయకరణవిధౌ యోజయిత్వాను వాణీ-**
**లక్ష్మీగౌరీతి శక్తిత్రయమపి చ దదౌ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 223**

పరమేశ్వరుడు కల్పారంభకాలంలో తన ఇచ్ఛతో సంతోషంతో కుడిభాగం నుండి, ఎడమవైపు నుండి, పృష్ఠభాగంనుండి, సంకల సంపత్తులతో కూడిన బ్రహ్మ, విష్ణు, రుద్రులను సృష్టించి, వారికి సృష్టి, స్థితి, సంహారాలనే మూడుకార్యాలకు నియోగించి, సరస్వతి, లక్ష్మి, గౌరి - అనే ముగ్గురు శక్తులను వారికి ఇచ్చాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 223



**శ్లో॥ కాచిన్నాలాయనీతి ప్రథితమునిసతీ భర్తురిష్టానుకూలా**
**మాణ్డవ్యప్రోక్తశాపజ్వలనశమనకృద్దర్దినశ్రీవిలాసా ।**
**యన్మన్త్రధ్యానయోగాదనితరసులభాన్ పఞ్చకాన్తాన్ నరేన్ద్రాన్**
**లేభే జన్మాదిహీనం శివపదమపి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 224**

ప్రసిద్ధులైన మౌద్గల్యముని పత్ని అయిన నాలాయనీ అనే పేరును కల ఒక పతివ్రతా స్త్రీ, పత్నికి సేవచేసేదిగాను, మాండవ్యమునిచే తనకు ఇవ్వబడిన శాపాన్ని తన పాతివ్రత్య ఫలంతో పోగొట్టుకొన్నది, పరమేశ్వరుని మంత్రధ్యానయోగం వల్ల ఇతరులకు పొందడానికి వీలుకానివారైన అయిదుగురు భర్తలను, చివరలో శివపదాన్ని పొందింది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 224



**శ్లో॥ సింహస్కన్ధాధిరూఢం సితవసనధరం సిన్ధుసమ్బద్ధశీర్షం**
**సిఞ్చన్మాధ్వీమధూకప్రముఖసుమగణోద్దామభూషామనోజ్ఞమ్ ।**

**సిద్ధాతిత్యాహివిద్యాధరపితృదివిషద్దైత్యగన్ధర్వయక్షో**
**రక్షో యోగీన్ద్రసాధ్యాఖిలజనవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 225**

సింహాన్ని అధిరోహించినవాడు, తెల్లని వస్త్రాన్ని ధరించినవాడు, గంగను ధరించిన వాడు, తేనె ఒలికే పుష్పమాలికలను అలంకరించుకొన్నవాడు, సిద్ధులు, ఆదిత్యులు, నాగులు, విద్యాధరులు, పితృదేవతలు, దేవతలు, అసురులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, యోగీంద్రులు, సాధ్యులు మొదలైన సమస్త జనులచే స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 225

---

**శ్లో॥ ప్రత్యాహారాదియోగై ర్హృదయకమలతో బ్రహ్మరన్ధ్రం స్వకీయం**
**ప్రాణానానీయ దివ్యం గణమపి శరదాం వాహయన్తో మహాన్తః ।**
**యోగీన్ద్రాస్సిద్ధవిద్యౌషధిమణిగులికాసేవయా వజ్రదేహాః**
**స్వాత్మానం యం భజన్తి జ్వలనవరదృశం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥226**

మహాత్ములైన యోగీశ్వరులు తమ ప్రాణవాయువులను ప్రత్యాహారం మొదలైన యోగాలతో హృదయంలో నుండి బ్రహ్మరంధ్రాన్ని పొందించి, అనేక వర్షాలకాలం గడిపి, సిద్ధించిన విద్యలు ఓషధులు, మణులు, గుళికలు – అనే వీనిని సేవించడంవల్ల వజ్రానికి సాటివచ్చే దేహాలను పొంది, ఆత్మస్వరూపి అయిన పరమేశ్వరుని సేవిస్తున్నారు. అటువంటి, అగ్నినేత్రుడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 226

---

**శ్లో॥ సానావస్మిన్ కిమర్థం వసత సురవరా గచ్ఛతాద్యాఖిలేశ-**
**క్షేత్రాధారం ధరాయా హృదయకమలగం పుణ్డరీకాభిధానమ్ ।**
**క్షేత్రం తత్రైవ దేవో దశశతకలయా రాజతీతి ప్రియోక్త్యా**
**నన్దీ యద్దర్శనార్థం త్వరయతి చ గిరేః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 227**

నందికేశ్వరుడు కైలాసపర్వతసానుప్రదేశంలో నివసించే దేవతలను ఉద్దేశించి, “ఓ దేవతలారా! ఈచోట ఎందుకు నివసిస్తారు? భూమికి హృదయకమలంలో ఉన్నది, అఖిలక్షేత్రాలకు ఆధారమైనది, పుండరీకమనే పేరును కల్గినది అయిన చిదంబర క్షేత్రాన్ని చేరండి. అక్కడ పరమేశ్వరుడు సహస్ర కళలతో వెల్గుతున్నాడు – అని ప్రియమైన వచనాలతో నటరాజస్వామి దర్శనాన్ని గూర్చి ఆ పర్వతంనుండి ఆ దేవతలు శీఘ్రంగా వెళ్ళేటట్లు ఆజ్ఞాపిస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 227

---

శ్లో॥ సృష్ట్యర్థం బ్రహ్మణా యస్స్తుతనిజవిభవస్తస్య లాలాటదేశాత్
ఆవిర్భూయ స్వతన్త్రో వికృతతనువరాన్ రుద్రవర్గాన్ గణేన్ద్రాన్ ।
సృష్ట్వా తాన్ ప్రేరయిత్వా జగదవనవిధౌ సర్వదా సర్వసంస్థో
ऽరక్షద్విశ్వాధికం తం నతజనసుఖదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేऽహమ్ ॥228

బ్రహ్మచే సృష్టికోసం స్తుతింపబడిన మాహాత్మ్యాన్ని కల్గిన ఏ పరమేశ్వరుడు, ఆ బ్రహ్మదేవును ఫాలంనుండి ఆవిర్భవించి, తన రూపాన్ని ధరించి, రుద్రులను, ప్రమథగణాలను సృష్టించి, వారిని సదా లోకాలను రక్షించేటట్లు ఆజ్ఞాపించి, తాను స్వతంత్రుడై, సర్వాంతర్యామి యై ఉండి, రక్షిస్తున్నాడో, అటువంటివాడు, విశ్వాధికుడు, తనకు నమస్కరించినవారికి సుఖాన్ని కల్గించేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 228

శ్లో॥ వాచాం కేలిష్వమన్దం దితిజదివిషదోర్ముష్టిముష్టీరణేऽబ్ధే-
స్తీరే జాతే సుధాఢ్యం ఘటమపి కలయన్ హస్తకోణే మురారిః ।
సమ్మోహ్యాద్యాన్ ద్వితీయానరచయదమృతాన్ కామినీకామినీనాం
భూత్వా యశ్శూలపాణే రనవధిదయయా కుఞ్చితాఙ్ఘ్రిం భజేऽహమ్ ॥229

ఏ పరమేశ్వరుని అంతులేని కృపతో మురారి అయిన విష్ణువు పాలసముద్రం తీరంలో క్రీడారూపమైన వార్తలతో దేవాసురుల మధ్య అధికమైన ముష్టియుద్ధం సంభవించే తరుణంలో, పూర్ణకలశాన్ని చేతిలో ధరించి, కామినులకుసైతం కామం కల్గించే స్త్రీ (మోహినీ) రూపాన్ని ధరించి, ఆ రూపంతో ఆద్యులైన అసురులు మోహించే రీతిలోను, దేవతలకు అమృతపానం చేసిన వారినిగాను చేశాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 229

శ్లో॥ పద్మే మాస్త్వద్య లీలాఫణిపతిశయనం వైనతేయోపి నాలం
భూమి త్వం శీఘ్రమాయాహ్యహమపి నటనే తిల్లవన్యాం పురారేః ।
హస్తాభ్యాం వాదయిష్యామ్యహహ చటుతరం మద్దలం చేత్యుదీర్య
ప్రాయాద్యద్రఙ్గమాదౌ హరిరపి తమజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేऽహమ్ ॥230

"ఓ లక్ష్మీ! ఇపుడు క్రీడించవద్దు. సర్పశయనం వద్దు. గరుడుడు వద్దు. ఓ భూమి! త్వరగారా! నేను తిల్లైవనంలో పురారియొక్క నటనంలో చేతులతో మిక్కిలి సామర్థ్యంతో మద్దెలను వాయించాలని వెడుతున్నాను." అని పల్కి విష్ణువు పరమేశ్వరుని సభను చేరాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 230

శ్లో॥ పశ్యేదం స్వర్ణశృంగం మమ సదనవరం గౌరి! కేదారసంజ్ఞం
కాశీం కాఞ్చీపురీమయ్యరుణగిరివరం శ్వేతకాన్తారదేశ్యమ్ ।
వేదారణ్యం చ సేతుం ముహురపి వృషభం యోఽధితిష్ఠన్ ప్రియాయై
నిర్దిశ్యాప్నోతి నైజం నిలయమనుదినం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 231

పరమేశ్వరుడు ప్రతిదినం వృషభం అధిరోహించి తనకు ప్రియమైన అంబిక కోసం "స్వర్ణమయమైన శిఖరాలతో కూడిన నా ఆలయశ్రేష్ఠమిది. ఏ గౌరీ కేదారమనే పేరునుకల క్షేత్రం కాశి, కాంచీరపురం, అరుణాచల, శ్వేతారణ్యం, రామసేతు – అని ఒక్కొక్క క్షేత్రాన్ని చూడు" – అని చూపించి, తరువాత తన వాసస్థానమైన చిదంబరక్షేత్రాన్ని చేరతాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 231

శ్లో॥ స్వామిన్! భిక్షో భవేద్వా క్వ ను తవ నగరే పర్వతే వా వనే వా
వాసః కస్మాదిహ త్వం చరసి వద విభో! కుత్ర గన్తాసి భిక్షామ్ ।
కుర్వన్నత్రైవ తిష్ఠన్విరచయతు భవాన్ కేలిమస్మాభిరేవం
స్త్రైణం యం చాభ్యధావద్వనభువివివశం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥232

దారుకావనంలో ముని పత్నులప్రశ్నలు ఇందులో వివరింపబడుతున్నవి.

"ఓ భిక్షువైన స్వామీ! మీరు పట్టణంలోనా, పర్వతంలోనా, వనంలోనా, ఏచోట నివసిస్తున్నారు? ఎందువల్ల మీరిక్కడ సంచరిస్తున్నారు. ఎక్కడికి పోదలచారు? చెప్పండి. ఇక్కడ భిక్షచేసి, నివసించి, మాతోపాటు క్రీడించండి." – అని ఈవిధంగా తమకు వశం కాని పరమేశ్వరుని దారుకావనంలో మునివరుల పత్నుల సమూహం పరమేశ్వరుని అరణ్యంలో పరివేష్ఠించింది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 232

శ్లో॥ వామా వామాఙ్గభాగో నయనమపి జటాః కుణ్డలౌ యజ్ఞసూత్రం
వాహో బాణశ్చ చాపధ్వజరథతురగా యస్య జాతా విచిత్రమ్ ।
సూతశ్చాపి స్ఫులిఙ్గైర్నిటిలనయనజైర్దాహయిత్వాణ్డజాలం
కల్పే కల్పే పునయస్సృజతి తదఖిలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 233

పరమేశ్వరునకు వామభాగం, నేత్రం, జటలు, రెండు కుండలాలు, యజ్ఞసూత్రం, వాహనం, అంబు, విల్లు, ధ్వజం, రథం, అశ్వాలు, సారథి – అనే ఇవి విచిత్రమైనవి. ఆ

పరమేశ్వరుడు ఫాలనేత్రంలో ఉండే అగ్ని స్ఫులింగాలతో ఒక్కొక్క కల్పంలోను అన్ని అండాలను దహించి, తిరిగి ఆ అండాలను సృష్టిస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 233

---

**శ్లో॥ పాదాఙ్గుష్ఠస్య యస్య ద్యుతికవచితదిక్చక్రవాలాన్తరాలే**
**బ్రహ్మా హంసం మురారిః కలశజలనిధిర్దేవరాజో గజేన్ద్రమ్ ।**
**స్వం ఛత్రం వాజపేయీ దినకరశశినౌ సైంహికే యశ్చ శుక్లం**
**వర్ణం శిల్పీ నితాన్తం మృగయతి సతతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥234**

పరమేశ్వరుని పాదంలోని అంగుష్ఠం యొక్క కాంతిచేత వ్యాపింపబడిన దిక్కులలో బ్రహ్మ హంసను, విష్ణువు పాలకడలిని, ఇంద్రుడు ఐరావతాన్ని, వాజపేయ యాగాల్ని చేసినవాడు తన శ్వేతచ్ఛత్రాన్ని, రాహువు సూర్యుని, చంద్రుని, శిల్పి శ్వేతవర్ణాన్ని సదా అన్వేషిస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 234

---

**శ్లో॥ జ్ఞానేచ్ఛాభ్యాం సఖీభ్యాం సహ రహసి ముదా నక్తమశ్రాన్తలీలో**
**భూత్వా ప్రాతస్సభాయామిహ కిము భవతస్సాహసం నన్దనీయమ్ ।**
**యాతు స్వర్గాపగాయా నికటతటమయం నార్థనీయో జనశ్చే-**
**త్యుక్త్వా సాచీకృతామన్వనయదగసుతాం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥235**

"జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి – అనే ఇద్దఱితో రాత్రివేళ సంతోషంతో చిరకాలం క్రీడించి, ప్రాతఃకాలంలో ఈ సభకు వచ్చిన మీ సాహసం ప్రశంసించదగినదే. గంగ సమీపానికి వెళ్ళండి. నేను కోరదగిన దానను కాను." అని ఈ విధంగా పల్కి తిప్పిన ముఖాన్నికల అంబికను (క్రియాశక్తిని) పరమేశ్వరుడు పూర్వకాలం (ఒకానొక సమయం) సమాధాన పఱచాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 235

---

**శ్లో॥ కల్పాన్తే వృద్ధభాజాం కబలితజగతాం సప్తవారాన్నిధీనాం**
**మధ్యే పాలాశశాయీ హరిరిహ పురుషో నాస్తి మత్తోఽపరోఽన్యః ।**
**ఏవం దర్పావలీఢేఽప్యనుపదముదితం శూలినం భైరవం యం**
**దృష్ట్వా భీత్యా ననామ స్తుతిభిరభినవైః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 236**

కల్పాంతంలో లోకం అంతా వ్యాపించిన ఏడు సముద్రాల నడుమ వటపత్రంలో

శయనించి హరి ఇక్కడ నాకంటే వేఱు పురుషుడు లేడు – అని గర్వం పొందినపుడు సమీపంలో ఆవిర్భావాన్ని పొంది శూలాయుధాన్ని ధరించిన భైరవరూపి అయిన పరమేశ్వరుని చూచి భయంతో, నూతన స్తుతులతో నమస్కరించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 236

---

**శ్లో॥ యత్సంహారాస్త్రవేగం ముహురపి హృదయే తర్కయన్నమ్బరాన్తే**
**ప్రాణత్రాణాయ యత్నం దశరథనృపతేర్యుద్ధరఙ్గే ప్రకుర్వన్ ।**
**రోహిణ్యాకారచక్రానుగతిమపి జహౌ సౌరిరర్కాత్మజాతః**
**తం దేవం రాహుకేతుగ్రహముఖవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥237**

సూర్యపుత్రుడైన శనీశ్వరుడు ఆకాశంలో సంభవించిన దశరథచక్రవర్తియొక్క యుద్ధరంగంలో పరమేశ్వరుని సంహారాస్త్రంయొక్క వేగాన్ని మనస్సులో మాటిమాటికి తలచి, ప్రాణాలను రక్షించడానికి యత్నిస్తూ, రోహిణ్యాకార చక్రగతిని విడిచిపెట్టాడు. అటువంటి దేవుడు, రాహువు, కేతువు మొదలైన గ్రహాలతో స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 237

---

**శ్లో॥ ఇన్దుర్యత్క్షేత్రసేవాసమసమయవలత్తిల్వవృక్షానిలానాం**
**స్పర్శాదున్మృష్టవర్ష్మా సురగురుయువతీసఙ్గజైః పాపరోగైః ।**
**యద్వక్త్రాలోకనేన స్వతనుపరిగలచ్చన్ద్రికాసారసిక్తాన్**
**సర్వాన్ లోకానకార్షీత్ శమనమదహరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥238**

చంద్రుడు పరమేశ్వరుని చిదంబరక్షేత్రాన్ని చేరిన కాలంలో వీచే తిల్లైవనంలోని గాలియొక్క సంబంధం చేత దేవగురుపత్నియొక్క సంగంచేత కల్గిన పాపరోగాలనుండి విముక్తిని పొందిన శరీరాన్ని పొంది, ఆ పరమేశ్వరుని ముఖ దర్శనంతో సర్వలోకాలను తన శరీరంనుండి వెలువడే కిరణ ప్రవాహాలతో తడిసినవిగా చేశాడు. అటువంటి, యముడు మదాన్ని అణచిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 238

---

**శ్లో॥ కాలిన్దీవీచిజాలైర్భువనమహిపతేర్నీతమానన్దభాజం**
**కాన్తం సీమన్తినీతి క్షితిపతితనయా కాచిదౌపాసనైస్తైః ।**
**సౌమ్యైరుద్దామకల్పైః ప్రముదితమనసో యస్య శమ్భోః ప్రసాదాత్**
**ప్రాపావైధవ్యయోగం సుఖమపి నిఖిలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥239**

సీమంతిని – అనే పేరును కల ఒక రాజకుమారి పలువిధాలైన ఉపాసనలతో సంతోషించిన శంబువనే పరమేశ్వరుని అనుగ్రహంచేత యమునానదిలోని తరంగాలతో పాతాళ లోకాన్ని పొందింపబడినవాడు, ఆనందాన్ని పొందినవాడైన తన పతిని, సర్వ సుఖాలను పొందింది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. ఈ కథ బ్రహ్మోత్తరఖండంలో తెలుపబడింది. 239

---

**శ్లో॥ విష్ణౌ నిర్జ్వాలచక్రే భ్రమితహృదివిధౌ భాస్కరే దన్తహీనే**
**శక్రేన్నిర్భిన్నగణ్డే హుతభుజి విశిఖే త్యక్తజీవేఽఖిలేఽన్యే ।**
**ఛిత్వా దక్షోత్తమాఙ్గం మఖభువి సగణం వీరభద్రం చరన్తం**
**దృష్ట్వా యోఽతోషయత్తం ప్రముదితహృదయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥240**

విష్ణువు జ్వాలలనులేని చక్రాన్ని కలవాడుగా, బ్రహ్మ భ్రమతో కూడినవాడుగా, సూర్యుడు రాలిన పళ్ళను కలవాడుగా, సూర్యుడు పగిలిన గండ (కపోల) భాగాలను కల వాడుగా, అగ్ని జ్వాలారహితుడుగా, ఇంకా ఇతరదేవతలు కోల్పోయిన జీవుని కలవారుగా అయిన సమయం యజ్ఞవాటికలో దక్షప్రజాపతి శిరస్సును ఖండించిన సంతోషంతో తన గణాలతోపాటు సంచరించే, వీరభద్రుని పరమేశ్వరుడు సంతోషించేటట్లు చేశాడు. అటువంటి, సంతుష్ట హృదయుడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 240

---

**శ్లో॥ సావిత్రీతి ప్రసిద్ధా నరపతితనుజా కాననాన్తః స్వభర్తుః**
**ప్రాణా నాహర్తుకామం సభటమపి యమం యస్య పూజాప్రభావాత్ ।**
**సమ్మోహ్యానమ్య తస్మాత్పతిమపి తనయాన్ రాజ్యమన్యాః సమృద్ధీః**
**లేభే తం కాలకాలం కటితటఫణినం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 241**

సావిత్రి అనే ప్రసిద్ధురాలైన రాజకుమార్తె అరణ్యంలో తనకు ముందుగా తన భర్త అయిన సత్యవంతుని ప్రాణాలను అపహరించ దలచినవాడు, భటులతో కూడినవాడైన యముని పరమేశ్వరుని పూజా ప్రభావంతో మోహించేటట్లు చేసి, నమస్కరించి, అతని వద్దనుండి తన భర్తను, పుత్రులను, రాజ్యాన్ని, సంపత్తులను పొందింది. అటువంటి, కాలనకు కూడా కాలుడు, నడుములో కటిసూత్రంగా కట్టబడిన సర్పాన్ని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 241

---

శ్లో॥ బ్రహ్మైవాహం శివోఽహం విభురహమమలశ్చిద్ఘనోఽహం వివిమాయః
సోఽహం హంసస్స్వతన్త్రస్తదహమతిజరః ప్రజ్ఞయా కేవలోఽహమ్ ।
ధ్యేయధ్యాతృప్రమాణైః గలితమతిరహం నిశ్చలోఽహం సదేతి
ప్రాజ్ఞా యచ్చిత్సభాయామతిశయమభజత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥242

"నేను బ్రహ్మనే, నేనే శివుడను, అంతటా వ్యాపించి ఉండే విభువును, పాపం లేనివాడను, జ్ఞానఘనుడను, మాయారహితుడను, హంసస్వరూపుడను, స్వతంత్రుడను, వార్ధక్యంలేని వాడను, కేవలం ప్రజ్ఞతో కూడినవాడను, ధ్యేయం, ధ్యాత, ప్రమాణం – అనే వీనికి అందనివాడను, సదా నిశ్చలుడను – అని ప్రాజ్ఞులు ఏ పరమేశ్వరుని చిత్సభలో ఆనందాతిశయాన్ని పొందుతారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 242

శ్లో॥ కాన్తారే జాతు కృష్ణో ద్విజరవిమణిహృత్ భల్లబన్దీకృతాయాః
సౌన్దర్యాన్నిర్జితాయాస్సురవరయువతీం జామ్బవత్యాః ప్రియాయాః ।
పాణిం జగ్రాహ యస్య ప్రతిదినయజనాత్కీర్తిమాశావిహారాం
లేభే తం సర్వవిద్యాలయకరనటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 243

శ్రీకృష్ణుడు ఒకానొక సమయం అరణ్యంలో ఒక బ్రాహ్మణుడు సూర్యుని వద్దనుండి పొందిన శ్యమంతకమణిని అపహరించిన భల్లూకాన్ని సంహరించి, దానిచే బందీ చేయబడినది, తన అందంతో దేవతా స్త్రీలను జయించేది అయిన జాంబవతి అనే కన్యను పరమేశ్వరుని నిత్యార్చనా వైభవంతో పాణిగ్రహణం చేసికొన్నాడు. అన్నిదిక్కులలో వ్యాపించిన కీర్తిని పొందాడు. అటువంటి, సర్వవిద్యలకు స్థానమైన నర్తనను కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 243

శ్లో॥ మాలాదిగ్బన్ధపూజాకవచవరమహాయన్త్రవిద్యారహస్య-
శ్రీమత్సాహస్రనామస్తవపరివిలసద్యన్నవాఙ్గాని పూర్వన్ ।
సూతశ్రీజైమినిభ్యాం రహసి సకరుణం ప్రోక్తవాన్ దీక్షయిత్వా
పారాశర్యో మహర్షిః శ్రుతివిభజనకృత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 244

పూర్వం ఒకానొక సమయంలో వేదాలను విభాగించినవాడు, పరాశరుని కుమారుడైన వ్యాసముని, సూతుడు, జైమిని – అనే ఇద్దరికి రహస్యంగా దీక్షచేసి, కరుణతో మాల,

దిగ్బంధం, పూజావిధానం, కవచం, యంత్రం, మంత్రం, రహస్యం (దాని అర్థం), సహస్ర నామ స్తుతి – అనే వీటితో ప్రకాశించే పరమేశ్వరుని నవాంగాలను (నవాంగమంటే మంత్ర శాస్త్రంలో చెప్పబడిన ఒక విధమైన క్రమం) ఉపదేశించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 244

---

**శ్లో॥ సద్యోజాతాదిమానాం వదనజలభువాం పఞ్చకాద్యస్య జాతాన్**
**మన్త్రాంస్త్రైలోక్యవశ్యప్రముఖవరమహాసిద్ధదాన్ సప్తకోటీన్ ।**
**శ్రుత్వా గౌరీ యదుక్త్యా జగదుపకృతయే సప్రయోగాన్ సకల్పాన్**
**తాన్ లోకానానినాయ స్వయమతులకృతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥245**

పరమేశ్వరుని సద్యోజాతం మొదలైన అయిదు ముఖాలలో నుండి వెలువడినది, ముల్లోకాలను వశం చేసికోవడం మొదలైన సిద్ధులను ఇచ్చేది అయిన ఏడుకోట్ల మంత్రాలను తెలిసికొని, పరమేశ్వరుని ఆజ్ఞచే అంబిక స్వయంగానే లోకోపకారంకోసం ఆ మంత్రాలను ప్రయోగాలతోపాటుగా లోకంలో ప్రకాశించేటట్లు చేసింది. అటువంటి, సాటి లేని, కృతిని కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 245

---

**శ్లో॥ అద్రాక్షీన్నందికేశః కనకసదసి యం హ్యర్ధనారీస్వరూపం**
**పశ్చాన్నారాయణార్ధం పునరపి గిరిజారూపమాకారహీనమ్ ।**
**తారం తన్మణ్డలాన్తర్జ్వలనమనుపం సచ్చిదానన్దమూర్తిం**
**నృత్తేశానం ముహూర్తం తమపరసుగమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥246**

ఒకానొక సమయంలో నందికేశ్వరుడు (చిదంబరక్షేత్రంలో) ఉండే కనకసభలో ఒక ముహూర్తకాలం పరమేశ్వరుని అర్ధనారీశ్వర స్వరూపంగా, తర్వాత శంకర నారాయణ రూపంగా, అంబికా రూపంగా, రూపం లేనిదిగా (లింగంగా) ఓంకారం, దానిమధ్యలో అగ్నిని, సాటిలేని సచ్చిదానందస్వరూపం అయిన నటరాజమూర్తిగాను దర్శించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 246

---

**శ్లో॥ పార్వత్యుసఙ్గదేశస్థితిమధిజుషతోః స్కన్దహేరమ్బయోస్తా**
**వాహూయాద్యాఖిలాణ్డాన్ ఝటితి చ యువయోః కస్సమర్థోఽటనే సః ।**

**స్వీకుర్యాదేతదామ్రం ఫలమితి నిగదన్నగ్రతో యస్తదీయం**
**వృత్తం దృష్ట్వా ముమోద క్షితి ధరశిఖరే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 247**

కైలాసగిరిలో పార్వతి ఒడిలో కూర్చొని ఉండే సుబ్రహ్మణ్యుని, వినాయకుని పిలచి, మీకు ఇద్దఱికి సమస్తమైన అండాలను చుట్టిరావడంలో ఎవరు సమర్థుడో, అతడు ఈ మామిడిపండును పొందగలడు - అని పల్కి పరమేశ్వరుని ముందుగా ఆ ఇద్దఱి చేష్టలను చూచి, సంతోషించారో, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 247

ఈ వృత్తాంతమేమంటే – సుబ్రహ్మణ్యుడు తన నెమలి వాహనం పైకి ఎక్కి, సమస్త బ్రహ్మాండాలను చుట్టి పరమేశ్వరుని సమీపానికి వచ్చిన సమయంలో వినాయకుడు లేచి, స్వామిని మూడు ప్రదక్షిణాలు చేసి, స్తుతించి, ఆ పండును పొందాడు. దీనిని చూచిన సుబ్రహ్మణ్యుడు కోపంతో దక్షిణముఖంగా వచ్చేటపుడు పరమేశ్వరుడు అతనిని వెంబడించి, ఒక పర్వతశిఖరంపై ఆ కుమారుని చూచి, దయతో "ఫలం నీకు" అని అంటూ పండును ఇచ్చాడు. అందువల్ల "పళని" అని ఆ క్షేత్రానికి పేరు వచ్చింది.

---

**శ్లో॥ నానాజీవాత్మవాది ప్రకటితకునయా భాసయుక్త్యద్రిపక్ష-**
**ద్వన్ద్వచ్ఛేదానుధావడ్డమరుకముఖరజ్ఞాతసత్యార్థలోకమ్ ।**
**వాఞ్ఛాకల్పద్రుకల్పప్రపదయుగనతబ్రహ్మనిష్ఠావలిం తం**
**చిన్మాత్రం చిత్సభేశం నిరతిశయగుణం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 248**

నానా జీవాత్మవాదాన్ని చేసే వారిచేత చెప్పబడే నింద్యాలైన యుక్తులనే పర్వతంయొక్క రెండు రెక్కలను ఖండించడంకోసం వ్యాపించే డమరుక శబ్దంతో తెలియబడిన "జీవుడు, ఆత్మ ఒక్కటే" అనే సత్యార్థాన్ని తెలిసికొన్న లోకాన్ని కలవాడు, ఇష్టాన్ని ఇచ్చే విషయంలో కల్పవృక్షం వంటి తన రెండు పాదాలలో నమస్కరించే బ్రహ్మ నిష్ఠలను కలవాడు, ప్రసిద్ధుడు, జ్ఞానస్వరూపుడు, చిత్‌సభకు ఈశ్వరుడు, నిరతిశయమైన గుణాలను కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 248

---

**శ్లో॥ విష్ణోశ్చక్రాపహర్తుః ప్రథితబలజుషో భూతచక్రాధిపస్య**
**క్షుత్తృట్‌దుఃఖప్రశాన్తిప్రదనిజచరితస్తబ్ధపాణ్డ్యాత్మజాతమ్ ।**

**శ్వశ్రూవాఞ్ఛాభిపూర్త్యై నిజధురి చ ముదాఽఽనీత సప్తామ్బురాశిం**
**భక్తస్త్రీపక్వపిష్టాశనరుచిముదితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 249**

విష్ణుచక్రాన్ని మింగినది, అధికమైన బలాన్ని కల్గినది అయి (కుండోదరుడనే) భూత ప్రభువుయొక్క ఆకలిదాహాలను తీర్చే తన లీల అనే అచంచలమైన పాండ్యరాజు కుమార్తెను కలవాడు, తనకు మామ అయిన కాంచనమాల అభీష్టాన్ని పూర్తిచేయగోరి తన ముందుగా సంతోషంతో పిలువబడిన ఏడు సముద్రాలను కలవాడు, తనపట్ల భక్తిని కల ఒక స్త్రీచే యివ్వబడిన పిట్టులో (పిండితో చేసే ఒక వంటకం) ప్రీతిని కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 249

ఈ చరిత్ర తిరువిళైయాడల్ పురాణమనే గ్రంథంలో తెలుపబడింది.

---

శ్లో॥ **అత్రేః కాన్తాఽనసూయా నిఖిలజననుతా యం సమభ్యర్చ్య పుత్రం**
**దత్తాత్రేయాఽభిధానం త్రిముఖమపి చతుర్బాహుమద్వైతవృత్తిమ్ ।**
**శ్రుత్యన్తోద్దామలీలం సకలమునితతేరగ్రగణ్యం మహాన్తం**
**లేభే తం స్వాత్మబుద్ధత్రిభువనచరితం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 250**

అత్రి మహర్షి పత్ని, సమస్తలోకాలచే కీర్తింపబడేది అయిన అనసూయ, పరమేశ్వరుని పూజించి, మూడు ముఖాలు, నాల్గుచేతులు, అద్వైత వృద్ధి, వేదాంతశాస్త్రంలో విశేషమైన ప్రజ్ఞ, సకలముని సమూహాలకు అగ్రగణ్యుడు, గొప్పవాడైన దత్తాత్రేయుడు – అనే వానిని పుత్రునిగా పొందింది. అటువంటి, తన బుద్ధిలో తెలియబడిన మూడులోకాల చరిత్రలనుకల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 250

---

శ్లో॥ **కల్పారమ్భే యదీయాద్వరగలవివరదోమథేతి ద్విశబ్దౌ**
**సిద్ధాన్తార్థప్రబోద్ధృప్రవరశివకరావావిరాస్తాం పురస్తాత్ ।**
**పశ్చాద్వేదాది విద్యావిధిహరిముఖరా దేవతాస్సర్వలోకా**
**జాతాస్తం దక్షిణాస్యం ద్యుతికరనిలయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥251**

కల్పారంభకాలంలో పరమేశ్వరుని కంఠంనుండి మొదట శాస్త్రాలను బోధించేది, మిక్కిలి మంగళరూపమైన "**ఓమ్ అథ**" అనే రెండు శబ్దాలు పుట్టాయి. "**ఓంకారశ్చ అథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా, కంఠంభిత్వా వినిర్యాతౌ తస్మానాంగలికా వుభౌ**" అని స్మరింపబడుతున్నది. తర్వాత వేదాలు మొదలైన సకల విద్యలు బ్రహ్మ, విష్ణువు, మొదలైన

సకల దేవతలు, సమస్తలోకాలకు కలిగాయి. అటువంటి, దక్షిణాభిముఖుదు, సూర్యచంద్రులు, అగ్ని – అనే వీరి కుండలాల మధ్యలో నివసించేవాడు, లేక, ప్రకాశించేవాస స్థానం (సభ) గా కలవాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 251

---

**శ్లో॥ సఙ్కల్పోల్లాసహీనం సరిగమపధనీ సప్తవర్ణానువర్ణ–**
**ప్రారమ్భోద్గానలోలాఖిలసురయువతీబృన్దసఙ్కీర్ణరఙ్గమ్ ।**
**నాదధ్యానానుమోదాగతనిజనికటానేకటానేకసిద్ధర్షిదేవ–**
**స్తోత్రధ్వానైర్నితాన్తైర్జితజలధిరవం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 252**

సంకల్పంలో ఆశ లేనివాడు, "**సరిగమపధని**" అనే ఏడు స్వరాలతో గానం చేసే దేవస్త్రీ సంఘాలతో నిండిన సభను కలవాడు, నాదబ్రహ్మను ధ్యానం చేయగోరి తన సమీపంలో నివసించే సిద్ధులు, ఋషులు, దేవతలు – అనే వీరి స్తోత్రశబ్దాలతో జయింపబడిన సముద్రఘోషను కల్గినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 252

---

**శ్లో॥ దోషాం సాహస్రయుగ్మై ర్ధృతపరశుముఖైరాననానాం సహస్రైః**
**త్రైసాహస్రై స్తథాక్ష్ణామపరిమితజటాధోరణీ ధాటికాభిః ।**
**జ్వాలామాలాభిరగ్రైరపహసితఘనైరట్టహాసైర్విశాలైః**
**నిధ్యానైర్యోఽన్తకాలే విహరతి తమజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 253**

ఆదిశేషుడు ఒకానొక సమయం మహామేరువును తన శరీరంతో చుట్టుకొని మూడులోకాలకు ప్రాణభూతమైన వాయువును అణచినపుడు ఆ సమయంలో నారదునిచే తెలుపబడిన వాయువు పరమేశ్వరుని ధ్యాన యోగానుభవంచేత కల్గిన బలవేగంచేత ముఖాన్ని భగ్నం చేసి, ఆ పర్వతశిఖరంతోపాటు ఆదిశేషుని సముద్రంలో విసరివేశాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 253

---

**శ్లో॥ శేషే జాతు స్వభోగాత్సురగిరిశిఖరం వేష్టయిత్వా నితాన్తం**
**త్రైలోక్యప్రాణభూతాం కబలయతి తనూం నారదాత్ జ్ఞాతవృత్తః ।**
**వాయుర్యద్ధ్యానయోగాత్ ప్రబలతనురయాత్ భుగ్నవక్త్రం సభూభృత్**
**శృఙ్గం చిక్షేప వార్ధౌ ఫణిపతిమపి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 254**

ఆ పరమేశ్వరుడు సర్వసంహారకాలంలో పరశువు మొదలైన ఆయుధాలను ధరించిన

రెండువేల చేతులతోను, మూడు వేల కన్నులతోను, వేయి ముఖాలతోను, వేలాడే, అంతులేని జటలతోను, అగ్ని జ్వాలలతో చుట్టబడి ఉండేది, పిడుగు ధ్వనులను తిరస్కరించే సింహనాదాలతోను క్రీడిస్తాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 254

**శ్లో॥ విశ్వామిత్రప్రయుక్తాత్ స్వపురసుతహృత్కామినీ విప్రయోగాత్**
**క్లిశ్యన్నాలీకవార్తాం గదితుమపి పటుః పూజయా యస్య నిత్యమ్ ।**
**లబ్ధ్వా స్వాం సంపదం తామభజదథ హరిశ్చన్ద్రసంజ్ఞో నరేన్ద్రో**
**ధామ స్వాయమ్భువం తం నిగమరథవహం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥255**

విశ్వామిత్రునిచే అపహరింపబడిన తన నగరం, పుత్రులు, స్నేహితులు, పత్ని - అనే వీరి వల్ల దుఃఖాన్ని పొందినప్పటికీ, అసత్యం పల్కడం అంగీకరించని హరిశ్చంద్రుడనే ప్రభువు పరమేశ్వరుని నిత్యపూజతో తన సంపదలను తిరిగి పొంది తరువాత బ్రహ్మలోకాన్ని పొందాడు. అటువంటి వేదాలను అశ్వాలుగా కల్గిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. ఈ కథ కాశీఖండంలో చెప్పబడింది. 255

**శ్లో॥ ఆబాల్యాత్ ద్రవ్యమేతత్సుముఖి తవ ముదే యన్మయాత్తం తదద్య**
**స్వీకుర్వాణా నితాన్తం మదనశరహతం గాఢమాలిఙ్గ్య దోర్భ్యామ్ ।**
**అత్రైవాశ్వాసయేతి త్వరితగతిముమామాలిభిర్వారితోఽపి**
**శ్రీమాన్యో హ్యన్వగచ్ఛన్నగతటభువి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥256**

హిమాలయ పర్వతంపై అంబిక పరమశివుని వివాహం చేసికొనగోరి తపస్సును చేసేటపుడు పరమశివుడు వృద్ధబ్రాహ్మణ రూపంతో, ఆమెతో చేసిన సంభాషన లీలను తెల్పుతున్నారు.

“ఓ చక్కని ముఖాన్ని కల్గిన పార్వతీ! బాల్యం నుండి నాచే సంపాదింపబడిన సంపద అంతా నీ సంతోషం కోసమే కానీ! ఇపుడు దానిని అంగీకరించి, మిక్కిలిగా మన్మథుని బాణాలతో కొట్టబడిన నన్ను ఆలింగనం చేసికొని, ఆశ్వాసాన్ని కల్గించు - అని పల్కి, శ్రీమంతుడైన పరమేశ్వరుడు సఖులతో అడ్డగింపబడినవాడైనప్పటికీ, వేగంగా లోపలకుపోయే అంబికను వెంబడించి వెళ్లాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 256

**శ్లో॥ ఆలి త్వం సాన్త్వయార్యాం మయి కుపితా ధియం దారుకారణ్యవాసి**
**స్త్రీణాం కేలీవిలాసై ర్హరిధృతసుతనోస్సాహసాత్పర్వతేన్ద్రే ।**
**సజ్గాద్ధివ్యాపగాయా మదనదహనతశ్చేతి సాకూతముక్త్వా**
**కాన్తాగారే జయాం యోఽగమయదసులభం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥257**

పరమేశ్వరుడు, "ఓ సఖీ! నీవు దారుకావనంలో ఉండే స్త్రీలతో క్రీడించినందున, మహామేరువులో విష్ణుమోహినితో కూడినందువల్ల, గంగా సంగమంవల్ల, మన్మథుని దహించినందువల్ల నాపట్ల కోపించిన, నీ సఖి అయిన ఉమను సమాధాన పఱచు" - అనే అభిప్రాయాన్ని లోపలపెట్టుకొని పల్కి అంతఃపురంలో జయ అనే శక్తిని పంపించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 257

**శ్లో॥ యశ్శమ్భుర్లీలయా స్వం జనిమసుఖకరం తాపసానాం వచోభిః**
**హస్తాదుత్పాట్యదేవైః కిమిదమితి భయాద్వీక్షితోఽరణ్యదేశే ।**
**చిక్షేపబ్రహ్మవిష్ణుస్తుతిభిరపి పునస్తాత్ మునీన్ జ్ఞాతతత్వాన్**
**కృత్వాప్యన్తర్దధే తం ప్రణతఫలకరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 258**

శంభువైన పరమేశ్వరుడు క్రీడగా తన లింగాన్ని దారుకావనంలోని మునివరుల మాటవల్ల చేతితో పెకలించి, దేవతలచే "ఇది ఏమి?" అని భయంతో చూచే వారయ్యారు. తర్వాత, బ్రహ్మ, విష్ణు మొదలైన దేవతలు స్తుతులతో ఆ మునులను జ్ఞానం కలవారిగా చేసి, అంతర్ధానమయ్యారు. అటువంటి, నమస్కరించినవారి అభీష్టాన్ని ఇచ్చే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. ఇది శివతత్త్వసుధానిధి అనే గ్రంథంలో ఉన్నది. 258

**శ్లో॥ సిద్ధాకారప్రగుప్తస్వతనుమపి జదద్దష్టమాహేన్ద్రజాలం**
**చిత్రస్తమ్భస్థితేన ప్రచలితకరిణా భుక్తపుణ్డ్రేక్షుఖణ్డమ్ ।**
**ముక్తాహారాపహారభ్రమితనరపతిస్తోత్రనిర్నిద్రితాన్తః**
**పద్మం సాహస్రనేత్రప్రముఖనుతపదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 259**

సిద్ధుని రూపంతో మఱుగుపరచుకొన్న రూపాన్ని కలవాడు, లోకంలో మహేంద్ర-జాలమనే విద్యను చూపించినవాడు, అందాన్ని కల (చిత్ర) స్తంభంలో చెక్కబడిన కదలే ఏనుగుచే భుజింపబడిన చెఱకును కలవారు, ముక్తాహారాన్ని అపహరించినందున భ్రమించిన

పాండ్య ప్రభువుయొక్క స్తోత్రంతో సంతోషాన్ని పొందినవాడు, ఇంద్రుడు మొదలైన దేవతలచే స్తుతింపబడిన చరణాలను కలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను.

ఈకథ "**తిరువిళైయాడల్ పురాణమ్**" అనే ద్రావిడ గ్రంథంలో ఉన్నది. 259

---

**శ్లో॥ మౌలౌ గఙ్గాగలాన్తర్గరలమహితతేః కఙ్కణం దోషిఫాలే**
**చన్ద్రం తార్తీయనేత్రం జ్వలనసమశిఖం శూలమాజం కపాలమ్ ।**
**భూతప్రేతాదిసేనానిగమమయశునో యస్య లీలాకిరాత-**
**స్యాగ్రే దృష్ట్వా కిరీటీ భ్రమితమతిరభూత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥260**

అర్జునుడు లీలగా వేటగాని రూపాన్ని ధరించిన పరమేశ్వరుని శిరస్సులోని గంగను, కంఠం నడుమ గల విషాన్ని, చేతిలోని సర్పసమూహాన్ని, శిరస్సులోని చంద్రుని, ఫాలంలో మూడవ నేత్రాన్ని, అగ్ని జ్వాలవలె నిశితమైన శూలాన్ని, బ్రహ్మకపాలాన్ని, భూతప్రేతాది సేనలను, వేదరూపాలను శునకాలను చూచి భ్రమించిన బుద్ధిని కలవాడయ్యాడో, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 260

---

**శ్లో॥ కస్తూరీపఙ్కలేపం మృగమదతిలకం పుష్పమాలాం చ నూత్నాం**
**దృష్ట్వా జాత్వమ్బుజాక్షీ ధరణిధరసుతాప్యన్యథా తర్కయన్తీ ।**
**నాథేదం లక్ష్మ సత్యాం మయి తవ సమభూత్ బ్రూహి కస్యా ముదేచే-**
**త్యాయాన్తం నిర్బబన్ధాధికశపథమరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 261**

కస్తూరి మైపూతలు, జవ్వాది చూర్ణంతో తిలకం, నూతనమైన పూమాలిక – అనే వీనిని పరమేశ్వరునకు ఒకానొక సమయంలో తామరపూవు వంటి నేత్రాన్ని కల, హిమాలయుని పుత్రిక అయిన అంబికను చూచి అన్యథా భావించి, – "నాథా! ఈ గుర్తులు నేనుండగా నీకు ఎవతె సంతోషం కోసంగా చేయబడ్డాయి? చెప్పు" అని తన అంతః పురాన్ని చేరి పరమేశ్వరుని శపథం చేయమని నిర్బంధించిందో అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 261

---

**శ్లో॥ కథ్యం కల్పద్రుకామ్యం కరివసనధరం కృష్ణరక్తాఙ్గవర్ణం**
**కాలాతీతం కవీన్ద్రకవికులవినుతం కప్తలీలావిశేషమ్ ।**
**కృత్యాకృత్యాదిశూన్యం కుమతివిరహితం క్రుద్ధవాణాసనాఙ్కం**
**కఙ్కాలం కాలినృత్తప్రముదితహృదయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥262**

శ్లాఘించదగినవాడు, కల్పవృక్షాలచే ఆశపడదగిన వారు (కల్పవృక్షాలకంటే గొప్పవాడు), గజచర్మాన్ని ధరించినవాడు, ఎఱ్ఱని నల్లని వర్ణాన్ని కలవాడు, కాలుని అతిక్రమించినవాడు, కవులలో శ్రేష్ఠుడు, కవుల సమూహాలచే గొప్పగా స్తుతింపబడేవాడు, నిర్ణయం చేయబడిన లీలా విశేషాన్ని కలవాడు, చేయదగినది, చేయరానిది – అనే వానిని లేనివాడు, జ్ఞాన హీనునిచే విడువబడేవాడు, పర్వతాన్ని విల్లుగా కలవాడు, కంకాళస్వరూపుడు, కాళి చేసే నర్తనంలో సంతోషం పొందినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 262

**శ్లో॥ సర్వేషామస్తి కర్తా ప్రభురపి జగతాం పాలకో నాశకశ్చే-**
**త్యుచ్చైర్విష్ణౌ కదాచిత్ప్రలపతి చ ముదా యస్స్వయం తత్సమక్షమ్ ।**
**రుద్రస్సంహారమూర్తిః స్వతనురుహతతేరాశు విష్ణూనసంఖ్యాన్**
**సృష్ట్వా తద్గర్వవహ్నిం పురభిదశమయత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥263**

ఒకానొక సమయంలో మహావిష్ణువు యోగంతో "అన్ని లోకాలకు నేనే కర్తను, రక్షించేవాడను, నాశం చేస్తున్నాను, నేనే ప్రభువును" అని ఉచ్చ స్వరంతో పల్కినపుడు, త్రిపురాలను సంహరించిన పరమేశ్వరుడు ఆ మహావిష్ణువు ముందు సంహారమూర్తి అయిన, పరిచ్ఛేదించడానికి సాధ్యంకాని విష్ణువులను సృష్టించి, ఆ విష్ణువుయొక్క గర్వాన్ని పోగొట్టాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 263

ఈ కథ శివరహస్యంలో తెలుపబడింది.

**శ్లో॥ కాన్తాసంహారకుప్యత్ భృగుమునిగదితభీకరం ఘోరశాపం**
**నానాజన్మైకహేతుం శమయితుమనిశం పూజయన్తం ముకున్దమ్ ।**
**ఉత్పత్తీనాం దశైవ త్రిజదభిభవద్దానవాన్ శిక్షితుం తే**
**భూయాదిత్యాదిదేశప్రభురతికృపయా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 264**

తన భార్యను సంహరించినందున కోపించిన భృగుమునిచే నియోగింపబడినది, భయంకరమైనది, పలు జన్మలకు కారణమైనది, క్రూరమైన శాపాన్ని ఉపశమింపజేయడానికి ఎల్లప్పుడు తనను పూజించే ముకుందుని గూర్చి పరమేశ్వరుడు చాలా కృపతో "మూడు లోకాలను అవమానించే రాజులను శిక్షించడంకోసం – నీకు పది జన్మలు కలుగుతాయి" అని ఆజ్ఞాపించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 264

ఇది శంకర సంహితలో ఉన్నది.

శ్లో॥ లీలాం యస్యానభిజ్ఞా మఖభువి యతినా యేన వేద్యన్తరస్మిన్
క్షిప్రం యావత్కపాలం నిరసితుమబలాద్యో సదశ్చాస్తువన్యమ్ ।
పౌరోడాశస్య భూయాదధికరణమిదం సంయజన్తామిదానీం
ఇత్యుక్త్వాఽదర్శి నైజం నిగమమయవపుః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥265

పరమేశ్వరుని కలను తెలియనివారు, యజ్ఞవాటికలో యతివేషాన్ని ధరించిన పరమేశ్వరునిచే వేదిక మధ్యలో పెట్టబడిన కపాలాన్ని ఆ వైపుకు ఎత్తి పారవేయడంలో సామర్థ్యాన్ని లేనివారు అయిన దేవతలు ఆ పరమేశ్వరుని స్తుతించారు. ఆ పరమేశ్వరుడు " ఈ కపాలంలో పురోడాశానికి పాత్రగా కావాలి. ఇపుడు యజ్ఞాన్ని నిర్వహించండి" అని ఆజ్ఞాపించి, వేదమయమైన తన రూపం దర్శింపజేయబడిందో, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 265

ఇది పద్మపురాణ ప్రోక్తం.

శ్లో॥ దేవేన్ద్రే వృత్రహత్యా పరిభవతి తదా స్వర్గరాజ్యాధికారే
యుక్తం దర్పావలీఢం నహుషనరపతిం కామితారం నితాన్తమ్ ।
పౌలోమీ యస్య నామ్నాం మననవిభవతః కుమ్భజాతస్య శాప-
వ్యాజాన్నిన్యే ధరాంతం జనకనృపనుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥266

ఒకానొక సమయంలో దేవేంద్రుడు వృత్రాసురుని వధించినందున కల్గిన హత్యాదోషంతో అంతర్ధానాన్ని పొందినపుడు, స్వర్గరాజ్యాన్ని పాలించడంకోసం ఆజ్ఞాపింపబడినవాడు, మదించినవాడు, మిక్కిలి కామంతో కూడిన వాడైన నహుషుడనే మానవ ప్రభువు ఇంద్రాణి, పరమేశ్వరుని నామాల స్మరణతో కల్గిన వైభవవంతో అగస్త్య ముని వల్ల కల్గిన శాపాన్ని పురస్కరించుకొని భూమికి గెంటివేసింది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 266

శ్లో॥ దిక్కాలాద్యైర్విచిన్త్యం స్వమనుమననకృన్మాన్యమద్వైతసారం
మధ్యాద్యన్తాదిహీనం సకలజనమనోవృత్తిదృష్టారమాద్యమ్ ।
మాయాతీతం ప్రశాన్తం ద్యుతికరమఖిలజ్యోతిషామీశ్వరాఖ్యా
వాచ్యం తేజోమయం తం పరమపరనటం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥267

తూర్పు మొదలైన దిక్కులు, భూతాది కాలాలు - అనే వీటిచే తెలియరానివాడు,

తన మంత్రాలను జపించే వారిచే కీర్తింపబడదగినవాడు, అద్వైత సారభూతమైనవాడు, మొదలు, మధ్య, చివరలను లేనివాడు, సకల జనుల మనస్సులలోని భావాలను తెలిసినవాడు, ఆద్యుడు, మాయను దాటినవాడు, చాలా సంతోషాన్ని కలవాడు, సూర్యుడు మొదలైన వారికి ప్రకాశాన్ని కల్గించేవాడు, ఈశ్వర శబ్దానికి అర్థమైనవాడు, జ్యోతిఃస్వరూపుడు, ప్రసిద్ధుడు, ఉన్నతుడు, తనకంటే వేఱు నటులు లేనివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 267

శ్లో॥ **భోగాత్ప్రారబ్ధకర్మాప్యధికభయకరే సఞ్చితాగామికే ద్వే**
**జ్ఞానాన్నాశం ప్రయాతే ఇతి నిగమవచాంస్యాహురేతత్ప్రసిద్ధమ్ ।**
**తాన్యప్యాలోకమాత్రాత్ నిజనటనతనోః ప్రాణినాం జాతు దిష్ట్యా**
**నిఘ్నన్యచ్ఛన్ సుఖం యస్సదసి విజయతే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥268**

"ప్రారబ్ధమనే కర్మను అనుభవంచేత, చాలా భయాన్ని కల్గించే సంచితం, ఆగామి – అనే రెండింటిని జ్ఞానం తోను, నాశాన్ని పొందండి" – అని వేద వాక్కులు పల్కుతున్నాయి. ఇది ప్రసిద్ధం. అటువంటి, ఆ కర్మలను తన నటనావిలాసంతో కూడిన రూపాన్ని ఒకానొక సమయంలో కేవలం చూచినంతమాత్రంతోనే పోగొట్టి, ప్రాణులకు సకల సుఖాలను అనుగ్రహించే పరమేశ్వరుడు సభలో వెల్గుతున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 268

శ్లో॥ **యశ్శమ్భుర్భూర్భువస్స్వర్భువనపరిబృఢైస్సంస్తుతస్సత్యవాదైః**
**యస్మాత్సార్వాత్మ్యయోగానుభవనిపుణతాం లేభిరే యోగివర్యాః ।**
**లీఢాలీఢార్థతత్త్వోపనిషదవిషయాకాశగో యశ్శివస్తం**
**ప్రత్యక్ బ్రహ్మైక్యనిష్ఠాగురుమమరనుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥269**

శంభువైన పరమేశ్వరుడు భూలోకం, భువర్లోకం, సువర్లోకం – అనే వీనిలో ఉండే ప్రాణులచే స్తుతింపబడుతున్నాడు. యోగి శ్రేష్ఠులు పరమేశ్వరుని వద్దనుండి నిర్వికల్ప సమాధియొక్క అనుభవాన్ని పొందుతున్నారు. పరమేశ్వరుడు ప్రకాశంగా (వ్యక్తంగా) రహస్యంగా ఉండే అర్థాలను తెలిపే ఉపనిషత్తులకు విషయం కాని ఆకాశంలో ఉంటాడు. అటువంటి, సాక్షాత్తు అయిన బ్రహ్మైక్య నిష్ఠులకు ఆచార్యుడు, దేవతలచే స్తుతింపబడినవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 269

శ్లో॥ వాయ్వాకారత్వభాజౌ దివిచరపతినా ఖణ్డితేష్వాసకోటి-
త్రుట్యద్వక్త్రాస్య పుంసో వపురతిచకితం వీక్షయన్తో నిలిమ్పాః ।
స్తుత్వా యన్నిదేశాత్తురగముఖయుతం తం విధాయాశ్వినీభ్యాం
చక్రుర్యజ్ఞం యథావత్తమపి నటపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ **270**

చెదపురుగు రూపాన్ని పొందిన ఇంద్రునిచే కొఱక బడి తెగిన వింటి అగ్రభాగంతో కొట్టబడినవాడు, శిరస్సు తెగిపడినవాడైన యజ్ఞపురుషుని శరీరాన్ని చాలా భయంతో చూచిన దేవతలు, పరమేశ్వరుని స్తుతించి, అతని ఆజ్ఞతో ఆ పురుషునకు అశ్వనీ దేవతలనుగొని అశ్వశిరస్సును చేర్చి, బతికించి, శాస్త్రప్రకారంగా యజ్ఞాన్ని నిర్వహించారు. అటువంటి, నటపతి అయిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 270

ఈ కథ వేదంలో తెలుపబడింది. ఒకానొక సమయంలో దేవతలొక యగాన్ని నిర్వహించారు. అపుడు యజ్ఞపురుషుడు సంధించిన ధనుస్సును కంఠంతో ఆనుకొని, గొప్పరూపంతో ఆ దేవతల ముందు ప్రత్యక్షమయ్యాడు. ఆ పురుషుని చూచి భయపడిన ఇంద్రుడు చెదపురుగు (వర్మి) రూపాన్ని పొంది, ఆవింటి నారిని కొఱికాడు. అపుడు ఆ విల్లు వేగంగా ఆ యజ్ఞపురుషుని శిరస్సును తాకి, అతని శిరస్సును తెగగొట్టింది. దానిని చూచి భీతిల్లిన దేవతలు పరమశివుని స్తుతించారు. అపుడు పరమశివుడు మిక్కిలి కృపతో వారి ముందు ప్రత్యక్షమై, "అశ్వముఖాన్ని ఆ పురుషుని కంఠానికి చేర్చండి, ఆ పురుషుడు తిరిగి బతుకుతాడు" అని ఆజ్ఞాపంచి, అదృశ్యుడయ్యాడు. తర్వాత దేవతలు అశ్విని దేవతల సహాయంతో ఆ విధంగా చేసి, ఆ యాగాన్ని పూర్తి చేశారు.



శ్లో॥ స్వామిన్ కృష్ణాత్ర యుద్ధే కనకమయతనుర్భూతిమాన్ శూలపాణిః
వక్త్రాదగ్నిస్ఫులిఙ్గాన్ రణభువి వికరన్ సఞ్చరత్యద్వితీయః ।
కోఽయం బ్రూహీతి పార్థే వదతి సవినయం వాసుదేవో ముహూర్తం
వేగాత్ ధ్యాత్వాఽబ్రవీద్యచ్చరితమనుపమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥**271**

"ఓ స్వామీ! ఓ శ్రీకృష్ణా! ఈ యుద్ధరంగంలో బంగారువంటి శరీరాన్ని కలవాడు, విభూతిని పూసికొన్నవాడు, శూలాన్ని ధరించినవాడు, ముఖంలో నుండి నిప్పుకణాలను భూమిలోకి వెదజల్లేవాడు, తనకు సాటివచ్చే ఇంకొకడు లేనివాడు అయిన పురుషుడు సంచరిస్తున్నాడు. అతడెవరు? చెప్పు" అని వినయంతో ప్రార్థించిన అర్జునునకు వాసుదేవుడు

ఒక మూహూర్తకాలం యోగంలో ధ్యానించి, అది పరమేశ్వరుని మాహాత్మ్యమని అన్నాడు. అటువంటి, ఉపమానంలేని, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 271

ఈ కథ మహాభారతం ద్రోణపర్వంలో తెలుపబడింది.

---

**శ్లో॥ సత్యం బ్రహ్మైవ నాన్యజ్జగదిదమఖిలం చేతి మీమాంసయిత్వా**
**త్రైయన్తోక్త్యా బుధేన్ద్రా హృది చ యమనిశం చిద్ఘనం దుర్నిరీక్ష్యమ్ ।**
**దీపజ్వాలాశిఖావత్సతతపరిచయానన్దనృత్తం విమాయం**
**శుభ్రం పశ్యన్తి తత్సత్పదవిషయమరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 272**

"బ్రహ్మ ఒక్కటే సత్యం. మిగిలిన ఈ లోకం అంతా సత్యం కాదు." అని వేదాలలో చెప్పబడిన వచనాలతో విచారణచేసి, జ్ఞానులు హృదయంలో ఎల్లప్పుడు జ్ఞాన స్వరూపం, బాహ్యనేత్రంతో దర్శించడానికి సాధ్యం కానివాడు, దీపం యొక్క జ్వాలాగ్రం వలె ఎల్లప్పుడు ఆనంద నటన విలాసాన్ని చేసేవాడు, మాయ లేనివాడు, తెల్లని వర్ణంలోనివాడైన పరమేశ్వరుని దర్శిస్తున్నారు. అటువంటి, "**తత్ - సత్**" అనే శబ్దాలకు వాచ్యుడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 272

---

**శ్లో॥ విద్యామగ్నౌ ప్రతిష్ఠాం పయసి చ ధరణౌ యో నివృత్తిం సమీరే**
**శాన్త్యాఖ్యాం శాన్త్యతీతాం నభసి నిజకలాం యోజయన్ హ్యప్రమేయః ।**
**సూక్ష్మాత్ సూక్ష్మాన్తరజ్ఞే దహరకుహరచిత్పుణ్డరీకాఖ్యవేశ్మ-**
**న్యన్తశ్చిన్మాత్రరూపం రచయతి నటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 273**

పరమేశ్వరుడు అగ్నిలో తన విద్యాకళను, జలంలో ప్రతిష్ఠాకళను, భూమిలో నివృత్తి కళను, వాయువులో శాంతి కళను, ఆకాశంలో శాంత్యాతీత మనే కళనుచేర్చి, అప్రమేయుడై, చాలా చిన్నది అయిన దహరకుహరమని, పుండరీకమని పేర్లను కల నివాసం లోపల జ్ఞానస్వరూపమైన నటనను చేస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 273

---

**శ్లో॥ సౌవర్ణం విష్టరం యః కనకఘటనిభౌ స్వప్రియాయాః స్తనౌ ద్వౌ**
**పశ్యన్ లీలాకటాక్షైః కరజలజవరైర్మణ్డయన్ సప్రమోదమ్ ।**
**అధ్యాసీనః పురస్తాన్మణిముకురగతం స్వానుబిమ్బం శివాయాః**
**తుష్ట్యై చాహూతవాన్ శ్రీవినుతనిజపదం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥274**

పరమేశ్వరుడు స్వర్ణమయమైన ఆసనంలో వేంచేసి ఉండి అంబికయొక్క స్వర్ణకలశం వంటి రెండు స్తనాలను తన లీలా కటాక్షాలతో వీక్షించి, సంతోషంతో తామరల వంటి చేతులతో అలంకరించి, ముందుభాగంలో ఉండే మణిమయ దర్పణంలో ప్రతిఫలించే తన ప్రతిబింబాన్ని అంబిక యొక్క సంతోషం కోసం ఆహ్వానించాడు. అటువంటి, లక్ష్మిచే స్తుతింపబడిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 274

**శ్లో॥ భూవాయ్వాకాశతోయజ్వలనరవిశశీయజ్వరూపైః ప్రపఞ్చం**
**యో ధత్తే మస్కరీన్ద్రైశ్చ యుతమలహృదయైస్సేవ్యతే యస్తురీయః ।**
**హంసాభిఖ్యోఽద్వితీయః స్వగతనిఖిలవిధ్యణ్డజాలో హిరణ్య-**
**శ్మశ్రుస్తం శాన్తకల్పం నియతి పదభరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥275**

భూమి, వాయువు, ఆకాశం, జలం, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, యాగాన్ని చేసే యజమాని - అనే వీరి రూపాలతో లోకాన్ని పరమశివుడు ధరిస్తున్నాడు. నిర్మలమైన హృదయాన్ని కల సంన్యాసులచే నమస్కరింపబడుతున్నాడు. తురీయుడు, హంస అనే పేర్లను కలవాడు, అద్వితీయుడు, తనలో ఇముడ్చుకొన్న సకల బ్రహ్మాండాల సమూహాన్ని కలవాడు, స్వర్ణమయమైన మీసాలను కలవాడు. అటువంటి, శాంతమైన సంకల్పాన్నికల, నియతి అనే పదాన్ని భరించేవాడైన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 275

**శ్లో॥ యోఽదాన్మౌజోత్తమాఙ్గామృతకిరణసుధామణ్డపిణ్డీకృతాఙ్గం**
**తేజోభగ్నేన్దువహ్నిద్యుమణిఘనరుచిజ్యోతిషం హీరకల్పమ్ ।**
**నిత్యం దేదీప్యమానం ప్రతిసమయమపి స్వస్య పూజాం విధాతుం**
**లిఙ్గం విప్రేషు మోదాత్ భవభయహరణం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥276**

పరమశివుడు తన శిరస్సులో ఉండే చంద్రుని అమృతమయమైన నుఱగతో (ఫేనంతో) పట్టుకొనబడినది, తన కాంతితో భగ్నమైన చంద్రుడు, అగ్ని, సూర్యుడు, విద్యుత్తు - అనే వీని ప్రకాశాన్ని కల్గినది, వజ్రసమానమైనది, సదా ప్రకాశించేది అయిన లింగాన్ని (చంద్రమౌళీశ్వరుడనే స్ఫటికలింగాన్ని) ప్రతి సమయంలోను తనకు పూజించడంకోసం సంతోషంతో (త్రిసహస్ర మునులనే) బ్రాహ్మణులకు ఇచ్చాడు. అటువంటి, సంసారభయాన్ని తీర్చే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 276

శ్లో॥ స్వాత్మానన్దానుబోధప్రవితరణసభాతారభూతోరుకక్ష్యా
మధ్యాసీనైర్వసిష్ఠచ్యవనశుకముఖైస్తైః ప్రసంఖ్యానయోగైః ।
ఊర్ధ్వం యం చాశ్రయన్తః కకుబధిపతయో నాద్రియన్తే తథా స్వం
స్థానం తం తుమ్బురూక్తి ప్రముదితహృదయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥277

ఆత్మానందసుఖాన్ని ఇచ్చే చిత్సభలో ఓంకారవృత్తం వంటి ప్రకాశాలతో (ఓంకార కక్ష్యలో) నడుమ వేంచేసి ఉన్నవారు, వశిష్ఠుడు, చ్యవనుడు, శుకుడు – ఇత్యాది ప్రసిద్ధులైన యోగీశ్వరులచే పూజింపబడేవాడైన పరమేశ్వరుని ఆశ్రయించే ఇంద్రాది దిక్పాలకులు స్వర్గాది తమ స్థానాలను ఆవిధంగా ఆదరించడం లేదు. అటువంటి, తుంబురుని గానంతో సంతోషించిన హృదయాన్ని కల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 277

శ్లో॥ శక్తేర్యస్య ప్రసాదాదధిదరణి మహానాదిశేషావతారో
యోగీన్ద్రో దేహభాజామఘమతివిపులం చిత్తవాక్కాయసంస్థమ్ ।
దూరీకర్తుం చ యష్టుం యమకృతకపథా యోగశబ్దౌషధార్చా-
గ్రన్థాన్ పాతఞ్జలాఖ్యాన్ స్వయమపి కృతవాన్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥278

పరమశివుని శక్తి అయిన శివకామసుందరి అనుగ్రహం వల్ల ఈ భువిలో (చిదంబరంలో) ఉండే రాజసభ అనబడే వేయికాళ్ళ మండపంలో, మహాత్ముడు, ఆదిశేషుని అవతారరూపుడైన పతంజలి అనే యోగీశ్వరుడు ప్రాణుల మనస్సు, వాక్కు, శరీరం – అనే వీనిని కలిగిన మానవులకు కలిగే అతి విపులమైన దోషాలను (అజ్ఞానం, అపశబ్దం, రోగం అనే దోషాలను) పోగొట్టడం కోసం, పరమేశ్వరుని వేదంలో చెప్పబడిన రీతిలో పూజించడంకోసం, పాతంజలమనే పేరునుకల యోగశాస్త్రాన్ని (యోగసూత్రాలు), శబ్దశాస్త్రాన్ని (మహాభాష్యం), ఔషధగ్రంథాన్ని (చరకసంహిత), అర్చాగ్రంథం (చిదంబరేశ్వరుని నిత్యపూజా సూత్రం) – అనే వీనిని రచించాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 278

శ్లో॥ దూతక్రీడావిహారే శివగిరిసుతయోః జాతు మిథ్యోక్తికుప్య-
ద్గౌరీవాక్యప్రభూతా మజగరతనుతాం త్యక్తుమత్యన్తఘోరామ్ ।
కైలాసోపత్యకాయాం యమపి చ తపసా తోషయన్ యత్ప్రసాదాత్
లేభే స్వం ప్రాక్తనం తద్వపురపి మురభిత్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥279

ఒకానొక సమయంలో పరమేశ్వరుడు, అంబిక ద్యూతక్రీడను ఆడేటపుడు సాక్షిగా

ఉండి, అసత్యాన్ని పల్కిన కారణంచేత కోపాన్ని పొందిన అంబిక మాటతో (శాపంతో) కల్గినది, చాలా భయంకరమైనది అయిన కొండచిలువరూపాన్ని పోగొట్టుకోవడంకోసం కైలాసపర్వతం చరియలో నివసించి, తపస్సుచేత పరమేశ్వరుని సంతోషించేటట్లు చేసి, అతని అనుగ్రహంతో మురుని సంహరించిన మహావిష్ణువు తన పూర్వరూపాన్ని పొందాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 279

ఈ కథ శంకర సంహితలో ఉన్నది.

---

**శ్లో॥ త్రైగుణ్యానామతీతం త్రిజగదభినుతం సత్రివర్గాపవర్గం**
**త్రైయన్తాచార్యమూర్తిం త్రిపుటివిరహితం త్రిస్థమప్యత్రిరూపమ్ ।**
**తృష్ణాహీనాశయస్థం త్రిశిఖవరధరం త్ర్యక్షమాత్రేయభూషం**
**త్రేతానన్దం త్రికోణస్థితిజుషమచలం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 280**

త్రిగుణాల వల్ల జనించిన బ్రహ్మ విష్ణు రుద్రులకు అతీతుడు, మూడులోకాలలో స్తుతింపబడేవాడు, ధర్మార్థకామాలతో కూడిన మోక్షాన్ని ఇచ్చేవాడు, వేదాంత శాస్త్రానికి గురువు, ధ్యాత, ధ్యానం, ధ్యేయం – అనే త్రిపుటిని లేనివాడు, మూడు రూపాలతో ఉన్నవాడైనా, ఆ మూడు రూపాలను లేనివాడు, (లేక) అత్రి ముని రూపాన్ని కలవాడు, ఆశలేని హృదయంలో నివసించేవాడు, శూలాన్ని ధరించేవాడు, త్రినేత్రుడు, అత్రిమహర్షి కుమారుడైన చంద్రుని ధరించేవాడు, దక్షిణాగ్ని, గార్హపత్యం, ఆహవనీయం – అనే త్రేతాగ్నులలో చేయబడే హోమాలలో ప్రీతిని కలవాడు, శ్రీచక్రం నడుమగల త్రికోణంలో బిందురూపంగా ఉండేవాడు, ఆశ లేనివాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 280

---

**శ్లో॥ స్వస్త్రీ వక్షోజయుగ్మే యమధికకరుణం భావయిత్వా చ భక్త్యా**
**రత్యా సన్తర్ప్య తేన ప్రముదితమనసో నృత్తమూర్తేః ప్రసాదాత్ ।**
**యస్యాభూల్లోకజేతా సుమమయవిశిఖో మన్మథః శ్రీకుమారః**
**తం దేవం సున్దరేడ్యం ద్యుసదననటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥281**

పుష్పమయబాణాలను కలవాడు, లక్ష్మికి పుత్రుడైన మన్మథుడు తన పత్నియొక్క రెండు వక్షోజాలలో మిక్కిలి కరుణతో కూడిన పరమేశ్వరుని చాలా ప్రీతితో భావనచేసి, (పూజించి) రతిక్రీడతో సంతర్పణంచేసి, ఈకృత్యాలకు సంతోషించిన మనస్సును కల

పరమేశ్వరుని అనుగ్రహంవల్ల లోకాలను జయించే వాడయ్యాడు. అటువంటి దేవుడు, సుందరమూర్తి నాయనార్‌చే స్తుతింపబడినవాడు, ఆకాశ సభలో నర్తనం చేసేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 281

ఈ కథను శంకరసంహితలో చూడవచ్చు. మంత్రశాస్త్రంలోని వామాచారాలలో ఈ విధమైన అనుష్ఠానం తెలుపబడింది.

---

**శ్లో॥ ఆయుర్యత్కైటభారేః పరమమభిమతం పూర్ణతామేతి తావత్**
**కల్పో యస్య క్షణార్ధో భవతి చ సుగమః కిఞ్చిదంశేన హీనః ।**
**ఇత్యాహుర్వేదవాచః కిముత శతధృతేః కిఞ్చ దిక్పాలకానాం**
**తం కాలం కాలభక్షం ఫణిఫణనటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 282**

విష్ణువుయొక్క ఆయుస్సు ఏ అవధిలో ముగుస్తున్నదో, ఆ అవధివరకు ఉండే కల్పం పరమేశ్వరునకు కొంచెం అల్పమైన అరక్షణకాలంతో సమానం–అనే వేదవాక్కులు పల్కుతున్నాయి. ఇక బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దిక్పాలకుల కాలహోరను గూర్చి చెప్పాలా? అటువంటి కాలస్వరూపి, (ప్రళయకాలంలో) యముని కూడా భక్షించేవాడు, సర్పంయొక్క పడగపై నిలిచి నర్తనం చేసేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను.

---

**శ్లో॥ కాలీం చణ్డోర్ధ్వనృత్తావనతముఖగణాం బ్రహ్మచాముణ్డికాఖ్యాం**
**గౌరీకోపాగ్నిజాతాం దితిసుతభయదామంశయుక్తాం విధాతుః ।**
**స్వాగశ్శాన్త్యై నితాన్తం సవిధకృతనుతిం యః కృపాపూర్ణదృష్ట్యా**
**రక్షన్ స్వక్షేత్రపాలామకురుత పరమం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 283**

భయంకరమైన ఊర్ధ్వతాండవంలో అపజయాన్ని పొందినది, వంచుకొన్న ముఖాన్ని కల్గినది, బ్రహ్మచాముండిక – అనే పేరును కల్గినది, అంబిక కోపం వల్ల పుట్టినది, అసురులకు భయాన్ని కల్గించేది, బ్రహ్మయొక్క అంశతో కూడినది, తన అపచారాన్ని తీర్చుకొనదలచి సమీపంలో మిక్కిలిగా స్తుతిస్తున్నది అయిన కాళిని పరమేశ్వరుడు కృపతో కూడిన చూపులతో రక్షించి, తన క్షేత్రానికి పాలికగా ఉండేటట్లు చేశాడు. అటువంటి, శ్రేష్ఠుడైన కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 283

ఇది వ్యాఘ్రపురమాహాత్మ్యంలో ఉన్నది. ఈ దేవి ఆలయం శ్రీనటరాజస్వామి ఆలయానికి ఉత్తర దిక్కులో రెండు ఫర్లాంగుల దూరంలో శివప్రియ అనే తీర్థానికి తూర్పు

వైపున పడమటి ముఖంగా నిర్మింపబడింది. తిల్లైక్కాళి, బ్రహ్మాచాముండి – అనే పలు పేర్లతో స్తుతింపబడుతూ, నాల్గుముఖాలతో, నాల్గుచేతులతో, ప్రేతాసనంలో ఉండి, భక్తుల అభీష్టాలను తీరుస్తున్నాది. నటరాజస్వామి దర్శనఫలం ఈదేవిని దర్శించిన తరువాతనే సిద్ధిస్తుంది – అని పురాణరహస్యం. ఈ దేవిని గూర్చిన ఉపాసన క్రమాలు, సహస్ర నామం, త్రిశతి మొదలైనవి బ్రహ్మయామళం – అనే మంత్ర శాస్త్రంలో తెలుపబడినవి. ఈ దేవికి పూజాదులు వైదిక క్రమంలో తిల్లైలోని బ్రాహ్మణులచేత అనుష్ఠింపబడుతున్నాయి. ఈ దేవికి ప్రతి సంవత్సరం వైశాఖమాసంలో ఉత్సవం జరుపబడుతున్నది. ఇంకా పలు ఇతిహాసాలున్నాయి. విక్రమార్కుడనే రాజు, కాళిదాసకవి ఈమెను ఉపాసించి, ఈమె అనుగ్రహంతో రెండువేల సంవత్సరాలకాలం రాజుగా, కవులందటిలో గొప్పవాడుగా అయ్యారు. "**విక్రమార్కనృపేంద్రేణ కాళిదాసేన సేవితామ్, సాక్షాత్కుర్వే సదా భద్రాం శివతాండవసాక్షిణీమ్**" అని ఈమెను స్తుతిస్తున్నారు.

---

**శ్లో॥ సర్వేశం సర్వసత్వప్రకృతి మవికృతిం సర్వదం సర్వభూషం**
**సర్వాతీతం సదాఖ్యం సకరుణనయనం సర్వవేదాన్తసారమ్ ।**
**సత్యం సద్వ్యోమసంస్థం సనకమునిముఖైరర్చితం సామగీత్యా**
**ఉత్సాహం సంసదీశం సకలకవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 284**

అన్నిటికి ఈశ్వరుడు, సర్వప్రాణులకు కారణభూతుడు, తనకు వేరొక కారణం లేని వాడు, అన్నిటిని ఇచ్చేవాడు, అన్నిటినీ భూషణంగా కలవాడు, అన్నిటిని దాటినవాడు, సత్‌శబ్దవాచ్యుడు, కరుణనుకల కన్నులను కలవాడు, అన్ని వేదాంతాలలోను సారంగా చెప్పబడినవాడు, సత్యస్వరూపుడు, సద్రూపమైన ఆకాశంలో ఉండేవాడు సనకాది మునులచే స్తుతింపబడేవాడు, సామగానంతో ఉత్సాహాన్ని కలవాడు, చిత్సభకు ఈశుడు, సకల కవులచే స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 284

---

**శ్లో॥ కర్తుం చాకర్తుమేతత్సకలమపి జగచ్చాన్యథా కర్తుమీశః**
**శక్తశ్చాకాశతుల్యో భవితుమపి శివో యస్సమాధిక్యశూన్యః ।**
**జాగ్రత్స్వప్నాతిశాయిపృథుతరసుఖకృత్ స్థానసంస్థోఽపి నైజాం**
**మాయామావిష్కరోతి త్రివిధగుణమయీం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥285**

పరమేశ్వరుడు ఈ సకలలోకాలను సృష్టించడానికి, సృష్టించకుండా ఉండడానికి, వేరువిధంగా చేయడానికి, వీటిలో ఏ సంబంధం లేకుండా ఆకాశం వలె ఉండడానికి

సామర్థ్యాన్ని కలవాడు. తనకుసాటి, మేటి లేనివాడు. అటువంటి పరమేశ్వరుడు జాగ్రం, స్వప్నం, సుషుప్తి అనే ఈ దశలలో గొప్ప సుఖాన్ని కల్గించే స్థానంలో ఉన్నా, త్రిగుణాల వికారమైన తన మాయను ఆవిష్కరిస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 285

---

**శ్లో॥ సాకం గౌర్యా హిమాద్రేర్నికటవరతటే సఞ్చరన్యో నిజాస్య-**
**స్వేదోద్భూతం ప్రభాభిర్విజితదినకరం బాలమాహూయ మోదాత్ ।**
**భౌమాభిఖ్యామజాలి గ్రహయుగమనృణాధీశ్వరత్వం చ వాహం**
**శక్తిం భూషాం దదౌ తం దివిచరవినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥286**

హిమవత్పర్వతం చరియ ప్రాంతంలో పరమేశ్వరుడు గౌరితో సంచరించేటపుడు తన ముఖంలో పుట్టిన స్వేదం నుండి పుట్టినది, కాంతితో సూర్యుని అతిక్రమించేది అయిన శిశువును పిలిచి, భౌముడనే పేరును, మేషం, వృశ్చికం - అనే రెండు స్థానాలను, ఋణాన్ని పోగొట్టే శక్తిని, (మేక) వాహనాన్ని, శక్తి ఆయుధాన్ని, ఆభరణాలను అతనికి ఇచ్చాడు. అటువంటి దేవతలచే స్తుతింపబడే కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. (ఈ కథ పాద్మంలో ఉన్నది.) 286

---

**శ్లో॥ యస్మిన్ దృష్టే పరస్మిన్నచలతి హి మనో దేహభాజాం కదాచిత్**
**యస్మాత్ కుత్రాపి నాన్యో భవతి చ పరమోదేవతా సార్వభౌమః ।**
**ఏకో దాధర్తి తిర్యఙ్నిజవపుషి జగత్ప్రోతమేతం సమస్తం**
**తం చిత్రం చిత్రనృత్తప్రముదితగిరిజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 287**

పరమేశ్వరుని దర్శించేటపుడు ప్రాణులమనస్సు ఏసమయంలోను చలించదు. ఆ పరమేశ్వరునికంటే వేఱు ఉత్తమ దేవత లేదు. ఒకడై ఉండి, తన శరీరంలో అడ్డంగా చేర్చబడిన సమస్త లోకాన్ని ధరిస్తున్నాడు. అటువంటి చిత్ర స్వరూపుడు, ఆశ్చర్యకరమైన తాండవంతో సంతోషించిన పార్వతితో కూడి ఉండేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 287

---

**శ్లో॥ కశ్చిద్భూపాలసూనుర్వృషభమునివరస్యోపదేశాత్ యదీయాం**
**శైవీం విద్యాం జపన్ యత్కవచనుతిమపి ప్రాప్తకామో బభూవ ।**

**తం శర్వం వారిజాక్షద్రుహిణసురపతిప్రేతనాథాగ్నిరక్షః**
**పాశీవాయ్వీశయక్షద్యుమణిశశినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 288**

ఒక రాజకుమారుడు వృషభుడనే మునీశ్వరుని ఉపదేశంతో పరమేశ్వరుని పంచాక్షరిని, శివకవచమనే స్తుతిని జపించి, సకలాభీష్టాలను పొందాడు. అటువంటి శర్వుడు, విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు, యముడు, అగ్ని, నిఋతి, వరుణుడు, వాయువు, ఈశానుడు, కుబేరుడు, సూర్యుడు, చంద్రుడు – అనే వీరిచే స్తుతింపబడేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 288

ఈ కథ బ్రహ్మోత్తరఖండంలో ఉన్నది.

---

**శ్లో॥ యద్రజ్గస్వర్ణకుమ్భం దినకృదనుదినం వీక్ష్య మేరుభ్రమేణ**
**రథ్యం సంరుధ్య మధ్యే క్షణమపి నివసన్ యత్సపర్యా సుజాతమ్ ।**
**ఘణ్టాభాఙ్కారఘోషం త్రిశతదశమఖీవేదమన్త్రాంశ్చ భూయః**
**శ్రుత్వాతిల్లీవనాఖ్యం పురమితి మనుతే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 289**

పరమేశ్వరుని సభలోని స్వర్ణకుంభాన్ని ప్రతిదినం సూర్యుడు చూచి, మహామేరువు అనే భ్రాంతితో తన గుఱ్ఱాలను నిలిపి ఆకాశం మధ్యలో కొంచెం సేపు నిలచి, ఆ పరమేశ్వరుని పూజాకాలంలో చేయబడిన ఘంటానాదాన్ని, త్రిసహస్రమునుల వేద మంత్రాలను విని, తిల్లైవనం – అనే పేరుకల చిదంబరమని తలుస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 289

---

**శ్లో॥ కణ్ఠే కాలో లలాటే హుతభుగురగరాడ్భూషణం చర్మవస్త్రం**
**భూతిర్గ్రన్థో విహాయో నిలయమథ పునః పుష్పవన్తౌ చ నేత్రే ।**
**వృత్తిర్భిక్షా స్వకార్యం నటనమగసుతాప్రేమకాన్తా గజాస్యః**
**సూనుః యస్యాతిచిత్రం సమజనిసదయం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥290**

కంఠంలో నలుపు, ఫాలంలో తెలుపు, సర్పాభరణం, చర్మం వస్త్రం, విభూతి చందనం మైపూత, ఆకాశం నివాసం, సూర్యచంద్రులనే రెండు కన్నులు, జీవనం భిక్ష, స్వకార్యం నటనం, భార్య పార్వతి, గజముఖుడు కుమారుడు – అని ఈ విధమైనవి పరమేశ్వరునకు ఆశ్చర్యకరం అయినవి. అటువంటి, దయనుకల, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 290

---

**శ్లో॥ యత్సంసత్స్వర్ణభిత్తిం పరితరనుపమాస్స్వర్గనార్యః కరాబ్జైః**
**ఆదర్శాద్యష్ట భద్రం కనకమణిమయం యస్య తుష్ట్యై వహన్త్యః ।**
**సేవాం కుర్వన్తి పఞ్చావరణమధిగతైర్బ్రహ్మవిద్యేశపూర్వైః**
**స్తుత్యం తం చిత్రకూటస్థితిభిరథ సురైః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 291**

పరమేశ్వరుని సభలోని గోడలు నాల్గు వైపుల సాటి లేని దేవకన్యలు మణులతో పొదగబడిన అద్దం మొదలైన **అష్టమంగళాలను** (అద్దం, పూర్ణకుంభం, వృషభం, యుగ్మచామరం, శ్రీవత్సం, స్వస్తికం, శంఖం, దీపం – అనే వీనిని) చేతులతో ధరించి సేవిస్తున్నారు. అయిదు ఆభరణాలను పొందినవారు, బ్రహ్మవిద్యేశ్వరులు మొదలైనవారు, చిత్రాలను కల్గిన కోష్ఠాలలో ఉన్నవారు అయిన దేవతలచే స్తుతింపబడే, అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 291

---

**శ్లో॥ భక్తాస్త్రైవష్టిసంఖ్యాద్విజముఖకులజా యత్సపర్యావిశేషైః**
**సారూప్యం యస్య నామ్నాం ముహురపి పఠనాత్ యస్య సామీప్యసిద్ధిమ్ ।**
**సాలోక్యం యస్య భక్తిప్రకరణజనతాసఙ్గసమ్భాషణాద్యైః**
**సాయుజ్యం యస్య భావాదనుపమమభజన్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥292**

అరవై మూడు సంఖ్యను కలవారు, బ్రాహ్మణాది కులాలలో జన్మించినవారైన భక్తులు (63 మంది నాయనార్లు) పరమేశ్వరుని పూజావిశేషాలతో **సారూప్యముక్తిని**, నామ-పారాయణం వల్ల **సామీప్యముక్తిని**, భక్తుల సంగమంతో **సాలోక్యముక్తిని**, ఐక్యధ్యానంలో **సాయుజ్యముక్తిని** పొందారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 292

---

**శ్లో॥ యచ్చిత్రస్తమ్భకక్ష్యామధివిశదఖిలప్రాణివర్గాన్విశుద్ధాన్**
**కుర్వన్ కశ్చిన్మహాత్మా పురుషమృగతనుర్యోగిరాడ్యత్సభాయాః ।**
**పూర్వస్మిన్ద్వారదేశే నివసతి హృదయే సన్తతం యం విచిన్వన్**
**తం దేవం చిద్విలాసప్రకటితనటనం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 293**

పురుష మృగ రూపంతో కూడిన మహాత్ముడైన ఒక యోగీశ్వరుడు చిత్రస్తంభాలతో నిండిన ప్రాకారాన్ని చేరిన ప్రాణుల దురాచారాలను పోగొట్టి, వారిని విశుద్ధులుగా చేసి, నటరాజస్వామి సదా హృదయంలో ధ్యానిస్తూ, పరమేశ్వరుని చిత్సభకు తూర్పున

నివసిస్తున్నారు. అటువంటి చిద్విలాసాన్ని ప్రకటించే నర్తనాన్ని చేసేవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. ఈకథ చిదంబర రహస్యంలో తెలుపబడింది. 293

**శ్లో॥ భేజే త్రైశఙ్కవీయాం స్థితిమపి చ గలే యస్య శంభోః కరాలః**
**క్ష్వేలః కల్పాన్తకాలజ్వలనకబలనజ్వాలకల్లోలకీలః ।**
**సాతఙ్కాహార్యజాయాస్సభయమధుభిదో వారణప్రేరణాభ్యాం**
**భూయో భూయస్తమాద్యం జలదగలరుచిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥294**

శంభువు అయిన పరమేశ్వరుని కంఠంలో భయంకరమైన కల్పాంతకాలంలో పుట్టిన అగ్నిని మింగివేసే జ్వాలలో వ్యాపించిన విషం (హాలాహలం) ఆతంకంతో కూడిన అంబికచేత భయంతోకూడిన విష్ణువుచేత, మాటిమాటికి చేయబడిన వారణ – ప్రేరణవల్ల (అంబిక చేసిన వారణవల్ల , విష్ణువు చేసిన ప్రేరణవల్ల) త్రిశంకువుయొక్క స్థితిని పొందినది. (లోపలకుపోలేక, బయటకు రాలేక మధ్యలోనే ఉన్న స్థితిని పొందినది) అయినది. అటువంటి ఆద్యుడు, మేఘంవంటి కంఠకాంతికలవాడు, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 294

**శ్లో॥ లోకేష్వద్వైతవిద్యాం ప్రకటయితుమనా యస్స్వయం కృత్తివాసాః**
**మోదాత్సర్వజ్ఞపీఠస్థితిజుషమమలం శఙ్కరాఖ్యం యతీన్ద్రమ్ ।**
**స్వాంశాన్నైజాఙ్ఘ్రిపూజా ప్రశమితతమసాం భూసురాణాం కులాబ్ధౌ**
**ఉత్పాద్యాన్వగ్రహీత్తం శుకమునివినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥295**

పులితోలును ధరించిన పరమేశ్వరుడు తానే సంతోషంతో లోకంలో అద్వైత విద్యకు ప్రచారం చేయగోరి సర్వజ్ఞపీఠాన్ని అధిరోహించినవాడు, పరిశుద్ధుడు, శంకరుడనే పేరునుకల, ఒక యతిశ్రేష్ఠుని తన అంశనుండి తన పాదపూజను చేసినందున అజ్ఞానాన్ని పోగొట్టుకొన్న (త్రిసహస్ర మునుల) బ్రాహ్మణుల కులంలో జన్మింపజేసి, అనుగ్రహించాడు. అటువంటి, శుకమునిచే స్తుతింపబడిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 295

**శ్లో॥ పాతాలే మర్త్యలోకే దివి చ పురరిపోర్యాని యాని ప్రియాణి**
**క్షేత్రాణ్యాసన్ తదస్తస్థితిమధిజుషతాం లిఙ్గబేరాదిమానామ్ ।**

**హేతుః శ్రీమూలనాథః శివజనిమవరో యత్సభోదీచిభాగే**
**కక్ష్యాయాం భాతి నిత్యం తమఖిలజనకం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥296**

పాతాళం, భూమి, స్వర్గం – అనే వీటిలో పురారి అయిన పరమేశ్వరునకు ఏయే క్షేత్రాలు ప్రియమైనవో, ఆయా క్షేత్రాల మధ్యలో ప్రకాశించే శివలింగాల మూర్తులు మొదలైన వానికి కారణభూతుడు, శ్రీమూలనాథుడనే పేరుకల్గిన, స్వయంభువు అయిన శివలింగం పరమేశ్వరుని సభలో కుడివైపున ఉండే ప్రాకారంలో సదా ప్రకాశిస్తున్నది. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 296

---

**శ్లో॥ బ్రహ్మన్! సృష్టిం యథా వక్తిమపి చ కురుషే భో! హరే! రక్షకత్వం**
**సాధ్యన్తే రుద్రభావం మమ చ వహసి కిం పాల్యతేఽసౌ త్రిలోకీ ।**
**కేనానుష్ఠీయతే కిం భువి చ మునివరైర్యజ్ఞ ఇత్థం స్వసేవా-**
**నమ్రం యో దేవవర్గం ముదయతి వచసా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥297**

పరమేశ్వరుడు తనను సేవించి, నమస్కరించిన దేవసముదాయాన్ని ఉద్దేశించి – “ ఓ బ్రహ్మా! సృష్టికార్యాన్ని విధి ప్రకారంగా చేస్తున్నావా! ఓ విష్ణూ! రక్షణకార్యం నీకు సాధ్యమవుతున్నదా? ఓ రుద్రా! నీవు రుద్రభావాన్ని పొందుతున్నావా? ఇపుడీ ముల్లోకాలు ఎవరిచే రక్షింపబడుతున్నది? భూమిలో మునిశ్రేష్ఠులచే యాగాలు అనుష్ఠింపబడు-తున్నాయా? ” అని ఈ రీతిలో తన వాక్కులతో సంతోషించేటట్లు చేస్తున్నాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 297

---

**శ్లో॥ నిర్మాతౄణాం ఘటానాం కులజలధిమణిర్నీలకణ్ఠాభిధోఽయం**
**పశ్యన్నిత్యం మునీనాం నయవచనగణైర్యోగిరాట్ ప్రత్యయార్థమ్ ।**
**స్వస్త్రీ దణ్డాగ్రహస్తస్సరసి సశపథం గాహమానః ప్రపేదే**
**తారుణ్యం యత్ప్రసాదాత్తమనణుమగురుం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥298**

కుమ్మరికులంలో జన్మించిన నీలకంఠుడనే భక్తుడు పరమేశ్వరుని నిత్యం దర్శించి, విశ్వాసంతో త్రిసహస్రమునుల న్యాయంతోకూడిన వచనాలను పురస్కరించుకొని తన భార్యచేతిలో ఉండే దండం యొక్క చివరిభాగాన్ని పట్టుకొని యౌవనేశ్వరమనే తీర్థంలో శపథం చేస్తూ స్నానం చేసి, పరమేశ్వరానుగ్రహంవల్ల యౌవన దశను పొందాడు. అటువంటి, అణువుకాని, గురువుకాని, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 298

ఈ కథ పెరియ పురాణంలోను చిదంబర పురాణంలోను ఉన్నది.

---

శ్లో॥ **లాస్యం ద్రష్టుం యదీయం శిఖిని దశ శిరాంస్యాజుహోవాతిభక్త్యా**
**రక్షోనాథస్తథాద్రేర్నికటభువిఫణామణ్డలం భోగిరాజః ।**
**అన్యే దేవాశ్చ దైత్యాః తపసి చ కఠినే స్వాం తనూం నిర్దహన్తో**
**జాతాస్సిద్ధాశ్చ సాధ్యా నరహరివినుతం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 299**

పరమేశ్వరుని తాండవాన్ని చూడగోరి రాక్షసేంద్రుడైన రావణుడు చాల భక్తితో అగ్నిలో తన పది శిరస్సులను ఖండించి, హోమం చేశాడు. ఆ విధంగానే, కైలాసం చరియ ప్రాంతంలో ఆదిశేషుడు తన శిరస్సుల సమూహాన్ని అగ్నిలో హోమం చేశాడు. ఇంకా, ఇతర దేవతలు, దైత్యులు, సిద్ధులు, సాధ్యులు కఠిన తపస్సులో తమ తమ శరీరాలను దహించుకొన్న వారయ్యారు. అటువంటి, నృసింహస్వామిచే స్తుతింపబడిన, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 299

రావణుడు చేసిన శివతాండవ స్తవం ఈ మూర్తిని ఉద్దేశించినదే.

---

శ్లో॥ **స్వామిన్! సంసారవార్ధా వధికభయకరే దుస్తరే పాశనక్ర-**
**చ్ఛన్నే మగ్నాన్తరం మామనధిగతసదాచారవృత్తిం శఠాగ్ర్యమ్ ।**
**దీనం త్వత్పాదపూజా విముఖమఘయుతం రక్షరక్షేత్యజస్రం**
**సర్వే లోకాః శ్రయన్తే యమపి సదసి తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥300**

స్వామీ! అతిభయంకరమైనది, దాటరానిది, పాశమనే మత్స్యాలతోనిండినది అయిన సంసారమనే సముద్రంలో మునిగినవాడు, సదాచారశూన్యుడు, శఠుడు, దీనుడు, నీ పాదాన్ని అర్చించనివాడు, పాపంతో కూడినవాడనైన నన్ను రక్షించాలి. రక్షించాలి – అని ప్రాణులంతా సభలో పరమేశ్వరుని సేవిస్తారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 300

---

శ్లో॥ **యద్యప్యైశ్వర్యభాజో విధిహరిముఖరాస్సన్తి దేవా జగత్యాం**
**తేషాం కశ్చిద్యుగాన్తే న హి పునరపరో రుద్ర ఏకో మహర్షిః ।**
**దేవో విశ్వాధికోగ్ర్యో భవతి విభురితి ప్రాహురశ్రాన్తవాచః**
**వేదాయం పఞ్చభూతప్రభవలయకరం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 301**

లోకంలో ఐశ్వర్యాలతో కూడినవారైన బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలున్నారనేది వాస్తవం. ఆవిధంగా ఉన్నా, వారిలో ఎవరైనా యుగాంతకాలంలో ప్రాణాలతో నిలచిన వారులేరు. ఆకాలంలో మహర్షి, రెండవాడు లేనివాడు, దేవుడు, లోకాన్ని అధిగమించినవాడు, ప్రథముడు, విభువు అయిన రుద్రుడు ఒక్కడే ప్రకాశిస్తున్నాడు – అని (శాంతి పొందని వాక్కులైన వేదాలు పరమేశ్వరునిగూర్చి పల్కుతున్నవి.) అటువంటి, పంచభూతాలకు ఉత్పత్తి వినాశాలను చేసే, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 301

---

**శ్లో॥ యస్మాచ్చన్ద్రార్ధచూడాన్మృదుహసితముఖాన్నీలకణ్ఠాత్ త్రిణేత్రాత్**
**వేదాన్తోద్గీతవృత్తాద్విధిహరిజనకాత్ విశ్వమాయావిలాసాత్ ।**
**వామావామాఙ్గభాగాత్ భసితవరతనోః చిత్సభేశాత్ మమైతత్**
**చేతో నాన్యం సురేన్ద్రం స్మరతి నటపతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥302**

ఈ శ్లోకం నుండి వరుసగా నాల్గుశ్లోకాలతో కవి తన అనుభవాన్ని వ్యక్తీకరిస్తున్నాడు.

అర్ధచంద్రుని ధరించినవాడు, మందహాసంతోకూడినవాడు, నీలకంఠాన్నికలవాడు, మూడుకన్నులనుకలవాడు, వేదాంతాలలో చెప్పబడ్డ చరిత్రలను కలవాడు, బ్రహ్మ విష్ణువులను గ్రసించినవాడు, గొప్ప మాయావిలాసాన్ని కలవాడు, స్త్రీరూపమైన వామభాగాన్ని కలవాడు, విభూతిని అలంకరించుకొన్న తిరుమేనిని కలవాడు, చిత్సభకు ఈశుడు అయిన పరమేశ్వరుని కంటే వేఱయిన దైవాన్ని నా చిత్తం స్మరించదు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 302

---

**శ్లో॥ బాల్యే క్రీడావిముగ్ధః పునహమభవం యౌవనే మీనకేతోః**
**లక్ష్యో లజ్జావిహీనః పరముదరభృతౌ కాకవత్సార్వకాలమ్ ।**
**దేశాద్దేశాదటన్ త్వత్పదయుగజలజం నార్చయం పాపయోగాత్**
**సర్వం తత్ క్షమ్యతామిత్యయమహమభజం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥303**

బాల్యంలో క్రీడలతో మూఢుడను, యౌవనదశలో మన్మథునకు లక్ష్యమైనవాడను, లజ్జలేనివాడను, ఎల్లప్పుడు కాకివలె పొట్ట నింపుకోవడంకోసం అన్ని ఊళ్ళలో తిరిగి, పాప సంబంధంచేత తామరపూవువంటి నీ రెండు చరణాలను పూజించలేదు. వీనిని అన్నిటిని సహించాలి – అని పరమేశ్వరుని నేను ఆశ్రయించాను. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 303

---

శ్లో॥ సద్వృత్తాం స్రగ్ధరాజ్ఞాం విపులగుణవరాలఙ్కృతిం మఞ్జుపాక-
స్థాయీశయ్యారసాద్యై ర్విబుధపరిబృఢాహ్లాది రీతిం సువృత్తిమ్ ।
వేదాన్తార్థ ప్రబోద్ధ్రీం సుగుణపదగతిం యోఽస్మదీయాం స్తుతిం తాం
అఙ్గీకుర్వన్ సుఖం మే ప్రదిశతి గురు తం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥304

స్రగ్ధర అనే వృత్తాన్ని కల్గినది, విస్తారమైన గుణాలు, గొప్ప అలంకారాలు, అందమైన పాకం, స్థాయి, శయ్య, రసం – అనే వీటితో విద్వాంసులకు సంతోషాన్ని కల్గించే రీతిని కల్గినది, మంచి వృత్తితో కూడినది, వేదాంతాలలో చెప్పబడిన అర్థాలను బోధించేది, మంచిగుణాలతో కూడిన పదవిన్యాసాలను కల్గినదైన కుంచిత్రాంఘ్రిస్తవమనే ప్రసిద్ధమైన ఈ స్తుతి అంగీకరించి పరమేశ్వరుడు నాకు అధికమైన సుఖాన్ని (ఆత్మసుఖాన్ని) ఇచ్చాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 304

---

శ్లో॥ యశ్శమ్భుర్నృత్తరాణ్మే ప్రబలతరమహామన్త్రసిద్ధిం ప్రదత్వా
గుర్వీం యోగస్య సిద్ధిం జననమృతిహరం చాత్మబోధం మహాన్తమ్ ।
సూతాదీనాం విముక్తిప్రదమపి మహితం గౌరవం పత్రమూలం
స్వం నృత్తం దర్శయిత్వా సుఖయతి నితరాం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥305

శంభువైన నటరాజు నాకు చాలా బలమైన మహామంత్రాల సిద్ధిని, జన్మమరణాలను పోగొట్టడమనే ఆత్మభోగాన్ని, సుతాదులకు విముక్తిని కల్గించగల్గినది, గొప్పదైన పత్రాన్ని వ్రాసి పంపడం ద్వారా గౌరవించి, తన తాండవాన్ని దర్శింపజేసి, చాలా సుఖాన్ని పొందిన వానినిగా చేశాడు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 305

---

శ్లో॥ క్రోశం క్రోశం యదగ్రే స్వపతిమపి రతిర్మన్మథం శ్రీకుమారం
శార్దూలాఙ్ఘ్రేశ్చ డిమ్భస్సుఖతరమభజద్దుగ్ధకల్లోలరాశిమ్ ।
స్తావం స్తావం వరేణ్యం గగననటపతిం యం చ వాచామలక్ష్యం
తోషం తోషం లభన్తే సకలమపి జనాః కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 306

పరమేశ్వరుని ముందు రతిదేవి రోదించి రోదించి, తన భర్త, లక్ష్మీపుత్రుడైన మన్మథుని, వ్యాఘ్రపాదుని కుమారుడైన ఉపమన్యువు అనే వారు పాలసముద్రాన్ని, సుఖాలను పొందారు. ఆకాశంలో నాట్యం చేసేవాడు, శ్రేష్ఠుడు, వాక్కులకు అందనివాడు అయిన

పరమేశ్వరుని స్తుతించి స్తుతించి జనులు చాలా సంతోషంతో సకలాభీష్టాలను పొందు తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 306

---

శ్లో॥ **మన్దం మన్దం యదీయం జనిమసురసరిద్వారయా వ్యాసజాద్యాః**
**సేకం సేకం విరాజో హృదయమధిగతం యత్పదం భావయన్తః ।**
**కాలం కాలం దహన్తో దురధిగమతమః కాననం జ్ఞానయోగాత్**
**లాభం లాభం ప్రబోధం వరసుఖమభజన్ కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥307**

వ్యాసపుత్రుడైన శుకుడు మొదలైన మునులు మెల్లమెల్లగా పరమేశ్వర స్వరూపమైన లింగాన్ని శంకరతీర్థంలో అభిషేకించి, విరాట్ పురుషుని హృదయాన్ని పొందిన ప్రతికాలం లోను భావన చేసి, జ్ఞానయోగంతో అజ్ఞానమనే అరణ్యాన్ని పోగొట్టి, ఆత్మజ్ఞానాన్ని పొంది, శ్రేష్ఠమైన సుఖాన్ని పొందారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 307

---

శ్లో॥ **భోజం భోజం యదర్చాజనితమనుపమం భోగమధ్యాత్మయోగాత్**
**తారం తారం భవాబ్ధిం విపులభయకరం యస్య భావాత్ సుధీన్ద్రాః ।**
**దాహం దాహం హృదన్తర్గతమతిజరఠం పాశవర్గం యదర్ణం**
**జాపం జాపం రమన్తే పరమహసిపదే కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 308**

జ్ఞానులు పరమేశ్వరుని పూజవల్ల కలిగేది, సాటి లేనిది అయిన భోగాన్ని అనుభవించే ఆధ్యాత్మ యోగంతో చాలా భయంకరమైన సంసారమనే సముద్రాన్ని దాటి, పరమేశ్వరుని భావనతో హృదయంలో ఉన్నది, చాలా వార్ధక్యాన్ని పొందినది అయిన పాశవర్గాన్ని దహించి, పరమేశ్వరుని మంత్ర వర్ణాలను జపిస్తూ జ్యోతిర్మయమైన స్థానంలో క్రీడిస్తారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 308

---

శ్లో॥ **బోధం బోధం యదీయం నటనమనుపమం శ్రౌతతత్త్వార్థగర్భం**
**ధ్యాయం ధ్యాయం హృదబ్జే యమపి చ మహసాం పుఞ్జమవ్యాజమూర్తిమ్ ।**
**వాహం వాహం యదఙ్ఘ్రిం మనసి ఫణితరక్ష్వఙ్ఘ్రిం జైమిన్యభిఖ్యాః**
**ప్రాపుస్సర్వే సదా యత్సదసి నివసతిం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 309**

పతంజలి, వ్యాఘ్రపాదుడు, జైమిని – అనే మునులు పరమేశ్వరునిది, సాటి లేనిది,

వేదాలలో చెప్పబడినది అయిన నర్తనను చూచి, "హృదయంలో కారణం లేకుండా దానిని మూర్తీకరించుకొని, కాంతి సమూహమైన పరమేశ్వరుని ధ్యానించి, ఆ స్వామి పాదాలను మనస్సులో భావించి, సదా పరమేశ్వరుని సభలో నివసిస్తున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 309

**శ్లో॥ వాచం వాచం మహాన్తశ్శివహరగిరిజాకాన్తదేవేతి పూతాః**
**వర్జం వర్జం వివర్జ్యం బహుతరవిషమక్లేశమాయావిమోహమ్ ।**
**త్యాగం త్యాగం కఠోరాం త్రివిధపరిచయామీషణాఖ్యాం పిశాచీం**
**ధ్యాయన్తోఽయం భజన్తే సతతమపి శివం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥310**

మహాత్ములు, "హర! గిరిజాకాంత! దేవ" అనే నామాలను సదా ఉచ్చరించి, పరిశుద్ధులై, పోగొట్టుకొనరాని, అధికమైనక్లేశాన్ని కల్గించే, మాయా విమోహాన్ని దూరం చేసికొని, కఠినమైన త్రిగుణ సంబంధాన్ని కల ఆశ అనే పిశాచాన్ని ధ్యానించి శివ స్వరూపి అయిన పరమేశ్వరుని సదా సేవిస్తారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 310

**శ్లో॥ ధావం ధావం సదా యత్ప్రియకరనిలయం భూతిరుద్రాక్షవర్గైః**
**భూషం భూషం స్వకీయాం తనుమపి చరితం యస్య వేదాన్తగీతమ్ ।**
**కర్ణం కర్ణం నితాన్తం త్రిషవణయజనం బ్రహ్మనిష్ఠా యతీన్ద్రాః**
**కారం కారం లభన్తే భవపద మభవం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥ 311**

బ్రహ్మనిష్ఠులైన సన్న్యాసులు సదా పరమేశ్వరునకు ఇష్టమైన క్షేత్రాలను చేరి, భస్మ రుద్రాక్షలతో తమ శరీరాలను అలంకరించుకొని, పరమేశ్వరుని వేదాంతాలలో చెప్పబడిన చరితలనువిని, మిక్కిలిగా మూడు కాలాలలో పూజించి, ఉత్పత్తిలేని బ్రహ్మపదాన్ని పొందుతున్నారు. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 311

**శ్లో॥ నామం నామం సదాయం నటపతి మలభం సత్కలత్రం సుపుత్రం**
**పాఠం పాఠం యదగ్రేఽప్యకృతకవచనాన్యాపమబ్జాకటాక్షమ్ ।**
**వారం వారం విభుం యం హవిరహ మదదాం సప్త తన్తుష్వచిన్త్యం**
**నిత్యం నిత్యం ప్రపద్యే శరణ మసులభం కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥312**

చివరిగా రెండు శ్లోకాలలో కవి తన అనుభూతిని పల్కుతూ స్తుతిని పూర్తిచేస్తున్నారు.

నేను ఎల్లప్పుడూ పరమేశ్వరుడైన నటరాజును నమస్కరించి, మంచి భార్యలను, మంచి పుత్రులను పొందాను. పరమేశ్వరుని సన్నిధిలో వేదమంత్రాలను ( శ్రీ రుద్రం, కైవల్యం, తైత్తిరీయం మొదలైన ఉపనిషత్ మంత్రాలను) పారాయణం చేసి, లక్ష్మీకటాక్షాన్ని పొందాను. నేను యాగాలలో విభువైన పరమేశ్వరుని ఉద్దేశించి హవిస్సులను అర్పించాను. నిత్యుడైన పరమేశ్వరుని శరణు పొందాను. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజ మూర్తిని భజిస్తున్నాను. 312

---

**శ్లో॥ శ్రావం శ్రావం శ్రుతిభ్యాం యదమలచరితం యత్పదామ్భోజమాధ్వీం**
**పాయం పాయం సభాయాం మమ చ రసనయా యం ప్రభుం మానసేన ।**
**స్మారం స్మారం ప్రసన్నం శ్రుతిశిఖరగతం భుక్తిముక్తిప్రదం యం**
**దర్శం దర్శం ప్రబుద్ధోస్మ్యతనుబుధదృశా కుఞ్చితాఙ్ఘ్రిం భజేఽహమ్ ॥313**

పరమేశ్వరుని పరిశుద్ధాలైన చరిత్రలను చెవులతో విని, ఆ పరమేశ్వరుని పాదపద్మాలరసాన్ని నా జిహ్వతో ఆస్వాదించి, వేదాంతాలలో ఉండేవాడు, ప్రసన్నుడు అయిన పరమేశ్వరుని ధ్యానించి, భోగమోక్షాలను ఇచ్చే పరమేశ్వరుని దర్శించి, జ్ఞాన నేత్రంతో కూడినవాడనయ్యాను. అటువంటి, కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను. 313

---

**శ్లో॥ ఏతత్ స్తోత్రం పఠన్తి ప్రతిదిన మసకృద్యే మమోమాపతేర్వా-**
**గుద్భూతం చిత్సభాయాం విరచితపరమానన్దనృత్తస్య శమ్భోః ।**
**అగ్రే లబ్ధ్వాఽఖిలేష్టానిహ తనయకలత్రాదిమానాత్మయజ్ఞా-**
**దన్తే కైవల్యసంజ్ఞం పదమపి మనుజా స్సంలభన్తాం నితాన్తమ్ ॥ 314**

**ఇది ఫలశ్రుతి శ్లోకం.**

ఉమాపతి అనే నా వాక్కునుండి పుట్టినది, చిత్సభలో పరమానందతాండవాన్నిచేసే శంభువైన పరమేశ్వరుని ఉద్దేశించినది అయిన ఈ స్తోత్రాన్ని ప్రతిదినం మాటిమాటికి ఎవడు పఠిస్తారో, వారు ఈ భూమిలో మిక్కిలిగా మంచి భార్యలు, పుత్రులు, సంపద - మొదలైన సకలాభీష్టాలను పొంది జ్ఞానం కలవాడై, చివరలో కైవల్యమనే పేరు గల పదవిని పొందుతాడు.

---

**శ్లో॥ ఉమాపతిర్నామ వనాశ్రమోఽహం త్రయోదశాధిక్యశతత్రయాన్వితమ్ ।**
**శ్రీకుఞ్చితాఙ్ఘ్రిం స్తవరాజముక్త్వా సాక్షాదపశ్యం నటనం సభాపతేః ॥ 315**

ఇతి శ్రీమదుమాపతిశివ ప్రణీతః

**శ్రీ కుఞ్చితాఙ్ఘ్రిస్తవః సమ్పూర్ణః**

ఉమాపతి అనే పేరును కల, వర్ణాశ్రమియైన నేను - 313 సంఖ్యతో కూడిన కుంచితాంఘ్రిస్తవమనే పేరునుకల స్తుతిని పల్కి, సభాపతియొక్క నర్తనాన్ని సాక్షాత్తుగా దర్శించాను.

ఇందువల్ల దీనిని పారాయణ చేసేవారికి నటరాజస్వామి తాండవ దర్శనం కల్గుతుందని తెలుపబడింది.

శ్రీకుంచితాంఘ్రిస్తవం సంపూర్ణం.

కుంచితాంఘ్రిని కల్గిన నటరాజమూర్తిని భజిస్తున్నాను.

**-- శ్రీః --**